# కలాల వనంలో
# కలుపు మొక్కలు



మీడియా సంస్థలు, ప్రతినిధుల నిజస్వరూపంపై

తొలి నవల

## బెండాళం క్రిష్ణారావు

------------------------------------------------------------

ముఖ్య గమనిక: –

ఈ నవలలో పాత్రలు, ప్రాంతాలు,సంస్థలు పేర్లు, సన్నివేశాలు, సంఘటనలు అన్నీ కేవలం కల్పితం, ఎవరినీ ఉద్దేశించి రాసినవికావు,

------------------------------------------------------------

# అంకితం

మీడియా మహాసౌధాలకు
రాళ్లెత్తిన కూలీలుగా
మిగిలిపోయిన
నిజాయితీగల కలం కార్మికులకు......

ఎర్నలిస్టులుగా ఎదగలేక
కేవలం జర్నలిస్టులుగానే
జీవన సమరం సాగిస్తున్న
అక్షర సైనికులకు......

-----------------------------------------------------------

## కలాల వనంలో

# కలుపు మొక్కలు

---

ఆదివారం సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది.
దూరంగా ఆకాశంలో మిణుకు మిణుకుమంటూ ఉదయిస్తున్న నక్షత్రాలు.....
పట్టణంలో ఒక్కొటిగా కళ్లు తెరుచుకుంటున్న విద్యుత్ దీపాల వెలుగులు..
సముద్రంపై నుంచి తీరానికి వస్తున్న గాలిపరిమళం...

విశాఖ బీచ్‌లో సందర్శకుల కోలాహలం– పడమటి దిక్కుకు జారిపోతున్న సూర్యుడు.

ఆవరించుకుంటున్న మసకచీకట్లతో పాటు పరుచుకుంటున్న వెలుగుల మధ్య కదిలి పోతున్న మనుషుల వెంట నడిచిపోతున్న నీడలు....

ఒకవైపు సముద్ర తరంగాల తాకిడికి నిశ్చలంగా కన్పిస్తున్న యారాడకొండ. విశాఖపట్నం ఆవిర్భావ వికాసాలకు ప్రతీక.

నగరం క్షణ క్షణానికీ విస్తరిస్తున్నా నాగరికతలు పెరుగుతున్నా మనుషుల మనసులు మాత్రం అంతకంతకూ కుంచించుకుపోతున్నాయి.

మధ్యాహ్నం మూడుగంటలనుంచీ ఆర్కే బీచ్‌లో ఇసుకతిన్నెపై నడుంవాల్చి అదేపనిగా ఆలోచిస్తున్నాడు అశోక్‌వర్ధన్. ఆలోచనలు మెదడునిండా అల్లుకునిపోతూ మనసును ఉక్కిరిబిక్కిరి చేస్తుండగా చెవిలో జోరీగలా విష్ణుప్రకాశ్ మాటలే విన్పిస్తున్నాయి.

విష్ణుప్రకాశ్ ఎవరోకాదు ఆశోక్‌వర్ధన్ స్టాఫ్ రిపోర్టర్ గా పనిచేస్తున్న 'త్రిముఖం' దినపత్రికకు న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్. స్వస్థలం కృష్ణాజిల్లా. 'త్రిముఖం' ఎమ్‌డి రామకోటిదీ ఈయనదీ ఒకే కులం కావడంతో ఆ పొజిషన్లో సెటిల్‌కావడం ఆయనకు పెద్ద కష్టం కాలేదు.

అక్షరాలను ఆయుధాలుగా చూపించి రిపోర్టర్లద్వారా కలెక్షన్లు రాబట్టడంతో ఈయన దిట్ట. అందుకే రామకోటికి ఈయనంటే వల్లమాలిన అభిమానం. అంతేకాదు రామకోటికిచెందిన బినామీ ఆస్థులన్నింటి వ్యవహారాలుకూడా ఈయనే చూస్తుంటాడని అంతా చెప్పుకుంటూ ఉంటారు. అందుకే విష్ణుప్రకాశ్ ఏం చెబితే రామకోటికి అదే వేదం.

అంతకుముందు శ్రీరామమూర్తి అనే ఒక పెద్దాయన ఆపోస్టులో ఉండేవాడు. మొదట్నుంచీ నైతిక నిబద్ధత గల ఆపెద్దాయనని పక్కకు తప్పించేసి ఆయనసీట్లో విష్ణు ప్రకాశ్ తిష్టవేసాడు.

న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ అన్న హెూదాతోనే న్యూస్‌ఎడిటర్లకు, బ్యూరోఇన్‌ఛార్జ్‌లకు, స్టాఫ్ రిపోర్టర్లకు కలెక్షన్ టార్గెట్లు ఇచ్చి అవి వసూలయ్యేవరకూ వేపుకుతింటాడు. తన ముగ్గురు కూతుళ్ల పెళ్లిళ్లూ సీమంతాలూ కేవలం తనసంస్థలో పనిచేసే విలేకరులనుంచి సొమ్ములు పిండేసి కానిచ్చేసాడంటే ఆయన చాకచక్యం ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

విష్ణు ప్రకాశ్ అభిమానం చూరగొనాలంటే ఏ రిపోర్టరైనా రాయాల్సింది మంచివార్తలు, స్టోరీలు కాదు. చేయాల్సిందల్లా బ్లాక్‌మెయిల్ జర్నలిజం బాగాచేసి సంపాదించిన సొమ్ములో కొంత ఆయన కు సమర్పించుకోవడమే. ఇది గుర్తించిన చాలామంది జర్నలిస్టుల ముసుగులోని ఎర్నలిస్టులు నైతిక విలువలకు నీళ్లొదిలేసి పత్రికను పడుపుగత్తెకన్నా హీనంగా మార్చేసి సొమ్ములవసూళ్లద్వారా ఆయన ని సంతృప్తి పరుస్తూ తాము సంతోషపడిపోతూ తమంతటివారు ఎవరూ లేరన్నంతగా జబ్బలు చరుచుకుంటూ ఉంటారు. అటువంటి విష్ణుప్రకాశ్ మాటలే ఇంకా అశోక్‌వర్ధన్ చెవుల్లో గింగుర్లు తిరుగుతున్నాయి.

"వార్తలు రాస్తే సరా...? పుస్తకాలు చదివితే సరా?..నీకు జర్నలిజం అంటే ఏమిటో తెలుసా? ఏం చేస్తున్నావో అర్థమౌతోందా...? ఇలాగైతే నిన్ను ఉద్యోగం నుంచి పీకేస్తే అడిగేదెవడు.....?" ఇలా ఆయన నోటినుంచి తిట్ల ప్రవాహం మొబైల్ ఫోన్‌స్పీకర్ నుంచి ఆగకుండా ఆరోజు ఉదయమే అశోక్‌వర్ధన్ మనసును కలవరపెట్టింది.

అందుకే 'ఈ ఉద్యోగంలో కొనసాగడమా ? లేదా తప్పుకోవడమా ?' అనే రెండు ప్రశ్నలు అతని మెదడుని తొలిచేస్తున్నాయి. ఏదీ తేల్చుకోలేని స్థితిలో ఆ ఇసుకతిన్నెపై ఏకాంతంగా సతమత మౌతున్నాడు.

xxxx xxxx xxxx

అశోక్ వర్ధన్ ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగం విశాఖపట్నంలోనే. అతని సొంతూరు కాకినాడ. అతని తండ్రి సూర్య ప్రసాద్ ఒకప్పుడు రాష్ట్రంలోనే బాగా పేరుపొందిన పత్రికా సంపాదకుడు. సూర్యప్రసాద్ ఎప్పుడో ఆంధ్రపత్రికద్వారా తన పాత్రికేయ జీవితాన్ని ప్రారంభించి ఆతర్వాత జనవాణి, ఆంధ్రప్రభ వంటి పత్రికల్లో పనిచేసి 'యుగోదయం' పత్రికకు ఎడిటర్‌గా పనిచేస్తూ రిటైర్ అయ్యాడు.

ఆ కాలంలో ఎడిటర్ల జీతాలు మూడునాలుగంకెలకు మించకపోయినా అష్టకష్టాలు పడి అశోక్‌వర్ధన్‌ను ఎంబిఏ వరకూ చదివించాడు. కందుకూరి వీరేశలింగం, కాశీనాధుని నాగేశ్వరరావు

, నార్ల  వెంకటేశ్వరరావు వంటి అభ్యుదయ పాత్రికేయుల ఆశయాలను కొనసాగించాలనే తపన ఎప్పటికీ  సూర్యప్రసాద్‌లో కన్పిస్తూ ఉంటుంది. ఇప్పటికి  వయసు ఆరు పదులు దాటింది గానీ అదే తపన నిరంతరం ఆతని ప్రతి మాటలోనూ విన్పిస్తుంది.

అశోక్ వర్ధన్‌కు పదేళ్ల వయసులోనే అతని తల్లి నాగలక్ష్మి మలేరియాతో కన్నుమూసింది. అప్పటి నుంచీ తల్లి కూడా తానే అయి సూర్య ప్రసాద్ కుటుంబాన్ని నడుపుకొచ్చాడు. ఒకగానొక్క కొడుకైన ఆశోక్ వర్ధన్ ను బాగా చదివించాడు. మరో పెళ్లి చేసుకుంటే వచ్చే సవతి తల్లి ఎక్కడ ఆతనికి ఆరళ్లు పెడుతుందోనని పెళ్లి ఆలోచనను కలలో కూడా ఆతను చేయలేదు.

చిన్నవాడిగా ఉన్న అశోక్‌వర్ధన్ ను చూసుకోవడానికి పురుషోత్తం అనే మగ ఆయాని పెట్టాడు. అశోక్‌వర్ధన్ కు చిన్నతనంలో తల్లి దూరమైందన్న మాటేగానీ మిగిలిన విషయాల్లో ఏలోటూ రానీయకుండా చూసుకున్నాడు సూర్యప్రసాద్.

చిన్నప్పటి నుంచీ చదువుపై బాగా శ్రద్ధ చూపించే అశోక్‌వర్ధన్ చురుకైన విద్యార్థిగా పేరు సంపాదించాడు. హైదరాబాద్‌లో ప్రారంభమైన అశోక్ వర్ధన్ చదువు విశాఖపట్నంలో ఎంబిఏ తో ముగిసింది. తండ్రీ కొడుకులిద్దరూ విశాఖపట్నంలోనే ఉంటున్నారు.

ఆరోజు రాత్రి పదిగంటలౌతున్నా ఇంకా అశోక్‌వర్ధన్ ఇంటికి చేరకపోవడంతో సూర్యప్రసాద్ మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది.

×××× ×××× ××××

సరిగ్గా ఇరవై సంవత్సరాలకు ముందు .......

హైదరాబాద్‌లో బాగా సంపన్నులుండే ప్రాంతం 'బంజారా హిల్స్'....అందులో అంతా అధునాతనమైన హంగులతో ఉన్న నాలుగంతస్తుల భవనం. అందులోనే మూడు అంతస్తుల్లో కొన సాగుతోంది 'నారాజ్యం' దినపత్రిక కార్యాలయం.

గ్రౌండ్ ఫ్లోర్‌లో ప్రింటింగ్ మెషినరీ అంతా ఉంది. మిగిలిన మూడు ఫ్లోర్లలో ఒకటి ఎడిటోరియల్ విభాగానికీ మరొకటి మార్కెటింగ్, ఇంకొకటి అడ్వర్టైజ్‌మెంట్ విభాగానికి కేటాయిం చేసారు.ఒకదానికొకటి సంబంధం లేకుండా ఒకరు మరొకరి వ్యవహారాల్లో వేలుపెట్టకుండా ఎవరికి వారే  మనసా వాచా కర్మణా అంకిత భావంతో సంస్థ పురోభివృద్ధి కోసం శ్రమించాల్సిందే. అదే ఆపత్రిక  యజమాని గజానన రావు లక్ష్యం.

గజానన రావుకు పత్రిక గురించి ఒకప్పుడు ఓనమాలు కూడా తెలియవు. కానీ ఇప్పుడు అన్ని పత్రికల్లో కల్లా అత్యధికసర్క్యులేషన్‌తో 'నారాజ్యం'ను నిల్పడంలో ఆయన దేనికీ వెనుకాడడు. అతని స్వస్థలం గుంటూరు జిల్లా. వ్యాపారనిమిత్తమై ఇరవైయేళ్ల వయసులోనే డెబ్భైవదశకంలో

భాగ్యనగరం వచ్చేసాడు. మొదట కొంత కష్టబడి క్రమంగా కొంతమంది సంపన్నుల ప్రాపకం సంపాదించాడు. స్క్రాప్ ఓడలను రహస్యంగా కొనుగోలు చేయడం, భారతీయ విగ్రహాలను కళాసామగ్రిని గోప్యంగా ఇతర దేశాలకు చేరవేయడం లాంటి బిజినెస్‌లు చేస్తూ ఒక చిట్స్ అండ్ ఫైనాన్స్ వ్యాపారాన్ని ప్రారంభించాడు. ఆ వ్యాపారమే ఆతర్వాత వ్యాపారాలన్నింటికీ దిక్సూచీలా నిలిచింది. అనంతరం రియల్‌ఎస్టేట్లు, బట్టలదుకాణాలు, స్టార్‌హోటళ్లు...ఇలా అన్ని రకాల వ్యాపారాల్లోనూ ముందుకు సాగాడు.

అదేమి విచిత్రమోగానీ గజాననరావు ఎందులో వేలుపెట్టినా అప్పటివరకూ అదేవ్యాపారాలు చేస్తున్నవారి చేతులు కాలినంత పనయ్యేది. ఆయన పట్టిందల్లా బంగారంగా మారింది. అంతే పత్రికా వ్యాపారం లోకి ప్రవేశించాలనుకున్నాడు. ఆయన పత్రికా వ్యాపారం ప్రారంభించేనాటికి అది పత్రికా రంగంగానే ఉండేది. అప్పటికే తెలుగులో చాలా పత్రికలు ఉండేవి. అయితే వాటిని నడిపే వారిలో ఎక్కువమంది భాషా సాహిత్యాలపై అంతో ఇంతో పరిచయం, అవగాహన ఉన్నవాళ్లే .ఆసక్తికొద్దీ పత్రికలు పెట్టడం కాస్తా అటూఇటుగా ఆపత్రికలను కొనసాగించడం మాత్రమే తెలుసు. అందువల్ల అవి పరిమితసంఖ్యలో మాత్రమే పాఠకులకు చేరేవి. అందరికీ అందుబాటులో ఉండేవి కావు. హైదరాబాద్, విజయవాడ లాంటి పెద్ద నగరాలకే అవి పరిమితమై ఉండేవి.

ఉత్తరాంధ్ర జిల్లాల్లోని పాఠకులకు సాయంకాల పత్రికల్లా అందేవి. అక్కడే గజాననరావుకు బుర్ర పాదరసంలా పనిచేసింది. తనకు తెలిసిన మార్కెటింగ్ టెక్నిక్స్‌ని అమలు చేయాలనుకున్నాడు . అనుకున్నదే తడవుగా వామపక్షభావజాలంతో ఉన్న ఒక జర్నలిస్టుని పట్టుకుని ఆయనని నీడలోనే ఉంచేసి తానే ఎడిటర్‌గా పబ్లిషర్‌గా 'నారాజ్యం' పత్రికను విశాఖపట్నం జిల్లాలోని ఒక మూరుమూల గ్రామం నుంచి మొదలుపెట్టాడు.

'నారాజ్యం' పత్రిక అలా దినదినప్రవర్ధమానమై మిగిలిన పత్రికల సర్క్యులేషన్‌ని అనతికాలంలోనే అధిగమించి బాగా స్థిరపడింది. అయితే నారాజ్యం పత్రిక ప్రారంభమైన పదేళ్లకు కొత్త ప్రమాదం ఎదురైంది 'యుగోదయం' అనే మరోపత్రిక రూపంలో. ఒకప్పుడు గజాననరావు వాడుకుని వదిలేసిన వామపక్ష జర్నలిస్టు సంపాదకునిగా ఈ పత్రిక మొదలైంది.

ప్రారంభమైన తొలినాళ్లనుంచే నారాజ్యం పత్రిక కన్నా విభిన్నంగా వార్తాకథనాలు ఇవ్వడంలోనూ, ఆకర్షణీయంగా శీర్షికలు పెట్టడంలోనూ ముందజలో ఉండి చాలా తక్కువ సమయంలోనే పాఠకులను ఆకట్టుకుంది. అయినా సరే మార్కెటింగ్ టెక్నిక్స్ గజాననరావుకు తెలిసినంతగా 'యుగోదయం' పత్రిక యజమానులకు తెలియకపోవడం తో నష్టాలు తప్పలేదు. ఆపత్రికకు అలా ఒక పదేళ్లు గడిచాక సూర్యప్రసాద్ ఎడిటర్‌గా వచ్చాడు.

పత్రికను పూర్తిస్థాయిలో బలోపేతం చేయాలంటే ఆర్థిక పరిపుష్టి అవసరం.దానికి పెట్టుబడి పెట్టగలిగే స్థితిలో యజమానులు లేరు. పుట్టిన పదేళ్లకే మూతబడేస్థితికి దిగజారింది 'యుగోదయం ' పత్రిక సర్క్యులేషన్. దానిని నమ్ముకుని ఉన్న జర్నలిస్టులు మిగిలిన సిబ్బంది రోడ్డున పడకుండా ఉండాలంటే తక్షణమే పెట్టుబడి కావాలి. పత్రికకు పెట్టుబడి పెట్టగలిగిన సత్తా ఉన్న ఒక రాజకీయ ప్రముఖుడిని సంప్రదించాడు సూర్యప్రసాద్. ఆయన పేరు కె చంద్రశేఖరరెడ్డి. అప్పటికే ఆయన పార్లమెంటు సభ్యునిగా ఒక వెలుగు వెలిగిపోతున్నాడు. తన పాతపరిచయాన్ని ఒకసారి రెన్యూవల్ చేయించుకుని ఆయనని యుగోదయం పత్రికకు పెట్టుబడి పెట్టడానికి ఒప్పించాడు సూర్యప్రసాద్.

రాష్ట్రంలోని పది ప్రధాననగరాలనుంచి ఒకేసారి 'యుగోదయం' పత్రికను విస్తరించడానికి ప్రణాళికలు మొదలయ్యాయి. అదే జరిగితే గజాననరావు పత్రికావ్యాపారానికి ఒక అవరోధం ఏర్ప డినట్లే.

×××× ××× ××××

'నారాజ్యం' పత్రిక కార్యాలయం నాలుగో అంతస్థు. అది ఛైర్మన్ గజాననరావు ప్రత్యేక రెస్ట్‌హౌస్. అందులో ప్రవేశానికి అందరికీ అర్హతలేదు. కేవలం నలుగురికి మాత్రమే అందులోకివెళ్లగలిగే అర్హత ఉంది. వారు గజాననరావుకి నమ్మినబంట్లు. ఆయనగీచిన గీతదాటడానికి కలలో కూడా సాహసించరు. గజాననరావు పత్రికా సామ్రాజ్యానికి ఆనలుగురే మూలస్తంభాలు.

వారిలో ఒకరు వీరేశ్వర్. 'నారాజ్యం' పత్రిక న్యూస్‌నెట్‌వర్క్అంతా ఆయనే అజమాయిషీ చేస్తాడు . మరొకరు ఇంద్రసేనారావు పత్రికలో పనిచేసే సబ్ఎడిటర్లందరికీ మార్గనిర్ధేశకుడు. ఎడిటర్లాంటి వ్యక్తి. ఇంకొకరు రాఘవేంద్ర.ఈయన ప్రకటనల విభాగానికి జనరల్ మేనేజర్. మిగిలింది అనంత ప్రకాశ్. సర్కులేషన్ విభాగానికి జనరల్ మేనేజర్.

ఈనలుగురితో పాటు గజాననరావు ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసాడు.

ముందుగా గజాననరావే విషయాన్ని ప్రస్తావిస్తూ "ఈ మీటింగ్ ఎందుకోసమన్నది మీకుతెలుసు ...ఏం చేస్తే బాగుంటుంది? " అన్నాడు

ఈ మీటింగ్ వెనుక అసలుకారణం ఏమిటన్నది నలుగురికీ సూచాయగా తెలుసు. 'యుగోదయం' పత్రికను మల్టీఎడిషన్లతో విస్తరించడానికి జరుగుతున్న సన్నాహాలపై వారిదగ్గర కావాల్సినంత సమాచారం ఉంది.

మళ్లీ గజాననరావే మాట్లాడుతూ "మన పత్రిక ఇప్పుడు ఆరు ఎడిషన్లతో ఉంది. మొత్తమ్మీద సర్క్యులేషన్ ఐదు లక్షల కాపీలు కూడా దాటలేదు. ఆపేపర్‌కి సరైన మేనేజ్‌మెంట్ లేకపోయినా రెండు ఎడిషన్లకే రెండున్నర లక్షల సర్క్యులేషన్ ఉందని ఎబిసి నిర్ధారించింది."

దానికి అనంతప్రకాశ్ తలూపుతూ "అవును సార్...మీరు చెప్పింది నిజమే" అన్నాడు. రాఘవేంద్ర సర్దిచెబుతున్నట్లుగా "కమర్షియల్‌యాడ్స్ మనకే ఎక్కువ వస్తున్నాయి. ఆవిషయంలో మనమే ముందున్నాం" అన్నాడు.

దానికి గజాననరావు స్పందిస్తూ "ఇప్పటికి సర్క్యులేషన్‌లో మనపేపరే ముందుంది కాబట్టి మనకు యాడ్స్ ఎక్కువగా వస్తున్నాయి. అందులో విశేషమేముంది? కానీ భవిష్యత్‌లో ఇదేవిధం గా యాడ్ రెవెన్యూ, సర్కులేషన్ ఉంటుందని గ్యారెంటీ ఇవ్వగలరా?" అని ప్రశ్నించాడు. మళ్లీ "రేపటి పరిస్థితి కూడా ఇలాగే ఉంటుందని నేను అనుకోను. వాళ్లు పది ఎడిషన్లతో ఆపేపర్ తీసుకురావాలనుకుంటున్నారు. అలాంటప్పుడు ఎంతలేదనుకున్నా పదిలక్షల కాపీలకు తగ్గకుండా వారి సర్క్యులేషన్ పెరిగే అవకాశం ఉంది. అప్పటికి మన స్థితి ఏమిటి? రెండో స్థానంతోనే సరి పెట్టుకుంటామా........?" అన్నాడు గజాననరావు.

"లేదు..లేదు..అలా జరిగితే మనకే నష్టం" అన్నాడు కంగారుగా ఇంద్రసేనా రావు.

"మీకు పరిచయం ఉన్న రాజకీయపెద్దలతో చెప్పించి పత్రికా వ్యాపారంలోకి అడుగు పెట్టొద్దని ఎం పి చంద్రశేఖరరెడ్డిపై వత్తిడి తీసుకొస్తే...." చిన్న సూచన చేసాడు అనంత ప్రకాశ్.

" ఆ ప్రయత్నం కూడా జరిగిపోయింది. స్వయంగా ముఖ్యమంత్రి చేతనే వద్దని చెప్పించా.. ఇద్దరు కేంద్రమంత్రులతో కూడా వత్తిడి చేయించా...పత్రికా వ్యాపారం ఏమంత బాగోలేదని, అందులో వేలుపెడితే నష్టాలే తప్పా లాభాలు కళ్లచూడలేమని చెప్పించా. కోట్ల రూపాయలు పారేసి రోడ్డు మీద రూపాయిబిళ్లలు ఏరుకోవడంలా ఉంటుందని కూడా చెప్పించా..అయినా ఆ ఎంపీ వినే పరిస్థితిలో లేదు" చెప్పాడు గజాననరావు.

"అయితే పేపర్‌ని అడ్డంపెట్టుకుని ప్రధానమంత్రి కాలేకపోయినా కనీసం కేంద్రమంత్రి కావాలన్నదే చంద్రశేఖరరెడ్డి ఆలోచనలా ఉంది" తానేదో కొత్తగా కనిపెట్టినట్లు అన్నాడు వీరేశ్వర్

గజాననరావు ముఖంలో అసహనం పెరుగుతోంది. దానిని బయటకు కన్పించనీయకుండా జాగ్రత్త పడుతూ "అన్ని ప్రయత్నాలూ అయ్యాకే ఇలా మీతో చర్చిస్తున్నా...ఏం చేద్దామంటారో చెప్పండి" అన్నాడు.

"ఆ పత్రిక విస్తరించడానికి ఆయనకు ఉన్న ఆర్థిక వనరులు ఏమిటో ?" అన్నాడు అనంత ప్రకాశ్.

"ఏముందీ...రాష్ట్రంలో లిక్కర్ తయారీ యూనిట్లన్నీ చంద్రశేఖరరెడ్డివే. వాటినుంచే లిక్కర్ కొనుగోలు చేసి ప్రభుత్వం లైసెన్సెడ్ వైన్ షాపుల ద్వారా అమ్మిస్తోంది. దానిమీదే అతని వ్యాపార, రాజకీయ సామ్రాజ్యాలు ఆధారపడి ఉన్నాయి" చెప్పాడు వీరేశ్వర్.

వెంటనే గజాననరావు ముఖం వెలిగిపోయింది. "మన నారాజ్యం పత్రిక ఈరోజు నుంచీ 'సంపూర్ణ మద్య నిషేధం' కోరుకుంటోందని ప్రకటించండి. మద్యం మత్తులో జీవితాలు కోల్పోయి నవారు, తాగుడు అలవాటువలన ఆర్ధికంగా పతనమైనవారు, రోగాల పాలైనవారు ఎందరో ఉంటా రు. ఇలాంటివారి వివరాలు బాగా సేకరించి మానవీయ కథనాలద్వారా హైలెట్ చేయండి. మన విలేకరుల ద్వారా ఎక్కడికక్కడ జనాన్ని రెచ్చగొట్టించి మద్యం దుకాణాలపై దాడులు చేయించ ండి. ఆ న్యూస్ మనపేపర్‌లో హైలెట్‌గా ప్రచురించండి. అది చూసి గ్రామ గ్రామానికి, మండలం నుంచి మండలానికి, జిల్లా నుంచి జిల్లాకు...అలా రాష్ట్ర మంతటా మద్య నిషేధంపై ఉద్యమాన్ని తీసుకు రండి............." అంటూ ఆవేశంగా చెప్పుకుంటూ పోతున్నాడు.

మధ్యలో వీరేశ్వర్ జోక్యం చేసుకుంటూ "సార్! మీరు చెప్పింది బాగానే ఉంది కానీ, మద్యం వ్యాపారం మీదే ప్రభుత్వం, రాజకీయ పార్టీల మనుగడ ఆధారపడి ఉంది. అన్ని పార్టీల నాయకులూ ఈ వ్యాపారంలో ఉన్నారు. మనం సపోర్టు చేసే పార్టీ నుంచి కూడా ఈ విషయంలో వ్యతిరేకత వస్తుందేమో..? ఒకసారి ఆలోచించండి" అంటూ సందేహం వ్యక్తం చేసాడు.

"తప్పదు... ఒకటి కావాలంటే మరొకటి వదులుకోక తప్పదు. అది కూడా మనం పూర్తిగా జీవితాంతం మద్యనిషేధానికి కట్టుబడి ఉండం కదా! మనకు కావాల్సింది చంద్రశేఖరరెడ్డి ఆర్థిక మూలాలను దెబ్బతీయడమే. అంతే కాకుండా మద్య నిషేధం పై మనం ఎక్కువగా ఉద్యమిస్తే సామాజిక కార్యకర్తలు, ప్రజా సంఘాలు, ప్రజలు ఎక్కువమంది హర్షిస్తారు. వారిని అడ్డం పెట్టుకుని ఈ ఉద్యమం బాగా ఉధృతమైపోతుందంటూ ఫోకస్ చేద్దాం. అటు పత్రిక ప్రారంభించ లేక ఆ ఎం.పి. చతికిల బడతాడు. ఈ ఉద్యమం ద్వారా ప్రతి పక్షంలో ఉన్న మనం సపోర్టు చేసే రాజకీయ పార్టీకి ఎక్కువ ప్రచారం కల్పించొచ్చు. వారి నుంచి విరాళాలు కూడా మనకే వస్తాయి. వారు తర్వాత ఎన్నికల్లో అధికారంలోకి వచ్చే అవకాశాలు కూడా పెరుగుతాయి. మద్య నిషేధానికి మద్దతునిచ్చే ప్రతీ ఒక్కరి ఫోటోలు కలర్‌లో వేయండి. సర్క్యులేషన్ కూడా పెంచుకోవచ్చు .ఎలా ఉందీ ప్లాన్? " అన్నాడు ఉత్సాహంగా గజాననరావు.

"చాలా బాగుంటుంది. మనకి అన్ని విధాలా ప్రయోజనమే" అన్నారు మిగతా నలుగురూ.

అంతే ....

ఆ మరుసటి రోజు నుంచీ గజాననరావు మార్కు ఉద్యమం ప్రారంభమైంది. ఏఏ అంచనాలు వేస్తూ ఉద్యమాన్ని నడిపారో అవే ఫలితాలు కన్పించాయి.

నెలరోజుల్లోనే అన్ని జిల్లాలకూ మద్య నిషేధ ఉద్యమం వ్యాపించింది. అప్పటి వరకూ ఊరూ పేరూ లేని వారు కూడా ఈ ఉద్యమం పుణ్యమా అని కావాల్సినంత ఉచిత ప్రచారాన్ని సంపాదించు కోగలిగారు.

ఈ ఉద్యమంలో మద్యం షాపులపైనా, గొడౌన్లపైనా, తయారీ కేంద్రాలపైనా జరిగిన దాడులను ప్రభుత్వం అడ్డుకోలేక చేతులెత్తేసింది.

దానిపైనే ఆధారపడి వ్యాపారాన్ని, రాజకీయాలను నడుపుతున్న ఎం.పి. చంద్రశేఖరరెడ్డికి కోట్లాది రూపాయల నష్టాలు వచ్చేసాయి. 'యుగోదయం' పత్రికలో పెట్టుబడి పెట్టాలనుకున్న ఆలోచనని పూర్తిగా మానుకున్నాడు. ఇంతలో ఎన్నికలు వచ్చేసాయి. ఆ సమయంలోనే చంద్ర శేఖరరెడ్డి రాజకీయ ప్రత్యర్థుల చేతుల్లో హత్యకు గురయ్యాడు.

అంతటితో మద్య నిషేధ ఉద్యమం కూడా కొన్ని నెలల వ్యవధిలోనే చల్లారిపోయింది. గజాననరావు అండ్ కో లక్ష్యం నెరవేరింది.

రెండు ఎడిషన్లతో కుంటి నడక నడుస్తున్న 'యుగోదయం' పత్రిక శాశ్వతంగా మూత పడి పోయింది. అందులో ఉన్న జర్నలిస్టులు ఇతర విభాగాల సిబ్బంది తమ శక్తిమేరకు ఇతర పేపర్లలో పనులను వెతుక్కుంటూ వెళ్లిపోయారు. దానికి ఎడిటర్‌గా ఉన్న సూర్య ప్రసాద్ ఎక్కడికీ వెళ్లలేక రిటైర్మెంట్ తీసుకున్నాడు.

తన కొడుకు అశోక్‌వర్ధన్‌కు ఇంకా చిన్నవాడిగా ఉండడం, తన ప్రయత్నాలు ఇలా విఫలమై తనకు ఉద్యోగం లేకపోవడం...ఏం చేయాలో తెలియని స్థితిలో సూర్య ప్రసాద్‌కు బతుకు ఒక పెద్ద ప్రశ్న లా సవాల్ చేస్తోంది.

×××　　　　×××　　　　×××

ఆదివారం..... రాత్రి పది గంటలు దాటుతోంది.
రామకృష్ణా బీచ్‌లో జనం సందడి తగ్గుతూ వస్తోంది

అంతలో మొబైల్ ఫోన్ రింగయ్యింది. ఆలోచనల నుంచి బయటపడి అశోక్‌వర్ధన్ దానివైపు చూసాడు. అదే పనిగా మారుమ్రోగుతోంది అది. అవతలి నుంచి జ్యోతిర్మయి ఫోన్ చేస్తోంది. కాల్ రిసీవ్ చేసుకున్నాడు.

"హాయ్! అశోక్ ఎక్కడున్నావ్? ఏం చేస్తున్నావ్ ? " జ్యోతిర్మయి ప్రశ్నల వర్షం ఫోన్లో.

"ఆ..హలో ! జ్యోతీ ఎక్కడ నుంచి మాట్లాడుతున్నావ్? .....నేను ఊరికే ఆర్కె బీచ్‌లో ఉన్నా..." చెప్పాడు అశోక్ వర్ధన్.

"బీచ్‌లోనా ! అక్కడేం చేస్తున్నావ్ ? ఇంకా ఇంటికి వెళ్లలేదా? ....మీ నాన్నగారు కంగారు పడుతూ నాకు ఫోన్ చేసారు "

అతడు సమాధానం చెప్పబోయేలోగానే

" సరే సరే నేనే వస్తున్నా నిన్ను పికప్ చేసుకుని వెళ్లడానికి " అంటూ ఫోన్ కట్‌చేసిందామె.

అప్పుడు అతడు తన మొబైల్ వైపు చూసాడు. తన తండ్రి ఫోన్ నుంచి నాలుగు మిస్సుడ్ కాల్స్. వాటిలో ఒక్కటి కూడా తాను చూసుకోలేక పోయానా...అంటే అంత పరధ్యానంగా ఉన్నానా....అని అనుకున్నాడు.

వెంటనే సూర్య ప్రసాద్‌కు ఫోన్ చేసి "నాన్నా! భోజనం చేసారా? మీ కాల్స్ చూసుకోలేక పోయాను...మరో పది నిమిషాల్లో ఇంటికి వచ్చేస్తా" అని చెప్పాడు.

"అశోక్ ఏం జరిగింది? ఇంత లేట్ ఎప్పుడూ కాలేదు?....." అంటూ సూర్య ప్రసాద్ ఏదో కంగారుగా అడుగుతున్నాడు.

"నాన్నా ! నేను వచ్చాక అన్నీ చెప్తాను " అని కాల్ కట్‌చేసాడు అశోక్ వర్ధన్.

కొన్ని నిముషాలు గడిచాయి.

బీచ్ రోడ్ పక్కన పార్కింగ్ ప్లేస్‌లో తన హొండా ఏక్టివాను పార్క్ చేసి అశోక్ వర్ధన్ వైపు వస్తోంది జ్యోతిర్మయి.

జ్యోతిర్మయి చూడడానికి సాధారణమైన అమ్మాయిలాగే ఉంటుంది. కానీ అసాధారణ మైన కళ్లు ఆమెవి. ఒకసారి చూస్తే ఆమెను ఎవరూ మర్చిపోలేనంతగా ఆకళ్లు చైతన్య జ్యోతుల్లా ప్రకాశిస్తూ ఉంటాయి. ఆమె వృత్తి రీత్యా న్యాయవాది. ప్రవృత్తి రీత్యా సామాజిక హక్కుల కార్యకర్త.

దూరం నుంచే అశోక్‌వర్ధన్‌ను గుర్తుపట్టి అతనికి దగ్గరగా వచ్చిందామె.

"అశోక్! ఇక్కడేం చేస్తున్నావ్? ఎంత టైమ్ అయ్యిందో తెలుసా? పద ఇంటికి వెళ్దాం" అంది

"సరే పద ...." అంటూ లేచాడు.

"వెహికల్ కూడా తీసుకొచ్చినట్లు లేవు...ఏం జరిగింది...?" మళ్లీ ప్రశ్నించింది.

"మనసుకు చికాకుగా ఉండి వెహికల్ తీసుకురాలేదులే" చెప్పాడతను.

"ఎందుకంత ఫ్రస్టేషన్‌లో ఉన్నావు ? ఏం జరిగింది? " మళ్లీ అదే ప్రశ్న అమెది.

"ఏమీలేదులే...రేపు మాట్లాడుకుందాం..." అన్నాడు అశోక్‌వర్ధన్.

అతని స్వభావమే అంత...మనసుకు ఎంతో కష్టమన్పిస్తే తప్పా ఇష్టమైన వాళ్లదగ్గర కూడా పెదవి విప్పడు. ప్రతీ సమస్యనీ ఒంటరిగా అధిగమించాలని ప్రయత్నిస్తాడు. బాల్యంలోనే తల్లిని కోల్పోవడం అతనిజీవితంలో పెద్ద విషాదం. అందువల్లే ఎలాంటి సవాళ్లనైనా ఒంటరిగా ఎదుర్కోవడం అతనికి అలవాటైపోయింది.

అశోక్‌వర్ధన్ తన తండ్రితో కలిసి ఉంటున్నది సీతమ్మధారలో .....జ్యోతిర్మయి తన పెంపుడు తండ్రి సత్యన్నారాయణతో కలిసి ఎం.వి.పి.కాలనీలో ఉంటోంది.

సూర్యప్రకాశ్ ఆందోళనని ఫోన్లోనే గమనించిన జ్యోతిర్మయి ఆసమయంలో ఆశోక్‌వర్ధన్‌ను తీసుకువెళ్లడానికొచ్చింది.

జ్యోతిర్మయికి అశోక్‌వర్ధన్‌తో పరిచయం మూడేళ్ల కిందట జరిగింది. అదికూడా న్యూస్ కవరేజ్ విషయాల్లోనే మొదలైంది. ఆజిల్లాలోని కాకిపల్లి అనే మారుమూల తీరప్రాంత గ్రామం పక్క నే ఉన్న చిత్తడినేలల్లో ఒక కార్పోరేట్ కంపెనీ థర్మల్ విద్యుత్ ప్లాంట్ ఏర్పాటు చేసే సందర్భం లో స్థానికుల నుంచి తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది. సామాజిక హక్కుల కార్యకర్తగా జ్యోతిర్మయి వారికి అండగా నిలబడింది. ఆక్రమంలోనే ఒకరోజు ట్రైన్‌లో అశోక్‌వర్ధన్‌కు జ్యోతిర్మయితో పరిచయం అయ్యింది.

జ్యోతిర్మయి పుట్టు పూర్వోత్తరాలు ఎవరికీ తెలియదు. ఆమె తల్లిదండ్రులు ఎవరో ఆమెకే కాదు ఆమెను పెంచిన తండ్రి సత్యన్నారాయణకు కూడా తెలియదు.

భూమికోసం...భుక్తికోసం...జీవించేహక్కు కోసం...దోపిడీ నుండి విముక్తి కోసం...అవిభక్త శ్రీకాకుళం జిల్లాలో సాయుధ గిరిజన రైతాంగ పోరాటం జరుగుతున్న రోజులవి.

ప్రభుత్వ నిర్భంధకాండలో ఉద్యమం మరింత ఎరుపెక్కుతోంది. ఉద్యమకారులు సంచరించే గ్రామాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి ప్రభుత్వం ప్రత్యేక మిలటరీ బృందాలతో గ్రామాల ను నింపేస్తోంది. ఉద్యమకారులను ఉక్కుపాదంతో ప్రభుత్వం అణిచివేస్తోంది.

సరిగ్గా అలాంటి సమయానికి సత్యన్నారాయణ పార్వతీపురం ఏజెన్సీలోని కొండగూడ ప్రాథమికపాఠశాల ఉపాధ్యాయునిగా పనిచేస్తున్నాడు.

శ్రీకాకుళ గిరిజన రైతాంగ ఉద్యమం తీవ్రంగా కొనసాగుతున్న గ్రామాల్లో అదికూడా ఒకటి. అక్కడ ఉపాధ్యాయునిగా కొనసాగుతున్న సత్యన్నారాయణ స్వామి వివేకానంద రచనలతో ప్రభావితుడైన వ్యక్తి. అటు ప్రభుత్వ చర్యలతో ఆయనకు ఏకీభావం లేకపోయినా ఇటు నక్సల్స్ పోరాటానికీ సంఘీభావం ప్రకటించలేదు. కనీసం వారి సానుభూతిపరునిగా కూడా లేడు.

అలాంటి తరుణంలో ఒకరోజు ఉదయం ఎప్పటిలాగే పాఠశాలకు సత్యన్నారాయణ వెళ్లేసరికి తాళంలేని తరగతి గదిలో మారుమూలన పాత గుడ్డల మధ్య ఒక పసిబిడ్డ...ఆడబిడ్డ. ఆబిడ్డను అక్కడే విడిపెట్టి ఎవరో వెళ్లిపోయినట్లుగా ఆనవాళ్లు కొన్ని కన్పించాయి.

గ్రామస్తులను పిలిపించి వాకబుచేసిన ఆయనకు ఆ బిడ్డ తమ బిడ్డకాదని వారంతా చెప్పేసారు.

అప్పుడు సత్యన్నారాయణ ఏం జరిగి ఉంటుందో ఊహించాడు. ఆబిడ్డ బహుశా ఎవరో ఉద్యమకారిణి సంతానం కావొచ్చని, ఆబిడ్డ తనతో పాటుంటే శత్రువులకు వేగంగా చిక్కిపోయే ప్రమాదం ఉందని భావించి ఈ స్కూలు గదిలో మారుమూల విడిచిపెట్టి వెళ్లిపోయి ఉంటుందని భావించాడతడు.

'నమ్ముకున్న ఆశయం కోసం ఎన్నుకున్న మార్గంలో ముందుకు సాగిపోతూ కన్నబిడ్డను సైతం వదులుకున్న కన్నతల్లి పేగుబంధం ' గుర్తుకొచ్చి సత్యన్నారాయణ కళ్లు ఒక్కసారి చెమర్చాయి.

"నేను సైతం విశ్వవృష్టికి అశ్రువొక్కటి ధారవోసాను" అన్న శ్రీశ్రీ కవితా వాక్యం గుర్తుకొచ్చింది.
ఆ ఆడబిడ్డవైపు చూసాడు సత్యన్నారాయణ. ఆపసికూన తదేకంగా అతనివైపే చూస్తోంది. ఏదో అవ్యక్తమైన భాషలో ప్రశ్నిస్తున్నట్లు....... ఆకళ్లలో చైతన్యం కన్పిస్తోంది.

ఊళ్లో అందర్నీ అడిగాడు సత్యన్నారాయణ. ఆ ఆడపిల్లను "ఏవరైనా పెంచుకుంటారా....." అని
"ఈ పిల్ల ఎవరి బిడ్డో...ఏ కులం పిల్లో...మాకు తెలియదు...ఎందుకు అనవసరమైన బరువు? మాకొద్దంటే మాకొద్దని " ఊరోళ్లంతా వెళ్లిపోయారు.

చేసేదిలేక ఆ పసికూనని తానే పెంచి పెద్దచేయాలని నిర్ణయించుకున్నాడు సత్యన్నారాయణ. ఉద్యమవేడి చల్లారితే ఈ బిడ్డకన్నతల్లి ఎప్పటికైనా ఈ గ్రామఛాయల్లోకి రాకపోదా..? అప్పుడైనా తన కన్నబిడ్డను చూసి మురిసిపోదా...? అన్న ఆలోచనలతో ఆబిడ్డను సాకటం ప్రారంభించాడు.

ఆ ఊరి బడిలో ఒక పసిబిడ్డ మాస్టారికి దొరికిందని ఈనోటా ఆనోటా పోలీసులకు కూడా తెలిసింది. దీంతో పోలీసులు ఆ స్కూలు మీదా...సత్యన్నారాయణ మాస్టారి కదలికల మీదా నిఘా పెట్టారు. కానీ వారు అనుమానించినట్లు ఏమీ జరగలేదు.

పోలీసులు రెండు మూడు సార్లు స్కూలుకి వచ్చి ఆ పాప గురించి సత్యన్నారాయణని విచారించి వెళ్లారు. వారికి కూడా తనకు తెలిసిన ఒకే సమాధానం చెప్పాడాయన. "స్కూల్లో తాళం లేని గది లో రోజుల వయసున్న ఒక పసిపాప దొరికిందని, ఊళ్లో ఎవరి పాపా ఆమె కాదని తప్పనిసరై తానే పెంచుకుంటున్నానని చెప్పాడు వారికి సత్యన్నారాయణ మాస్టారు.

"ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఎవరు వచ్చినా తమకు వెంటనే సమాచారం ఇవ్వాలని " హెచ్చరించి పోలీసులు వెళ్లిపోయేవారు.

రోజులు కాదు...వారాలు...నెలలు...కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఆపసికూనకోసం ఎవరూ రాలేదు. బహుశా ఆ పసిబిడ్డ తల్లిదండ్రులు పోలీసుల ఎన్కౌంటర్లలో చనిపోయిఉంటారని నిర్ధారించుకున్నాడు సత్యన్నారాయణ.

ఆపాపకు ముందుగా ఏపేరు పెట్టకపోయినా స్కూల్లో చేర్పించే సమయంలో జ్యోతిర్మయి అనే పేరుపెట్టాడు. ఆమె ఎవరి బిడ్డ అయినప్పటికీ సత్యన్నారాయణతో ఆమె మమతానుబంధం రోజు రోజుకీ దిన దిన ప్రవర్ధమానమౌతోంది. అలా పెళ్లి కాకుండానే ఒక బిడ్డకు అతడు పెంపుడు తండ్రిగా మారిపోయాడు.

వివేకానందుని రచనల ప్రభావంతో సమాజానికి ఏదో చేద్దాం అన్న తపన, వివాహంపై ఏర్పడిన విముఖత జ్యోతిర్మయి దొరికిన దగ్గరనుంచి సత్యన్నారాయణలో మరింత పెరిగాయి.

పెళ్లి చేసుకుంటే వచ్చే భార్య ఎవరికో పుట్టిన పాప జ్యోతిర్మయిని సరిగ్గా చూసుకుంటుందన్న నమ్మకం కూడా లేకుండా వివాహానికి సత్యన్నారాయణ దూరంగా ఉండిపోయాడు.

ఆపాపను అనాధశరణాలయంలో వదిలేసి సత్యన్నారాయణని పెళ్లి చేసుకొమమని పోరుపెట్టి కాలం తీరగానే కన్నుమూసారు అతని తల్లిదండ్రులు.

తనకున్న శక్తి సామర్థ్యాల మేరకు జ్యోతిర్మయిని విద్యావంతురాలుగా సత్యన్నారాయణ తీర్చిదిద్దాడు. న్యాయశాస్త్రంలో పోస్టు గ్రాడ్యుయేషన్ పూర్తిచేసి జ్యోతిర్మయి న్యాయవాద వృత్తిని స్వీక రించింది. ఆమె వృత్తి రీత్యా న్యాయవాది అయినా ప్రవృత్తిరీత్యా సామాజిక హక్కుల కార్యకర్తగా ఎది గింది.

ఉత్తరాంధ్ర జిల్లాల్లో ఎక్కడ ఏరకంగా ప్రజాజీవనానికి పాలకవర్గాలనుంచి, కార్పోరేట్ పెద్దల నుంచి, సామ్రాజ్యవాదులనుంచి ముప్పు ఏర్పడినా బాధితుల పక్షాన జ్యోతిర్మయి పోరాటం చేస్తుంది. అవసర మైన సందర్భాల్లో బాధితుల పక్షాన సొంతసొమ్ముతోనే న్యాయపోరాటానికి సిద్ధమౌతుంది.

ఆమె పోరాటదీక్ష ఎలాంటిదంటే తనపై ప్రత్యర్థులు హత్యాప్రయత్నాలు జరిపినా ఆమె వెను దిరగలేదు. తన సామాజిక ఉద్యమంనుంచి ఏమాత్రం దూరం కాలేదు.

సత్యన్నారాయణ మాస్టారు రిటైర్ అయ్యాక పి.ఎఫ్.,గ్రాట్యుటీ వలన వచ్చిన సొమ్ముతో విశాఖ పట్నంలోని ఎం.వి.పి.కాలనీలో ఒక అపార్ట్మెంట్ కొనుక్కొని అందులో జ్యోతిర్మయితో కలిసి ఉంటు న్నాడు.

ఆమెకు నచ్చిన కుర్రాడితో పెళ్లి చేయించేస్తే తన బాధ్యత తీరిపోతుందని సత్యన్నారాయణ ఆలో చిస్తున్నాడు.

×××　　　　×××　　　　×××

సీతమ్మధారలో రెండో లైనులో నాలుగో ఇల్లు.

సూర్యప్రసాద్ టీవీలో వార్తలు చూస్తున్నాడు. ఇంతలో ఇంటివాకిట్లో వాహనం ఆగిన శబ్దం. లోపలనుంచే వరండాలోని లైట్ వేసాడు సూర్యప్రసాద్.

కాలింగ్ బెల్ మోగింది....తలుపు తీసాడు.

గుమ్మంలో ఉన్నారు ఆశోక్వర్ధన్, జ్యోతిర్మయిలు.

"హాయ్! అంకుల్ .....ఇదిగో తీసుకొచ్చేసాను ....మీ చంటబ్బాయ్ని" అంది చనువుగా జ్యోతిర్మయి.

"థ్యాంక్సరా తల్లీ! వీడెక్కడికి వెళ్లాడా అని కంగారు పడ్డా"

"అంకుల్ నేను వెళ్లి రానా! మానాన్న అక్కడ ఎదురు చూస్తుంటారు"

"అలాగేనమ్మా ! జాగ్రత్తగా వెళ్లు" అన్నాడు సూర్యప్రసాద్.

"ఓకే అంకుల్, బాయ్ అశోక్......గుడ్నైట్" అంటూ వెళ్లిపోయింది తన వెహికల్పై జ్యోతిర్మయి.

అశోక్‌వర్ధన్ ఇంట్లోకి వచ్చి కాళ్లూ చేతులూ కడుక్కున్న తర్వాత అడిగాడు అతని తండ్రి

"ఎందుకు ఇంత లేటయ్యింది...? ఏమైంది....?" అంటూ ప్రశ్నించాడు.

"ఏమీలేదు నాన్నా ఈ ఉద్యోగం రానురానూ చేయడం కష్టమైపోతోంది వత్తిడి భరించలేకుండా ఉన్నాను.మనసంతా చికాకుగా ఉంటోంది"

"సరేలే రేపు మాట్లాడుకుందాం...భోంచేసి పడుకో ...."

అన్యమనస్కంగానే భోజనం ముగించాడు అశోక్‌వర్ధన్. అన్ని గదుల్లో లైట్లు ఆపి బెడ్ రూమ్ లోకి నడిచాడు. మంచం మీద పడుకున్నాడేగానీ నిద్ర రావడంలేదు. తాను ఈ రంగంలోకి మొదటి సారి అడుగుపెట్టిన సందర్భం గుర్తుకొచ్చింది.

పదేళ్ల కిందట....

తనకి జర్నలిజం ఫీల్డు అంతగా ఇష్టం లేకపోయినా తండ్రి పదేపదే చెప్పడంతో దానిని ఒక సామాజిక బాధ్యతగా భావించి అందులోకి అడుగుపెట్టాడు అశోక్‌వర్ధన్.

ఎం.బి.ఏ. చదివినా స్థానికంగా ఉద్యోగం దొరకకపోవడంతో అశోక్‌వర్ధన్‌లో నిరాశపెరిగింది. హైదరాబాద్, విజయవాడ వంటి చోట్ల ఉద్యోగాలు వచ్చే అవకాశం ఉన్నా తండ్రిని విడిచిపెట్టి వెళ్లడానికి మనస్కరించక వెళ్లలేకపోయాడు.

జర్నలిజంలో పి.జి.డిప్లొమా చేయాలని తండ్రి సూచనలతో ఖాళీగా ఉండడమెందుకని అదికూడా చదివాడు. ఏడాదిలోగా ఆ డిప్లొమా కూడా పూర్తయిపోయింది. దాని తర్వాత తెలుగు విశ్వ విద్యాలయంలో ఆధ్వర్యంలో ప్రసారమాధ్యమాలకు తెలుగులో రాయడం అనే సబ్జక్టులో పి.జి.డిప్లొమా కూడా చేసేసాడు.

అక్కడికి కొన్ని నెలల తర్వాత పత్రికల్లో ఒక ప్రకటన చూసాడు. అనుభవజ్ఞులైన జర్నలిస్టులతో ఉన్న యాజమాన్యం ఒకటి 'త్రిముఖం' అనే పత్రికను ప్రారంభిస్తోందని, దానిలో ఉద్యోగాల కో సం అర్హులైన వారి దగ్గరనుంచి దరఖాస్తులు ఆహ్వానిస్తున్నామని అందులో సారాంశం.

ఈ ప్రకటనని సూర్యప్రసాద్ కూడా చూసాడు. అందులో స్టాఫ్ రిపోర్టర్‌గా చేరితే బాగుంటుందని సూచించాడు.

తన తండ్రి పత్రికా రంగంలో తలపండిన జర్నలిస్టు అయినా ఆ వాసనలు ఏవీ అంటలేదు అశోక్‌వర్ధన్‌కు.

పత్రికలతో పాఠకునిగా తప్పా కనీసం ఉత్తరాల రచయితగా కూడా వాటితో ఎలాంటి సంబంధం అతనికి లేదు. రెండు డిప్లొమాలు చేసినా అంతా థియరీటికల్‌గానే తప్పా ప్రాక్టికల్‌గా జర్నలిజం అతనికి వంటబట్టలేదు.

తండ్రి ప్రోద్బలంతో అప్లికేషన్, బయోడేటాను పంపించాడు 'త్రిముఖం' పత్రికాఫీసు అడ్రస్‌కు. అదివారికి చేరిన వారంరోజులు గడిచాయోలేదో ఇంటర్వ్యూకి రమ్మని అశోక్‌వర్ధన్‌కి పిలుపు వ చ్చింది.

హైదరాబాద్‌లోని కూకట్‌పల్లితో 'త్రిముఖం' హెడ్డాఫీసులో ఇంటర్వ్యూకుహాజరయ్యాడు అ శోక్‌వర్ధన్. ఉదయంపదిగంటలనుంచి వెయిట్‌చేస్తే మధ్యాహ్నంరెండుగంటలకు లోపలికిపిలిచారు.

త్రిముఖం పత్రిక యజమాని రామకోటి, ఎడిటర్ శ్రీకాంతాచార్యులు, న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ శ్రీరామమూర్తి, క్వాలిటీసెల్ ఇన్‌ఛార్జ్ రఘురామ్‌లు లోపల కూర్చొని ఉన్నారు.

"మే...ఐ..కమిన్ సార్!" అన్నాడు అశోక్‌వర్ధన్ తలుపును కొంచెం తెరిచి.

"యస్....కమిన్" అంటూ తలూపాడు రఘురామ్.

లోపలికి వెళ్లాడతడు.

"టేక్ యువర్ సీట్ " అన్నాడు శ్రీరామమూర్తి తమ టేబుల్ ఎదురుగా ఉన్న సోఫాను చూపిస్తూ.

టక్ చేసిన వైట్‌షర్ట్ డార్క్‌బ్లూ కలర్‌తో ఫ్యాంటు...నీట్‌గా ముస్తాబై ఇంటర్వ్యూకి వచ్చిన అశోక్‌వర్ధన్‌ను చూసి శ్రీకాంతాచార్యులు సాభిప్రాయంగా తల పంకించాడు.

ఇంటర్వ్యూ ప్రారంభమైంది..క్వాలిఫికేషన్లూ...అర్హతలు..విద్యార్హతలుపై కొన్ని ప్రశ్నలు వేసాక శ్రీరామమూర్తి సంతృప్తి కరంగానే రామకోటివైపు చూసాడు.

పత్రిక యజమాని రామకోటి ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాడు.

"జర్నలిజంలోకి రావాలని ఎందుకు అన్పించింది ?" అడిగాడు సూటిగా అతన్నే చూస్తూ రామకోటి

" ఈ రంగంపై ఆసక్తి ఉండడంతో అవకాశమిస్తారని వచ్చాను " అన్నాడు అశోక్‌వర్ధన్

"ఎం.బి.ఏ. చదివావు కదా! ఏదైనా మార్కెటింగ్ ఫీల్డులో మంచి ఉద్యోగం వస్తుంది. జర్నలిజం అంటే రిస్క్‌తో కూడుకున్న పని నీవు చేయగలవా? " అన్నాడు రామకోటి అతనిని డిస్సప్పాయింట్ చేసే ధోరణిలో.

"ఏ ఫీల్డులోని రిస్క్ ఆఫీల్డుకి ఉంటుంది. కష్టపడి పనిచేస్తేనే ఎలాంటి రిస్క్‌లనైనా అధిగమించగలం అన్నది నాతత్వం సార్! " చెప్పాడు అశోక్ వర్ధన్.

"ఓకె...మీ నాన్నగారి ప్రోత్సాహంతో జర్నలిజంలోకి అడుగుపెడుతున్నావా?"

"కొంతవరకూ అంతేనండి. ఆయన ప్రోత్సాహానికి తోడు ఈఫీల్డు మీద నాకు ఆసక్తి పెరిగింది. మీ పత్రికలో పనిచేసే అవకాశం ఇస్తే అంకితభావంతో పనిచేయగలననే నమ్మకం నాకుంది"

"రోజంతా శ్రమపడాలి...జీతం తక్కువగా ఉంటుంది....మరోసారి ఆలోచించుకో.."అంటూ రామకోటి మళ్లీ అశోక్‌వర్ధన్‌ను డిసప్పాయింట్ చేసే ప్రయత్నాన్ని చేసాడు.

అయితే అశోక్‌వర్ధన్‌లో ఏమాత్రం పట్టుదల చెదిరిపోలేదు.

"సమాజానికి ఎంతో కొంత అక్షరాల ద్వారా సేవలు అందించే అవకాశం ఉంటుంది కదా" అన్నాడు.

"సరే ఈ పత్రికను మేము కొత్తగా ప్రారంభిస్తున్నాము. అందువలన జీతాలు తక్కువగానే ఉంటాయి. క్రమేపీ పెరుగుతాయి" అని రామకోటి చెప్పాడు.

"ఓకె సార్" అన్నాడు అశోక్‌వర్ధన్.

"గుడ్! మీరిక వెళ్లొచ్చు. తొందరలోనే మీకు ఇన్‌ఫార్మ్ చేస్తాం" చెప్పాడు శ్రీకాంతాచార్యులు ఇంటర్వ్యూ పూర్తయిందనడానికి సంకేతంగా...

"థ్యాంక్యూ సార్ !" అంటూ బయటకు వచ్చాడు ఆశోక్‌వర్ధన్

ఇంటర్వ్యూను ఫేస్‌చేయడం ఇదే తొలిసారి కాకపోయినా అక్కడివాతావరణమంతా ఆశోక్‌వర్ధన్‌కి కొత్తగా అన్పించింది. అంతకుముందు ఎం.బి.ఏ.చదువుతున్న సమయంలో క్యాంపస్ ఇంటర్వ్యూలను కొన్నింటిని ఫేస్‌చేసాడడతను. అక్కడ లేనిది ఏదో ఇక్కడఉందని అన్పించింది అతనికి.

'త్రిముఖం' పత్రికా కార్యాలయం నుంచి బయటకు వచ్చేసిన తర్వాత తన ఫ్రెండ్ సత్య శ్రీనివాస్ రూమ్‌కు అశోక్‌వర్ధన్ వెళ్లాడు. ఆరోజురాత్రి అక్కడే ఉండి తర్వాత రోజు సాయంత్రం ట్రెయిన్‌కు కాకినాడ బయలుదేరాడు.

×××　　　　×××　　　　×××

ఇంటర్వ్యూ జరిగిన సరిగ్గా పదిరోజులకు వచ్చిందా ఉత్తరం 'త్రిముఖం' పత్రికా కార్యాలయం నుంచి. విశాఖపట్నం జిల్లాకు స్టాఫ్ రిపోర్టర్‌గా అశోక్‌వర్ధన్‌ని నియమిస్తున్నట్లు అందులో సమాచారం. ఈ అపాయింట్‌మెంట్ లెటర్ అందిన రెండు రోజుల్లో తెలుగుదీపం విశాఖపట్నం ఎడిషన్ కార్యాలయంలో జాయినింగ్ ఆర్డర్‌పై సంతకం చేసి బాధ్యతల్లో చేరాలని కూడా ఆలెటర్‌లో ఉంది.

అందులో ఉన్న ఫోన్ నెంబర్‌కు ఫోన్‌చేసాడు.

"నమస్తే! 'త్రిముఖం' ప్లీజ్! ..." ఎవరో అమ్మాయి గొంతు విన్పించింది.

తనను తాను పరిచయం చేసుకుని ఎడిటర్ గారితో మాట్లాడాలని అశోక్‌వర్ధన్ కోరాడు.

"రెండు నిమిషాలు ఆగండి" అంటూ ఆమె ఎక్స్‌టెన్షన్ ఫోన్‌లో ఎడిటర్ శ్రీకాంతాచార్యులతో ఫోన్లో లింక్ కలిపింది.

"హలో ! ఎవరూ ?" అన్నాడు శ్రీకాంతాచార్యులు

"నమస్తే సార్! నేను అశోక్‌వర్ధన్‌ని సార్! నన్ను విశాఖపట్నం జిల్లా స్టాఫ్ రిపోర్టర్ గా నియమిస్తూ అపాయింట్‌మెంట్ లెటర్ పంపించారు సార్! థ్యాంక్స్ సార్ ! "

'ఓకే ! అశోక్ నువ్వు వైజాగ్ ఆఫీసుకు వెళ్లి అక్కడ జాయినింగ్ రిపోర్టుపై సంతకం చేసి, అక్కడి న్యూస్‌ఎడిటర్ సౌజన్యా రావు ఉంటారు. ఆయనతో కలవాల్సిఉంటుంది" సూచించాడు శ్రీకాంతాచార్యులు

"అలాగే సార్ ! థాంక్యూ సార్! "

"సరే " అన్నమాటా దాంతర్వాత రిసీవర్ పెట్టేసిన చప్పుడూ అవతలనుంచి విన్పించాయి.

ఇంతలో బయట గేటు తెరుస్తున్న చప్పుడైంది.

ఏదో పనిమీద రాజమండ్రి వెళ్లిన తండ్రి సూర్యప్రసాద్ ఇంట్లోకి వచ్చాడు.

' త్రిముఖం' పత్రిక నుంచి తనను విశాఖపట్నం జిల్లాకు స్టాఫ్ రిపోర్టర్‌గా నియమిస్తూ లెటర్ వచ్చిన విషయం. విశాఖపట్నం ఆఫీసులో జాయిన్ అవ్వాలన్న సమాచారం తండ్రికి చెప్పాడు. "కంగ్రాట్యులేషన్స్ " అంటూ అభినందించాడు.

"మంచిదే ....కానీ ...ఒకప్పుడు పత్రికల్లో పనిచేయడం అంటే ఒక గుర్తింపు. గౌరవం. ఎంతో సామాజిక బాధ్యత ఉండేవి. అప్పట్లో వార్తాసేకరణ జరపడం ఎంతకష్టమో ఆ సమాచారాన్ని పత్రికాభాషకు అనుగుణంగా రాసి పత్రికకు అందించడం మరింత కష్టంగా ఉండేది " అన్నాడు సూర్యప్రసాద్.

"ఎందుకని ?" ప్రశ్నించాడు అశోక్‌వర్ధన్.

"ఎందుకేమిటి ? ఆరోజుల్లో కమ్యూనికేషన్స్ ఇంతగా విస్తరించలేదు. ఎక్కడ ఏదైనా జరిగితే సకాలంలోసమాచారం తెలియడమే కష్టం. అందులోనూ వాస్తవమెంతో నిర్ధారించుకోవడానికే చాలా సమయం పట్టేది. నిర్ధారించుకున్న తర్వాత కూడా ఏవర్గానికీ ఇబ్బంది కలగకుండా బ్యాలెన్సింగ్ చేస్తూ వార్తలు రాయాల్సి ఉండేది. ఇప్పుడైతే ప్రతి మండలానికీ రిపోర్టర్లు ఉంటున్నారు కానీ ఆరోజుల్లో జిల్లాకు ఒకరిద్దరు మాత్రమే రిపోర్టర్లు వార్తల ఫ్లో బాగా తక్కువగా ఉండేది. ఇప్పుడు ఏం జరిగినా క్షణాల్లో తెలిసిపోతుంది. టీవీల్లో స్క్రోలింగ్స్ కూడా వచ్చేస్తాయి. దాంతో ఏవార్త ఎంతవరకూ ఇవ్వాలో నిర్ధారించుకుని రాయడానికి అవకాశం ఉంది." చెప్పాడు సూర్యప్రసాద్.

"సరే నాన్నా! భోజనానికి వెళ్దాం" అంటూ వంటగది వైపు కదిలాడు అశోక్‌వర్ధన్.

భోజనాలు ముగించి కాస్తా రిలాక్స్‌గా కూర్చొన్న తర్వాత సూర్యప్రసాద్‌తో

"నాన్నా నేను చాలాసార్లు విన్నాను. జర్నలిస్టు వృత్తి అంటే కత్తిమీదసాము అని" అన్నాడు అశోక్‌వర్ధన్.

"ఒకప్పుడు అది నిజమే.....ఇప్పుడూ అది కొంతవరకూ వాస్తవమే "

"అదేమిటి ?....అలా...." అర్థంకానట్లు ముఖాన్ని ప్రశ్నార్థకంలా పెట్టి అడిగాడతడు.

"ఆ మాట ఇప్పటికీ కొంతమందికి వర్తిస్తుందిలే " చెప్పాడు నవ్వుముఖంతో

"కాస్తా అర్ధమయ్యేటట్లు చెప్పండి నాన్నా "

"ఒకప్పుడు పత్రికలు చాలావరకూ నీతి,నిజాయితీ గలవారు, సామాజిక బాధ్యత గలిగినవారి చేతుల్లో ఉండేవి. వాటిలో పనిచేసేవారు కూడా అలాంటి విలువలతోనే ఉండేవారు. అందువల్ల వారు రాసే నిజాయితీగల వార్తలకు సంఘవిద్రోహులనుంచి దాడులు ఎదురయ్యేవి. ప్రభుత్వాలు కూడా నిజాయితీగల జర్నలిస్టులను జైళ్లలో పెట్టిన సందర్భాలు కూడా అనేకం ఉన్నాయి.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు వంటి వారిని జైల్లో పెట్టింది బ్రిటీష్ ప్రభుత్వం. అంతెందుకు మన దేశంలో తొలిపత్రిక 'బెంగాల్ గెజిట్' ను ప్రారంభించిన జేమ్స్ అగస్టస్ హిక్కీనే ఆనాటి ఆంగ్లేయ ప్రభుత్వం ఎన్నో ఇక్కట్లకు గురిచేసింది. అంతేకాదు మన తెలుగునాట సంఘ సంస్కరణో ద్యమానికి వేగుచుక్కగా నిలిచిన కందుకూరి వీరేశలింగం పంతులు కూడా ఇలాంటి కష్టాలు ఎదుర్కొంటూనే పత్రికావృత్తినే ప్రజాచైతన్యానికి ఒక దీపికగా మార్చారు"

"అదంతా ఆరోజుల్లో....అప్పటికీ ఇప్పటికీ పత్రికారంగంలో చాలా మార్పులు వచ్చేసాయి కదా"

"అవును నిజమే...నేటి జర్నలిజంలో చాలా మార్పులు వచ్చేసాయి. కానీ ఇందులో నిజాయితీగా ఉండేవారికి అటు సంఘవిద్రోహులతోనూ, అక్షరాలనిఅమ్ముకునే పత్రికల యాజమాన్యాల ప్రతినిధు లతోనూ విరోధం తప్పట్లేదు. ఎందుకంటే ఇప్పుడున్న పత్రికలు ఆయా రాజకీయపార్టీల నాయకులో , వారి బినామీ వ్యక్తులో యజమానులుగా ఉన్నవి అనేకం. కొన్ని వామపక్షపత్రికలు ప్రజా ఎజెండాతో వార్తలు ఇస్తున్నట్లు కన్పించినా అవికూడా పార్టీ జెండాల నీడలను దాటి బయటకు రాలేవు. మిగిలిన పత్రికలు సొంతఎజెండాలకు కట్టుబడి ఉంటాయి. పాఠకులఆలోచనలను తమ తమ రాజకీయపక్షాలకు అనుకూలంగా మలచటమే వాటి పని. తమ పార్టీ ప్రతిపక్షంలో ఉంటే ప్రభుత్వంపై బురదజల్లి తమ పార్టీని గురించి ప్రచారం చేయడం....తమ పార్టీయే అధికారపక్షం లో ఉంటే తమ చేతుల్లోనే ప్రజల భవితవ్యం ఉందని, తమ పార్టీపాలన దేవుడి పాలన అని, అంతా ఇక స్వర్ణయుగమేనని .ప్రతిపక్షాలన్నీ ప్రజాద్రోహులని, ప్రజల అభివృద్ధికి ప్రతిపక్షాల నాయ కులు చీడపురుగుల్లా వ్యవహరిస్తున్నారని.......ఇలా వార్తారచన సాగిపోతూ ఉంటుంది. ఎంతసేపూ తమ పార్టీ గురించి చంకలు గుద్దుకోవడం, ఇతర పార్టీల గురించి పరనిందలు, తమవెనుక నున్న కార్పోరేట్‌శక్తుల గురించి భజనలు ...ఇదే తీరున వార్తారచన చేయాలి. మనసు చంపుకుని వార్తలు రాయగలిగితేనే ఈ వ్యవస్థలో మనుగడ సాగించ గలరు. లేదంటే నిరంతరం సమరమే. ఇంటా...బయటా..అందుకే నిజాయితీగల జర్నలిస్టులకు నిరంతరం కత్తిమీదసామే " అంటూ చిన్న ఉపన్యాసమే ఇచ్చాడు సూర్యప్రసాద్.

"మీరు చెప్తున్నది వినగానే ఎక్కడో చదివిన ఒక కవిత గుర్తుకొచ్చింది నాన్నా!"

"ఏమిటది ?"

"నిజాయితీని నటించడం
నల్లేరుమీద నడక
నిజాయితీగా జీవించడం
పల్లేరు మీద పడక.......... అని చదివాను"

"నిజమే..ఎవరు రాసారో గానీ అక్షరాలా అది నేటి జర్నలిస్టులలో కొందరికి వర్తిస్తుంది" అన్నాడు సూర్యప్రసాద్.

"జర్నలిస్టుకు స్వేచ్ఛ ఉండదా...?"

"పత్రికా స్వేచ్ఛ అనేది మేడిపండులాంటిది. పత్రికలు నడిపేవారికి ఉండే స్వేచ్ఛ అందులో పనిచేసేవారికి ఎప్పుడూ ఉండదనే చెప్పాలి. భారత రాజ్యాంగం ప్రజలందరికీ ప్రసాదించిన భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్నే పత్రికా రచనకు కూడా వర్తింపజేస్తున్నారు. దీనిపరిధిలోనే ప్రజలు నోటిమాటతో చెప్ప గలిగితే పత్రికల్లో పనిచేసేవారు తమ రాతలతో వ్యక్తీకరిస్తారు అంతే తేడా... అంతకుమించి పత్రికల్లో పనిచేసేవారికి ప్రత్యేక హక్కులంటూ ఏమీ ఉండవు " స్పష్టం చేసాడు సూర్యప్రసాద్.

"మరి పత్రికా స్వేచ్ఛగురించి జర్నలిస్టుల సంఘాలు చెబుతుంటాయి కదా?"

"నిజమే జర్నలిస్టు సంఘాలు చాలా రకాలున్నాయి. ఇవి ఆయా పత్రికా యాజమాన్యాలలోని కొంతమంది పెద్దలు తమకు విధేయులైన సీనియర్ పాత్రికేయులతో ఏర్పాటు చేయిస్తుంటారు. ఈసంఘాలు చాలావరకూ ఆయాయాజమాన్యాలధోరణికి అనుగుణంగానే ఉంటాయి. అందుకే అవి యాజమాన్యాల వలన జర్నలిస్టులకు అన్యాయం జరిగిన సందర్భాల కన్నా ఆయా సంస్థలకు ప్రభుత్వ చర్యలవలన, ప్రత్యర్థి పార్టీల వలన పెద్ద నష్టం వచ్చినప్పుడే ఎక్కువగా స్పందిస్తూ ఉంటాయి. అంతెందుకు చాలా పత్రికలు, మీడియా సంస్థలు గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే పాత్రికేయులతో దశాబ్దాల తరబడి వెట్టిచాకిరీ చేయించుకుంటున్నాయి. ప్రజలనుంచి సొమ్ములు వసూలు చేసుకుని బతకండంటూ అవినీతి మార్గాలవైపు అడుగులేయిస్తున్నాయి. సంఘాల్లో ఉన్న పెద్దలకు ఈ విషయాలు తెలియవా? కానీ ఎందుకు ఈ విషయంపై యాజమాన్యాలతో పోరాటం చేయడంలేదో? ఒకసారి అలోచించు నీకే అర్థమౌతుంది " చెప్పాడు సూర్యప్రసాద్.

"చాలా జాగ్రత్తగా వ్యవహరించకపోతే కష్టమేనన్నమాట " సాలోచనగా అన్నాడు అశోక్‌వర్ధన్.

"సరే ఎప్పుడు వైజాగ్ వెళ్తున్నావు ?"

"రేపు వెళ్లి జాయినింగ్ రిపోర్టు ఇచ్చి రెండు మూడు రోజుల్లో రూమ్ అదీ చూసుకుని రెగ్యులర్‌గా డ్యూటీకి అటెండ్ కావాలనుకుంటున్నా"

"మంచిదే... వేరేగా రూమ్ తీసుకోవడం కన్నా మీ ఫ్రెండ్స్ ఎవరో ఉన్నారని అన్నావు కదా ...వారితో ఉండడానికి ప్రయత్నించు ఖర్చులు కలిసి వస్తాయి " సలహా ఇచ్చాడు సూర్యప్రసాద్.

"అలాగే నాన్నా !"

××× ××× ×××

విశాఖపట్నంలో 'త్రిముఖం' ఆఫీసు వెతుక్కోవడం పెద్ద కష్టం కాలేదు అశోక్‌వర్ధన్‌కు. ఒక పాత భవనానికే రంగులు వేసి కొత్తగా తీర్చిదిద్దారు. సెక్యూరిటీలో తన వివరాలు చెప్పి బ్రాంచ్ మేనేజర్‌ని కలవాలని తెలిపాడు.

సెక్యూరిటీ నుంచి ఫోన్ వెళ్లగానే లోపలకు అశోక్‌వర్ధన్‌ను పంపించుమని బ్రాంచ్‌మేనేజర్ చెప్పాడు.ఆఫీసు ప్రాంగణంలోకి అడుగుపెట్టాడు. మూడు అంతస్థుల్లో నిర్మించారు దానిని. దిగువ ఫ్లోర్‌లో కొంత పార్కింగ్‌కు విడిచిపెట్టారు. మిగిలిన భాగంలో ప్రింటింగ్ విభాగాన్ని ఏర్పాటు చేసారు. మొదటి అంతస్థులో అడ్మినిస్ట్రేటివ్ విభాగం, ప్రకటనలు, సర్క్యులేషన్ విభాగాలున్నాయి. రెండో అంతస్థులో ఎడిటోరియల్, కంప్యూటర్స్ విభాగాలున్నాయి. పై అంతస్థులో గెస్ట్‌రూమ్స్, కాన్ఫరెన్స్ హాల్ లాంటి నిర్మాణాలున్నాయి.

మొదటి అంతస్థులోకి దారితీసిన అశోక్‌వర్ధన్ నేరుగా 'శ్రీనివాస్, బ్రాంచ్‌మేనేజర్' అనే సైన్‌బోర్డున్న చాంబర్ వద్ద ఆగి తలుపు తట్టాడు.

"ఎస్...కమిన్ " అంటూ లోనికి పిలిచాడు బ్రాంచ్‌మేనేజర్ శ్రీనివాస్.

"నమస్తే సార్! నాపేరు అశోక్‌వర్ధన్ నన్ను స్టాఫ్ రిపోర్టర్‌గా అపాయింట్ చేసారు " చెప్పాడు.

"ఎస్! ఎస్! నిన్ననే హెడ్ ఆఫీసునుంచి ఇంటిమేట్ చేసారు. జాయినింగ్ రిపోర్టుపై సంతకం చేసి ఇవ్వండి" అంటూ హెచ్ ఆర్ సెక్షన్‌లో ఉన్న పద్మజను పిలిచాడు.

ఆమెకు అశోక్‌వర్ధన్‌ను చూపిస్తూ " ఈయన కాకినాడ నుంచి వచ్చారు. స్టాఫ్ రిపోర్టర్‌గా ఇతనిని నియమించారు. పేరు అశోక్‌వర్ధన్, మిగిలిన వివరాలన్నీ నమోదు చేయాలని " సూచించాడు శ్రీనివాస్.

పద్మజ అశోక్‌వర్ధన్‌ను చూసి చిరునవ్వుతో "రండి సార్" అంటూ తన టేబుల్ దగ్గరకు తీసుకెళ్లింది. హెచ్.ఆర్.ఫార్మాలిటీస్ పూర్తిచేసిన తర్వాత బ్రాంచ్‌మేనేజర్ ఛాంబర్‌కి మళ్లీ వెళ్లాడు అశోక్‌వర్ధన్.

“మీ వంటి యంగ్ అండ్ ఎనర్జెటిక్ పర్సన్‌ను స్టాఫ్ రిపోర్టర్‌గా పంపించడం ఆనందదాయకం. మనం మంచి టీమ్‌వర్క్‌తో ముందుకు వెళ్దాం ” అన్నాడు శ్రీనివాస్.

“థాంక్యూసార్! ఇక్కడ పద్ధతులు విధి విధానాల గురించి కొంచెం వివరిస్తారా…!”

“మీరు స్టాఫ్ రిపోర్టర్ కనుక ఎడిటోరియల్ సెక్షన్ కిందకే వస్తారు. ఇక్కడ న్యూస్‌ఎడిటర్ సౌజన్యారావు. చాలా మంచి వ్యక్తి. చాలా పత్రికల్లో పనిచేసిన అనుభవం ఆయనకు ఉంది. జర్నలిజంలో దిగువస్థాయి నుంచి ఎదిగివచ్చిన ఆయన తన పేరుకు తగ్గట్టే సౌజన్యంతో ఉంటారు.. ..” అంటూ శ్రీనివాస్ చెప్పడం ప్రారంభించాడు.

ఆయన ధోరణి చూసి అశోక్‌వర్ధన్‌కు కొంత సరదాగా అన్పించింది. ఎవరినీ నొప్పించకుండా అందరితోనూ కావాల్సిన పనిని చేయించుకోగలిగే సామర్థ్యం శ్రీనివాస్‌కు ఉందని అన్పించింది.

“మీరు హైదరాబాద్ హెడ్డాఫీసులో ఉన్న న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌చార్జ్ గారి ఆదేశాలపై పనిచేయాల్సి ఉన్నా..ఎడిషన్ సెంటర్‌కు సంబంధించి న్యూస్‌ఎడిటరే మీకు గైడ్ చేస్తారు”

“ఓకే సార్! ఆయన ఎక్కడ ఉంటారు?”

“సౌజన్యారావు ఆఫీస్ డ్యూటీ సాయంత్రం ఐదు గంటల నుంచి మొదలౌతుంది. ఆయన ఉదయం కూడా ఆఫీసుకు వచ్చి మధ్యాహ్నం వరకూ ఉండి వెళ్తారు. మరికాసేపట్లో రావొచ్చు” చెప్పాడు శ్రీనివాస్.

అతని టేబుల్ మీదున్న న్యూస్‌పేపర్లని పరిశీలించడంలో అశోక్‌వర్ధన్ నిమగ్నమయ్యాడు. అలా ఓ ఐదు నిమిషాలు గడిచిన తర్వాత ఆఫీస్‌బాయ్ లక్ష్మణ్ వచ్చి ఇప్పుడే న్యూస్‌ఎడిటర్ సౌజన్యారావు తన ఛాంబర్‌కి వచ్చారని చెప్పాడు.

“సార్! న్యూస్‌ఎడిటర్‌గారు వచ్చారట…వెళ్లి కలుస్తాను” అంటూ కుర్చీలోంచి లేచాడు అశోక్ వర్ధన్.

“ఓకే! ఓకే! వెళ్లిరండి ” అన్నాడు శ్రీనివాస్

రెండో అంతస్థులో ఉన్న ఎడిటోరియల్ విభాగానికి వెళ్లాడు. అక్కడ సౌజన్యారావు ఒక్కడే కూర్చొని ఎదురుగా ఉన్న కంప్యూటర్ స్క్రీన్‌పై హెడ్డాఫీసు నుంచి వచ్చిన మెసేజ్‌లు చెక్‌చేసుకుంటున్నాడు.

అశోక్‌వర్ధన్ ఎడిటోరియల్ విభాగంలోకి అడుగుపెట్టగానే “ఎవరు ?” అన్నట్లు ప్రశ్నార్థకంగా అతని వైపు చూసాడు సౌజన్యారావు.

తనను తాను పరిచయం చేసుకున్నాడు అశోక్‌వర్ధన్.

“మీరేనా ! ఇక్కడికి స్టాఫ్ రిపోర్టర్‌గా వచ్చింది. మంచిదండి రండి కూర్చోండి” అంటూ సాదరంగా ఆహ్వానించాడు సౌజన్యారావు.

అశోక్‌వర్ధన్‌కు అడిగి అతని కుటుంబ వివరాలు తెలుసుకున్నాడు.

"మీ నాన్నగారు ఎలా ఉన్నారు? బాగున్నారా? ఏడాదిపాటు మీ నాన్నగారితో కలిసి పనిచేసాను" చెప్పాడు సౌజన్యారావు.

అశోక్‌వర్ధన్ ఆసక్తిగా "ఎప్పుడు సార్ !" అన్నాడు

"నా జర్నలిజం కెరీర్ 'యుగోదయం' పత్రికలో ట్రైనీసబ్ఎడిటర్‌గా ప్రారంభమయ్యింది. అప్పటికే మీనాన్నగారు ఎడిటర్‌గాఉన్నారు. ఆయనా, అసిస్టెంట్ఎడిటర్ విష్ణుమూర్తి, సెంట్రల్‌డెస్క్ ఇన్‌ఛార్జ్ రమణకుమార్ వారంతా మంచి ట్రైనింగ్ ఇచ్చారు. ట్రైనింగ్‌క్లాసుల్లో చాలా విషయాలు చెప్పేవారు. ఆట్రైనింగ్ క్లాసులు ఆరునెలలకు మించి జరగకపోయినా నా కెరీర్‌కు అవి బాగా ఉపకరించాయి ....అలా ఆపత్రికలో ఏడాది పనిచేసాను. ఆతర్వాత 'నారాజ్యం' పత్రికలో కాస్తా మంచి ఆఫర్ రావడంతో వెళ్లాను. అక్కడ ఐదేళ్లు పనిచేసాను. అందులో ఇంటర్నల్ పాలిటిక్స్ ఎక్కువ. వాటి వల్ల చాలా  ఇబ్బందులకు గురై దాన్నుంచి తప్పుకున్నాను.." గతాన్ని గుర్తుచేసుకుంటూ సౌజన్యారావు చెప్పుకుంటూ పోతున్నాడు.

ఆయన మాటల ప్రవాహానికి అడ్డుకట్టవేస్తూ 'ఆతర్వాత ....?' అంటూ ఆసక్తిగా ప్రశ్నించాడు అశోక్‌వర్ధన్.

"తర్వాత ఏముందీ ? నారాజ్యం పత్రిక నుంచి బయటకు వచ్చేసాక 'మానస వీణ' అనే వీక్లీని ఒకదాన్ని ప్రారంభించాను. జర్నలిజం మీద అవగాహన ఉన్నా మార్కెటింగ్‌లో నేను చాలా వీక్ కావడంతో వీక్లీని నడపడంలో చేతులు కాల్చుకున్నాను. ఈలోగా ఈ 'త్రిముఖం'  పత్రిక మొదలైంది.  కొంతమంది పాతమిత్రుల సహకారంతో ఇందులో చేరాను"

"మన 'త్రిముఖం'  పత్రిక ఎలా ఉంది?"

"ఇప్పుడున్నవాటిలో ఇదే కొంత మెరుగ్గా ఉంది. నిజాయితీగల జర్నలిస్టులకు స్వేచ్ఛగా వార్తలు రాసే అవకాశం ఇందులో ఉంది. ఈరోజు మీరు జాయిన్ అయ్యారు కదా! ఇక మీకే తెలుస్తుంది "

"నా డ్యూటీస్ ఏమిటో మీరు చెబుతారని న్యూస్‌నెట్‌వర్క్ఇన్‌ఛార్జ్ శ్రీరామమూర్తి అన్నారు"

"ఆయనతో మీరు మాట్లాడారా ?"

"అవును..నాకు అపాయింట్‌మెంట్ లెటర్ చేరాక ఇక్కడికి వచ్చే ముందే ఆయనతో ఫోన్లో మాట్లాడాను"

"ఓకే! ఇక్కడ మీరు విశాఖపట్నం ఎడిషన్ కేంద్రంలో పనిచేసినా న్యూస్‌నెట్‌వర్క్ఇన్‌ఛార్జ్ ఆదేశాలను ఫాలో అవ్వాలి. డెస్క్‌లో ఉన్న సబ్ఎడిటర్లతో సమన్వయంతో ఉండాలి. అంతేకాదు మండల విలేకరులతో ఎప్పటికప్పుడు మంచి కథనాలు రాయించేలా చూడాలి. ఏదైనా మేజర్

సంఘటన జరిగితే మెయిన్ పేపర్‌కు, మినీ టాబ్లాయిడ్‌కు ప్రధానవార్తలు అందించాల్సిన బాధ్యత కూడా మీదే. ”

“అలాగే సార్! తప్పకుండా ...”

“ప్రతిరోజూ రాత్రి పన్నెండు గంటల వరకూ మనకు డెడ్‌లైన్ టైమ్ ఉంది. ముఖ్యమైన వార్తలు ఏవైనా ఉంటే డెడ్‌లైన్ టైమ్ వరకూ చూడాలి. కామన్‌గా ఉండే వార్తలు, స్టోరీలు,ఫోటోలు అన్నీ సాయంత్రంనుంచే ఎఫ్‌టిపి (ఫైల్ ట్రాన్స్‌ఫర్ ప్రొటోకాల్) ద్వారా పంపించాలి. ఇద్దరు స్టాఫ్ ఫోటో గ్రాఫర్స్ మనకి ఉన్నారు. వారితో ముందుగానే ప్లాన్‌చేసుకుని అవసరమైన ఫోటోలు తీయించుకోండి.”

“అలాగే సార్! వారిని, టౌన్లో ఉన్న మిగిలిన మన రిపోర్టర్లనీ కలుస్తాను”

“మీరు ఈరోజే జాయిన్ అయ్యారు కదా? ఎక్కడుంటున్నారు? రూమ్ ఏమైనా తీసుకున్నారా? ”

“ఇంకా లేదు సార్! జాయిన్ అయ్యాక రెండు రోజుల్లో రూమ్ చూసుకుని ఇక్కడే ఉందామనుకుంటున్నాను. జాయిన్ అయ్యాను. ఇక రూమ్‌చూడడమే ఉంది”

“గుడ్ ! స్థానికంగా మీరు ఎడిషన్ కేంద్రానికి అందుబాటులో ఉండాలి. అలా ఉంటేనే ఎప్పటికప్పుడు మంచి స్కోరింగ్ వార్తలు ఇవ్వడానికి వీలౌతుంది”

“ఓకే సార్!”

“రెండు మూడు రోజుల్లో మన జిల్లాలోని రిపోర్టర్లందరితో మీటింగ్ పెడదాం. మిమ్మల్ని వారికి పరిచయం చేసినట్లౌతుంది. జిల్లాలో ఏమండలంలో ఏఏ ప్రాధాన్యతాంశాలున్నాయో మీకు అవగాహన కూడా ఏర్పడుతుంది ”

“థాంక్యూ సార్! మంచి సూచన, టౌన్లో మన రీజనల్ ఆఫీసు ఎక్కడ ఉంది?”

“డాబాగార్డెన్స్‌లో ఉంది”

“ఓకే సార్! నేను మన రీజనల్ ఆఫీసుకు వెళ్తాను” అంటూ అశోక్‌వర్ధన్ సౌజన్యారావు నుంచి శెలవు తీసుకుని ఎడిషన్ కార్యాలయం నుంచి బయటకు వచ్చాడు.

నేరుగా డాబాగార్డెన్స్‌లోని ‘త్రిముఖం’ రీజనల్ ఆఫీసుకు వెళ్లాడు. అక్కడమూడు కంప్యూటర్లు, ఇద్దరు ఆపరేటర్లున్నారు. వారితోపాటు ముగ్గురు రిపోర్టర్లు కూడా ఉన్నారు. తాను ఎవరో ఎక్కడి నుంచి వచ్చాడో వారికి పరిచయం చేసుకున్నాక అశోక్‌వర్ధన్‌ను బాగానే రిసీవ్‌చేసుకున్నారు.

వారిలో ఒకడు విక్రమరావు గాజువాక ఏరియా రిపోర్టర్, మరొకడు శ్రీధర్ పెందుర్తి ఏరియా రిపోర్టర్, ఇంకొక రిపోర్టర్ సుబ్బరాజు ఆంధ్రాయూనివర్సిటీ ఏరియా రిపోర్టర్. వారితో పరిచయాలు అయ్యాక వారి ఏరియాల గురించి సమాచారాన్ని అశోక్‌వర్ధన్ అడిగి తెలుసుకున్నాడు.
తర్వాత న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ శ్రీరామమూర్తికి ఫోన్‌చేసాడు.

“గుడ్ మార్నింగ్ సర్! నేను వైజాగ్ నుంచి అశోక్‌ను ”
“గుడ్ మార్నింగ్ ! చెప్పు అశోక్ ”
“సార్ ఈరోజే డ్యూటీలో జాయిన్ అయ్యాను”
“వెరీగుడ్, ప్రతిరోజూ సాయంత్రం ఐదు గంటలకల్లా మెయిన్ ఎడిషన్‌కు అక్కడినుంచి పంపించే ముఖ్యమైన వార్తల వివరాలు చెప్పాలి గుర్తుంచుకో”
“అలాగే సార్! ఇంకా ఈ జిల్లా గురించి పూర్తి అవగాహన రావడానికి కనీసం వారం రోజులైనా పట్టేటట్లుంది”
“ఓకే! మన సీనియర్ కంట్రిబ్యూటర్ల హెల్ప్ తీసుకో. జిల్లాలోని ముఖ్యమైన సమస్యలు, ప్రధాన అంశాలపై ఒక అవగాహన ఏర్పడుతుంది.” సలహా ఇచ్చాడు శ్రీరామమూర్తి.
“ఓకే సార్! ”
“న్యూస్ఎడిటర్ సౌజన్యారావుతో కోఆర్డినేట్ చేసుకుని మంచి వార్తలు ఇవ్వు. ఎడిషన్‌కు మంచిపేరు తేవాలి”
“అలాగే సార్!”
అవతలినుంచి ఫోన్ కాల్ కట్ అయ్యింది.

×××　　　　　　××××　　　　　　×××

మూడు రోజుల తర్వాత……
విశాఖపట్నంలోని ‘త్రిముఖం’ ఎడిషన్ కార్యాలయం…ఉదయం పది గంటలు
విశాఖజిల్లాలోని అన్ని మండలాలు మున్సిపాలిటీలనుంచి లోకల్ రిపోర్టర్లుగా వ్యవహరించే న్యూస్ కంట్రిబ్యూటర్లు ఒకరొకరుగా చేరుకుంటున్నారు. అన్ని ప్రాంతాలనుంచి ఏభైమందికి పైగా వారంతా వచ్చారు. సమావేశం ప్రారంభమైంది.
“ఫ్రెండ్స్ ” అంటూ సౌజన్యారావు మాట్లాడడం మొదలుపెట్టాడు.

“మనకి కొత్తగా స్టాఫ్ రిపోర్టర్‌ను నియమించారు ఎం.డి.గారు. ఈయన పేరు అశోక్‌వర్ధన్. కాకినాడ నేటివ్ ప్లేస్. ఈయన నాన్నగారు సూర్యప్రసాద్‌గారు. ఆయన పేరు మీరు వినే ఉంటారు . యుగోదయం పత్రికకు చీఫ్ ఎడిటర్‌గా పనిచేసారు..” అంటూ వారందరికీ అశోక్‌వర్ధన్‌ను పరిచయం చేసాడు.

ఆతర్వాత న్యూస్ కంట్రిబ్యూటర్లు ఒక్కొక్కరే లేచి తమ పేరు, తాము పనిచేస్తున్న ఏరియా పేరు చెప్పారు. అలా పరస్పర పరిచయాలయ్యాయి.

పరిచయాలు పూర్తయ్యాక గత నెలరోజుల్లో ఎవరెవరు ఏఏ ప్రత్యేక కథనాలు ఇచ్చారు? వాటి  పర్యవసానంగా ఏం జరిగిందన్న అంశాలపై చర్చించారు.

సౌజన్యారావు మాట్లాడుతూ "మరో రెండు నెలల్లో మున్సిపల్ ఎలక్షన్లు వస్తున్నాయి. అందువల్ల పట్టణ ప్రాంతాల్లో వార్డుల్లో ఉన్న సమస్యలపై ఎక్కువగా ఫోకస్ చేయండి " అని చెప్పాడు.

ఆయనే మళ్లీ మాట్లాడుతూ "వార్డుల్లో ఉన్న సమస్యలను గుర్తించి వాటిని అధికారంలో ఉన్న కౌన్సిలర్ ఎందుకు పరిష్కరించలేకపోయారో? కొత్తగా పోటీ చేయాలనుకుంటున్నవారు ఏ విధంగా ఆసమస్యలను పరిష్కరించాలని భావిస్తున్నారో? వారి వారి అభిప్రాయాలతో స్టోరీలు ఇస్తే మంచి రీడబులిటీగా కూడా ఉంటుందని" సూచించాడు.

"జిల్లాలో ఉన్న ఆరు మున్సిపాలిటీల నుంచి ఈ అంశాలపై క్రమం తప్పకుండా వార్తలు రావాలి. వాటికోసం రేపటి నుంచే ప్రత్యేక పేజీలు కేటాయిస్తున్నాం. మున్సిపాలిటీల్లో పనిచేస్తున్న రిపోర్టర్లు వారి సలహాలు, సూచనలు ఇవ్వండి" అని అడిగాడు సౌజన్యారావు.

భీమిలి రిపోర్టర్ సత్యన్నారాయణ లేచినిల్చొని తమ మున్సిపాలిటీలో అపరిష్కృతంగా ఉన్న సమస్యలు... వాటిని పరిష్కరించడంలో ప్రజాప్రతినిధులు అనుసరిస్తున్న అలక్ష్యాన్ని వివరించాడు.

"అటువంటివాటిపై ప్రత్యేక కథనాన్ని రాయాలని" సౌజన్యారావు చెప్పాడు.

"ఎన్నికల సమయంలో బాగా ఫోకస్ కావడానికి కొంతమంది నాయకులు రిపోర్టర్లను ప్రలోభపెట్టే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. అలా జరిగినట్లు తేలితే, అనుకూల కథనాలు రాయడానికి ఏ రిపోర్టరైనా ప్రయత్నించినట్లు తెలిసినా చర్యలు తీసుకుంటామని" సౌజన్యారావు హెచ్చరించాడు.

"మున్సిపల్ ఎన్నికల నేపథ్యంలో అన్ని కోణాలనుంచీ ప్రత్యేక వార్తలు, కథనాలు రాయడానికి సీనియర్ కంట్రిబ్యూటర్లని ఇన్‌ఛార్జ్‌లుగా నియమిస్తున్నామని, మిగిలినవారు వారితో సమన్వయం చేసుకుంటూ వార్తలు రాయాలని" సౌజన్యారావు చెప్పడంతో అంతా అలాగేనంటూ తలూపారు.

బ్రాంచ్‌మేనేజర్ శ్రీనివాస్ ఆయా న్యూస్‌కంట్రిబ్యూటర్ల పరిధిలోని మండలాలు, మున్సిపాలిటీల్లో ఎన్నికలవార్తల కవరేజ్ దృష్టిలో ఉంచుకుని సర్క్యులేషన్‌ను ఎంతపెంచాల్సి ఉంటుందీ చర్చించాడు.

చివరిగా అశోక్‌వర్ధన్ మాట్లాడుతూ "తనకు ఈజిల్లాపై ఇంకా అవగాహన పెరగడానికి న్యూస్ కంట్రిబ్యూటర్లంతా సహకరించాలని" కోరాడు.

రిపోర్టర్ల మీటింగ్ ముగిసాక భోజనాలు చేసి ఎవరి మండలాలకు వారు వెళ్లిపోయారు.

అంతా వెళ్లిపోయాక శ్రీనివాస్, సౌజన్యారావు, అశోక్‌వర్ధన్, డెస్క్ ఇన్‌ఛార్జ్ కోటేశ్వరరావులు భేటీ అయ్యారు.

“మనకి మంచి రిపోర్టర్లున్నా వార్తల ఫ్లో బాగా తక్కువగా ఉంటోంది. కొత్తగా మొదలైన మనపత్రికకు ఇలా అయితే కష్టమే. కొంత డెప్త్ ఉన్న వార్తలు, ఇతర పత్రికలవారు కూడా ఇవ్వలేని వార్తలపై రిపోర్టర్లకు దృష్టి కేంద్రీకరించాలని చెప్పండి. అలాఅయితేనే సర్క్యులేషన్ పెరుగుతుంది. తద్వారా యాడ్స్‌కూడా బాగా వస్తాయి ” అన్నాడు శ్రీనివాస్.

సౌజన్యారావు తలూపుతూ “నేను కూడా అదే ఆలోచిస్తున్నాను. రూరల్ జిల్లా నుంచి వచ్చే వార్తలు బాగా తక్కువగా ఉంటున్నాయి. అందువల్లే జిల్లా టాబ్లాయిడ్‌లో కూడా సిటీవార్తలే ఎక్కువ గా ఇవ్వాల్సి వస్తోంది. మనవాళ్లు స్టాఫ్ రిపోర్టర్‌నుకూడా వేసారు కదా! ఈప్రాబ్లమ్‌ను అతితక్కువ సమయంలోనే అధిగమిస్తామనే నమ్మకం నాకుంది” చెప్పాడు.

“జిల్లాలోని చాలా మండలాలనుంచి వార్తలు బాగా ఆలస్యంగా వస్తున్నాయి. అందువల్ల పేజీలు ప్రింట్‌కు ఇవ్వడానికిరోజూ ఆలస్యమౌతోంది. ఈ పరిస్థితినికూడా అధిగమించాల్సిఉందని ”అన్నాడు కోటేశ్వరరావు.

“జిల్లాలో ఎన్ని రీజనల్ సెంటర్లు ఉన్నాయి? ” అడిగాడు అశోక్‌వర్ధన్.

“నాలుగున్నాయి. ఒకటి భీమునిపట్నంలో, మరొకటి అనకాపల్లిలో, ఇంకొకటి పాడేరులో, వేరొకటి సింహాచలంలో ఉన్నాయి ” చెప్పాడు సౌజన్యారావు.

“ఏఏ సెంటర్ల నుంచి తక్కువ వార్తలు, ఆలస్యంగా వార్తలు వస్తున్నాయో వివరంగా చెబితే కొంతవరకూ సమస్య పరిష్కరించుకోవడానికి అవకాశం ఉంటుంది” అన్నాడు అశోక్‌వర్ధన్.

“నిజమే ....రీజనల్ సెంటర్ల వారీగా రిపోర్టర్లతో మీటింగ్స్ పెడితే చాలావరకూ ఫలితముంటుంది’ ’ అంగీకరించాడు సౌజన్యారావు

“మంచిది అలాగే చేద్దాం ” అన్నాడు బ్రాంచ్‌మేనేజర్ శ్రీనివాస్.

అంతటితో వారి మీటింగ్ ముగిసింది.

xxxx xxxx xxxx

రోజులు సాఫీగా గడిచిపోతున్నాయి.

అశోక్‌వర్ధన్ ఉద్యోగంలో చేరి అప్పటికే రెండేళ్లయిపోయింది. తండ్రి సూర్యప్రసాద్ సూచనల తోనూ. న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ శ్రీరామమూర్తి, న్యూస్‌ఎడిటర్ సౌజన్యారావుల సలహాలతోనూ వృత్తిపరమైన మెళుకువలను అనుభవపూర్వకంగా అశోక్‌వర్ధన్ తెలుసుకుంటున్నాడు.

ఉన్నట్టుండి ఒకరోజు న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌చార్జ్ శ్రీరామమూర్తి నుంచి ఎస్.ఎమ్.ఎస్.ఒకటి అశోక్‌వర్ధన్ మొబైల్‌కు వచ్చింది. తన పర్సనల్ మొబైల్ నంబర్ ఇస్తూ ఇకపై దానికే కాంటాక్ట్ చేయమని అందులో ఆయన సూచించాడు.

ఏమైఉంటుందన్న తర్జనభర్జనలో అశోక్‌వర్ధన్ తన మొబైల్‌కు వచ్చిన మెసేజ్‌లో ఉన్న ఫోన్‌నంబర్ కు కాల్ చేసాడు శ్రీరామమూర్తికి.
"గుడ్ మార్నింగ్ సర్! నేను వైజాగ్ నుంచి అశోక్‌ను"
"గుడ్ మార్నింగ్ అశోక్! ఎలా ఉన్నావ్ ?"
"బాగానే ఉన్నాను సార్ ! మీరు కొత్త ఫోన్ నంబరు పంపించారు. ఇకనుంచి ఆనంబరుకే కాంటాక్ట్ చేయాలని మెసేజ్ ఇచ్చారు"
" అవును అశోక్...నేను కొన్ని అనివార్య పరిస్థితులవలన 'త్రిముఖం' పత్రికనుంచి తప్పుకున్నాను. ఒక న్యూస్‌ఛానల్‌లో చేరుతున్నాను. అఫీసవాళ్లు ఇచ్చిన నంబరు ఇకనాది కాదు కనుక పర్సనల్ మొబైల్ నంబర్‌ను ఇచ్చాను"

"ఓకే సార్! " అన్నాడు అశోక్‌వర్ధన్. శ్రీరామమూర్తి ఎందుకు 'త్రిముఖం' పత్రికనుంచి తప్పుకున్నారన్న విషయంపై పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నాడతడు.

అంతలోనే శ్రీరామమూర్తి మాట్లాడుతూ "ఈపేపర్‌ను తీసుకురావడంకోసం అష్టకష్టాలు పడాల్సివచ్చింది. ఎం.డి.గారితో కలసి టీమంతా రేయింబవళ్లు వర్క్ చేసాం. దీనిని 'నారాజ్యం' పత్రికకు దీటుగా మార్కెట్లో నిలబెట్టడానికి శ్రమించాం. ఈరెండేళ్లలో పేపర్ బాగా పుంజుకోవడం తో చాలామంది కళ్లు దీనిపై పడ్డాయి. వార్తల కోసం కాకుండా కలెక్షన్లు, కమీషన్లు పరమావధిగా బతికే జర్నలిస్టులు కొంతమంది 'త్రిముఖం' లోకి రావడం మొదలు పెట్టారు. దాంతో ఏ లక్ష్యంతో పే ఎపర్ ప్రారంభించామో ఆ ఆదర్శాలు, లక్ష్యాలు చెల్లాచెదురైపోయాయి. కలాన్ని నమ్ముకున్న జర్నలిస్టులకు ఆకుల్లో, కులాన్ని నమ్ముకున్న ఎర్నలిస్టులకు కంచాల్లో వడ్డించే ధోరణి ప్రారంభమ య్యింది. అందుకే ఇప్పుడే తప్పుకుంటే మంచిదనే ఉద్దేశ్యంతో బయటకు వచ్చేసాను" అన్నాడు.

"మంచిదే సార్! మీ ప్లేస్‌లో ఎవరు వస్తున్నారు...?" అడిగాడు అశోక్‌వర్ధన్.

"విష్ణుప్రకాశ్ అని ఒకాయన వస్తున్నాడు. ఆయన ఎం.డి.గారి బంధువు అట" చెప్పాడు శ్రీరామ మూర్తి.

తనతో శ్రీరామమూర్తి మాట్లాడిన తర్వాత వెంటనే సౌజన్యారావుకు ఫోన్‌చేసాడు అశోక్‌వర్ధన్.

"గుడ్ మార్నింగ్ సర్!"

"గుడ్ మార్నింగ్ అశోక్....చెప్పండి"

" న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌చార్జ్ శ్రీరామమూర్తిగారు మన పేపర్లో మానేసారట...మీకు తెలిసిందా"
"నేను కూడా ఆ విషయం విన్నాను..చాలా మంచాయన"
"ఏదో న్యూస్ ఛానల్‌లో ఎడిటర్ గా జాయినవుతున్నారట "
"అవును కొత్తగా ఈనెలలో ఆన్యూస్‌ఛానల్ మొదలౌతుందని తెలిసింది"

“ ఆయన ప్లేస్‌లో విష్ణుప్రకాశ్ అని ఎవరో జాయిన్ అవుతున్నారట ”

“నిజమే…ఆయన ఈయనకు పూర్తిగా విభిన్నం….వార్తల కవరేజీకన్నా ప్యాకేజీలకే ఆయన ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారని విన్నాను. ఆయన న్యూస్ఎడిటర్‌గా పనిచేసిన ప్రాంతంలోని రిపోర్టర్లు, డెస్క్ మిత్రులు చెప్పగా విన్నాను.”

“అలా అయితే కష్టమేనన్నమాట ”

“కష్టం ఏముంటుంది? ఆయనకు ఇష్టపడే విధంగా పనిచేయడమే. లేకుంటే ఆయనకు ఇష్టులైన వారిని నియమించుకుంటాడు. ఏది ఏమైనా మన డ్యూటీలను ఎలాంటి వివాదాలకు తావులేని విధంగా చేసుకుందాం”

“ఓకే సార్! ఉంటాను” కాల్ కట్‌చేసాడు అశోక్‌వర్ధన్.

×××××× ××××× ×××××

ఆరోజు ఉన్న కార్యక్రమాల వివరాలను డైరీలో చూసుకుంటున్నాడు అశోక్‌వర్ధన్. వాటికి ఏఏ రిపోర్టర్లను పంపించాలి? తాను ఏ కార్యక్రమాలకు వెళ్లాలి అనే వివరాలు రాసుకుంటున్నాడు. ఇంతలో ఫోన్ రింగయ్యింది. ఎల్లప్పుడూ శ్రీరామమూర్తి ఫోన్‌చేసే నంబర్ నుంచి.

వెంటనే లిఫ్ట్‌చేసిన అశోక్‌వర్ధన్

“నమస్తే సార్! గుడ్ మార్నింగ్ ” అన్నాడు.

“ఏమయ్యా ప్రతిరోజూ ఉదయం పదిగంటలకే నాకు ఫోన్ చేయాలని తెలియదా? ” అని అవతల నుంచి మాట్లాడుతున్నాయన ప్రశ్నించాడు.

“తెలియదు సార్! సారీ సార్”

“నీ సారీలకేం గానీ, నాపేరు విష్ణుప్రకాశ్. నేను మీ న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్‌గా నిన్ననే జాయిన్ అయ్యాను. ”

“వెల్‌కమ్ సార్!”

“ఆ…సరే ఈరోజు ప్రధానమైన షెడ్యూళ్లు ఏమిటి?”

“పెద్దగా ఏం లేవు సార్! జిల్లా పరిషత్‌లో సమావేశం, రెండు చోట్ల ధర్నాలు, రెండు ప్రెస్‌మీట్లు, అంతే సార్!”

“ సరే ముఖ్యమైన వార్తలు వెంటనే చెప్పు…ఎప్పటికప్పుడు టచ్‌లో ఉండు…”

“అలాగే సార్! ” అవతలినుంచి విష్ణుప్రకాశ్ కాల్ కట్‌చేసాడు.

ఉదయం పది గంటలకే ముఖ్యమైన వార్తల షెడ్యూళ్లు చెప్పడం ఎలా అని ఆలోచిస్తున్నాడు అశోక్‌వర్ధన్. ఎంగేజ్‌మెంట్స్ వివరాలు చెబితే సరిపోతుందని తనకు తానే సర్దిచెప్పుకున్నాడు.
శ్రీరామమూర్తి హయాంలో నైతే సాయంత్రం తాను ఐదు గంటలకు షెడ్యూలు చెప్పేవాడు. ఆ వార్తల్లో వేటిని మెయిన్ ఎడిషన్‌కు పంపించాలో ఆయనే సూచించేవారు.
సౌజన్యారావు ఇంతకు ముందే చెప్పినట్లు విష్ణుప్రకాశ్ పద్ధతి కొంత విభిన్నంగానే అన్పించింది. ఏదైతేనేం పత్రిక విధానాలకు అనుగుణంగా నడుచుకుంటే చాలన్న అభిప్రాయానికి అశోక్‌వర్ధన్ వచ్చాడు.

తనకు న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ విష్ణుప్రకాశ్ ఫోన్‌చేసి చెప్పిన విషయాన్ని సౌజన్యారావుకు అశోక్‌వర్ధన్ తెలియజేసాడు ఫోన్లో.

"అలాగా ! ప్రతి రోజూ ఉదయం పది నుంచి పన్నెండు గంటల వరకూ డెస్క్ మీటింగులు పెట్టుకోవాలని కూడా మాకు ఆయన చెప్పారని" సౌజన్యారావు అన్నాడు.
"రోజూ అర్ధరాత్రి దాటిన వరకూ పనిచేసి ఉదయం పది గంటలకే డెస్క్ మీటింగ్‌కు ఏ సబ్‌ఎడిటర్ రాగలడని…కనీస అవగాహన కూడా ఆయనకు లేదని " సౌజన్యారావే అన్నాడు మళ్లీ.
అశోక్‌వర్ధన్ విశాఖపట్నంలో స్టాఫ్ రిపోర్టర్‌గా పనిచేయడం ప్రారంభించి మూడేళ్లు కావొస్తున్నా ఇంకా తన ఫ్రెండ్స్ రూమ్‌లోనే ఉంటూ వారానికోసారి వీక్లీ ఆఫ్‌కి కాకినాడ వెళ్లి వస్తున్నాడు. కొత్త గా జాయిన్ అయిన న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ పరిస్థితి చూస్తుంటే తాను వీక్లీ ఆఫ్ రోజు కూడా డ్యూటీ చేయకతప్పదేమో అనిపిస్తోంది. ఏం చేయాలో తేల్చుకోలేక సతమతమౌతున్నాడు. అదే విషయాన్ని తన తండ్రి సూర్యప్రసాద్‌కు కూడా చెప్పాడు.

"ఏమీ టెన్షన్ అవ్వాల్సిన పనిలేదు. ఈ ఫీల్డులో ఇదంతా కామన్. కొన్నాళ్లు గడిచిన తర్వాత దీన్నుంచి బయట పడొచ్చు." సలహా ఇచ్చాడు ఆయన.
మొదట్లో అశోక్‌వర్ధన్ జీతం తక్కువగానే ఉన్నా అతని పనితీరుని మెచ్చి ఏడాదికో ఇంక్రిమెంటుతో రెండేళ్లలో జీతం రెట్టింపైంది. అద్దెకు మంచి ఇంటిని తీసుకొని తండ్రిని కూడా కాకినాడ నుంచి విశాఖపట్నం తీసుకొచ్చేయాలన్న ఆలోచనలో అతడున్నాడు. సూర్యప్రసాద్‌కు కూడా అదే మంచిదన్పించింది. కాకినాడలో ఉన్న సొంతింటిని అద్దెకు ఇచ్చేసి విశాఖపట్నానికి వచ్చేసాడు. అన్ని సౌకర్యాలతో ఉన్న మంచి డబుల్‌బెడ్‌రూమ్ ఇల్లు సీతమ్మధారలో అద్దెకు తీసుకుని అందులోనే తండ్రీకొడుకులు దిగిపోయారు. ఇదంతా వారం రోజుల్లో జరిగిపోయింది.

××× ×××× ××× ××××

ఆరోజు సాయంత్రం నాలుగు గంటలకు విష్ణుప్రకాశ్ ఒక మెసేజ్ పంపించాడు. సార్వత్రిక ఎన్నికలు వస్తున్నందున వెంటనే రిపోర్టర్లతో మీటింగ్ ఏర్పాటు చేయాలని ...ఏఏ నియోజకవర్గాల లలో ఏఏ పార్టీల నుంచి ఎవరెవరు పోటీచేసే అవకాశం ఉందో అన్నీ తెలుసుకుని వివరంగా మెసేజ్ ఇవ్వాలని అందులో సారాంశం.

మీడియాకు ఎన్నికల ఫీవర్ అప్పుడే వచ్చేసిందని సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లకు అర్థమైంది. ఈసందర్భంగానే హైదరాబాద్‌లోని త్రిముఖం ప్రధానకార్యాలయం లో మీటింగ్ మొదలైంది.

ఎన్నికల సమయంలో ప్రకటనలు, వార్తల కవరేజ్ ఎలా ఉండాలి? ఏంచేయాలి? అనే విష యాలపై మేనేజింగ్ డైరెక్టర్ రామకోటి, ఎడిటర్ శ్రీకాంతాచార్యులు, అసిస్టెంట్ ఎడిటర్ రఘురామ్, న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ విష్ణుప్రకాశ్‌లు చర్చిస్తున్నారు.

ముందుగా రామకోటి మాట్లాడుతూ “మనం సపోర్టుచేస్తున్న పార్టీ గత పదేళ్ల నుంచీ అధికారంలో ఉంది. ఈసారికూడా ప్రజలుదానికే అధికారం కట్టబెడతారని నేనుఅనుకోవడంలేదు.” అన్నాడు.

“అవును సార్ ప్రతిపక్షం కూడా ఈపదేళ్లలో బాగా బలపడింది” చెప్పాడు రఘురామ్.

“నిజమే ఎక్కువకాలం అధికారంలో ఉంటే ప్రజల్లో వ్యతిరేకత సహజమేకదా ” అన్నాడు శ్రీకాంతాచార్యులు.

“ప్రతిపక్షనాయకుడు భుజంగంనాయుడు చేసిన పాదయాత్ర ఆపార్టీకి కొత్తగా జవసత్వాలను తీసుకొచ్చింది” అన్నాడు రఘురామ్.

విష్ణుప్రకాశ్ మాట్లాడుతూ “ఈ ఎన్నికల్లో ప్రతిపక్షం వైపే ప్రజల మొగ్గు కన్పించేలా ఉంది. అయితే మనం పత్రికలో ఆవిషయాన్ని గట్టిగా చెబితే మన పత్రిక విశ్వసనీయతని మన పాఠకులు సందేహించే ప్రమాదం కూడా ఉంది” అన్నాడు.

“చెప్పండి ఏం చేద్దాం? ఈ ఎన్నికల్లో మన పత్రిక ఆర్థికంగా బాగా నిలదొక్కుకోవాల్సిన అవసరం ఉంది.ఇప్పటికే అధికార పార్టీకి చెందిన పత్రికగా ముద్రపడినందున మనమీద ప్రతిపక్షాలకు కూడా కన్నెర్రగానే ఉంది. వారివైపు నుంచి ప్రకటనలు వచ్చే అవకాశాలు తక్కువగా ఉంటాయి కదా” సందేహం వ్యక్తం చేసాడు రామకోటి.

విష్ణుప్రకాశ్ జోక్యం చేసుకుని “ప్రకటనలవలన ఎంతవస్తుంది? అది స్వల్పమే. పత్రికల్లో ప్రకటనలు ఇస్తే ఎన్నికల సంఘానికి ఖర్చు చూపించాలి. ఇది పోటీచేసే అభ్యర్థులకు పెద్దతలనొప్పి . వారిచ్చే ప్రకటనల క్లిప్పింగులతో సహా బిల్లులను మనం కూడా ఎన్నికలసంఘానికి పంపించాలి. అలా చేస్తే ఇదంతా రికార్డెడ్‌గా చూపించాలి. ఇన్‌కమ్ టాక్సు డిపార్టుమెంటుకు కూడా ఈ ఆదాయ వివరాలు వెళ్తాయి. దీంతో లేనిపోని సమస్యలు పెరుగుతాయి. ” అన్నాడు.

"ఇంకేం చేద్దాం ? " ఒకేసారి అడిగారు రామకోటి, శ్రీకాంతాచార్యులు ఇద్దరూ.

"ఏముందీ...? ఎన్నికల్లో పోటీచేసే ప్రతీ అభ్యర్ధి కోట్లాది రూపాయలు ఖర్చు చేసైనా సరే గెలవాలనే తాపత్రయంతో ఉంటారు. వారి ఆశనే మనం క్యాష్‌గా మార్చుకోవాలి. ప్రతీ అభ్యర్ధితో నూ మాట్లాడి ఎన్నికల ప్రచారకవరేజ్, ఇంటర్వ్యూలు, పొలిటికల్‌రివ్యూల రూపంలో అనుకూలంగా వార్తలు, కథనాలు ఇస్తామని వారిని ఒప్పించి, వాటికి ప్యాకేజీల రూపంలో మాట్లాడుకోవడమే..." చెప్పాడు విష్ణుప్రకాశ్.

"అలా చేస్తే పెయిడ్ ఆర్టికల్స్ కిందకు వస్తుంది కదా? ఇది ఎన్నికల ప్రవర్తనా నియమావళికి పూర్తిగా విరుద్ధం. అంతేకాకుండా జర్నలిజం నైతిక ప్రమాణాలకు కూడా అది తిలోదకాలివ్వడమే" తన అభిప్రాయం చెప్పాడు రఘురామ్.

"నీతి..నిజాయితీ...అంటే ఈ ఫీల్డులో నేలకర్చుకుపోతాం. ఒకప్పటి రోజులు కావు కోట్లాది రూపాయలు ఖర్చుచేస్తేగానీ పేపర్ నడపలేం. మనమేమీ అక్రమంగా రాజకీయనాయకులను దోచుకోవడం లేదు. ఎన్నికల సమయంలో ఆయా అభ్యర్ధులు తమకు ఫేవర్‌గా రాయాలని లోకల్ గా ఉన్న రిపోర్టర్లకు తృణమో..పణమో ఇస్తుంటారని మనకి కూడా తెలుసు. అదే పెద్దమొత్తంగా ఏకంగా సంస్థకే అందేలా చర్యలు తీసుకుంటాం..." అన్నాడు విష్ణుప్రకాశ్.

"ఇదేదో బాగుంది...అలాగే చేయండి...అనుకూల వార్తలేకాదు, ఎన్నికల ప్రచార కవరేజ్‌కు కూడా కొంత సపరేటుగా రేట్ ఫిక్స్ చేయండి. " అదేశిస్తున్నట్లు చెప్పాడు రామకోటి.

జర్నలిజంలో పెయిడ్‌న్యూస్‌ని ప్రోత్సాహించడం సరైన విధానం కాదని తెలిసినా ఏమీ చెప్పలేక మౌనం వహించాడు రఘురామ్.

పెయిడ్‌న్యూస్ ఆత్మహత్యా సదృశం...ఒకసారి పాఠకుల్లో విశ్వసనీయత కోల్పోతే తిరిగి సంపాదించడం చాలా కష్టం. పెయిడ్‌న్యూస్ వల్ల తాత్కాలికంగా ఆర్థికప్రయోజనం కలిగినట్లు అన్పించినా దీర్ఘకాలంలో అది పత్రిక మనుగడకు పెనుముప్పుగా మారుతుందన్న విషయాన్నే రఘు రామ్ ఆలోచిస్తున్నాడు. తన మాటలను మిగిలిన ముగ్గురూ పట్టించుకునే స్థితిలో లేరని గమనించి ఏమీ చెప్పలేని నిస్సహాయ స్థితిలో ఆయన ఉండిపోయాడు.

"వెంటనే న్యూస్ ఎడిటర్లు, బ్యూరో ఇన్‌ఛార్జులు, స్టాఫ్ రిపోర్టర్లతో మీటింగు ఏర్పాటు చేయండి. ఈ విషయాలన్నీ వివరించి టార్గెట్లు ఫిక్స్ చేయండి " విష్ణుప్రకాశ్‌కు సూచించాడు రామకోటి.
"టార్గెట్లు పూర్తిచేయకపోయిన వారిని ఉద్యోగాలనుంచి తీసేస్తామని హెచ్చరించండి "
"ఓకే..అలానే చేద్దాం " చెప్పాడు విష్ణుప్రకాశ్.
అంతటితో ఆసమావేశం ముగిసింది.

×××× ×××× ××××

విశాఖపట్నం నుంచి సికిందరాబాద్ వెళ్తున్న గరీబ్‌రథ్ ట్రైన్‌లో అశోక్‌వర్ధన్, సౌజన్యారావు, శ్రీనివాస్‌లు ఉన్నారు. తెల్లవారితే ఉదయం పది గంటలకు హైదరాబాద్ ఆఫీసులో మీటింగ్.

ఎలక్షన్ల సందర్భంగా ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తున్న మీటింగ్ కావడంతో విశాఖపట్నం ఎడిషన్ కు బాధ్యులైన ముగ్గురూ వెళ్లాల్సివస్తోంది.

ఎలక్షన్ న్యూస్ కవరేజ్, ప్రకటనల విషయంలో ఎలాంటి టార్గెట్లు ఫిక్స్ చేస్తారో? వాటిని ఎలా పూర్తి చేయాలో ? అన్న సందేహాలు వారిని వెంటాడుతున్నాయి.

"గత ఎన్నికలతో పోలిస్తే ఇప్పుడు యాడ్ టారిఫ్ (రేట్లు) బాగాపెరిగింది. టార్గెట్ కూడా రెండు మూడింతలు పెరగనుంది. అందులోనూ పొలిటికల్‌యాడ్స్ క్యాష్ అండ్‌క్యారీ పద్ధతిలోనే తీసు కోవాల్సి ఉంటుంది" అన్నాడు శ్రీనివాస్.

"అంటే " అడిగాడు అశోక్‌వర్ధన్.

"క్యాష్ అండ్ క్యారీ అంటే యాడ్ బుక్‌చేసిన సమయంలోనే మొత్తం సొమ్ము తీసుకోవాలి. అంతే గానీ పబ్లిష్ అయిన తర్వాత యాడ్స్ అమౌంట్ కలెక్టుచేసి ఇస్తామంటే కుదరదు"

"ఓహో ! అలాగా నిజమే....రాజకీయనాయకులు గోడమీద పిల్లుల్లాంటివారు ఎవడు ఎప్పుడు ఏపార్టీలో ఉంటాడో...? ఏ నిర్ణయం తీసుకుంటాడో ? వారికే తెలియదు. కాబట్టి యాడ్ బుక్‌చేసి న సమయంలోనే సొమ్ముకూడా తీసుకోవడమే మంచిది " అన్నాడు అశోక్‌వర్ధన్.

"లేదంటే యాడ్‌బుక్ చేసిన రిపోర్టర్ బుక్కయిపోతాడు. ఆసొమ్మును ఆతనికి ఇచ్చే లైన్‌అకౌంట్ నుంచే రికవరీ చేయాల్సిఉంటుంది" చెప్పాడు శ్రీనివాస్.

"ఈ మీటింగ్‌లో ఏం చెబుతారో శ్రద్ధగా విని న్యూస్ విషయంలోనూ, యాడ్స్ విషయంలోనూ మంచి ప్లానింగ్ చేసుకుందాం " తన మనసులోమాట చెప్పాడు సౌజన్యారావు.

"ఈసారి పెయిడ్ ఆర్టికల్స్ మీద ఎక్కువగా దృష్టి కేంద్రీకరిస్తున్నారని తెలిసింది. మన ప్రాంతంలో సొమ్ములు ఇచ్చి వార్తలు రాయించుకోవడానికి సిద్ధంగా ఉంటారా ?" సందేహంగా అడిగాడు అశోక్‌వర్ధన్.

"ఎందుకుండరు? రాజకీయనాయకులు మనుగడలో ఉన్నట్లు ప్రజలకు తెలియాలంటే నిత్యం న్యూస్‌పేపర్లలో వారి పేర్లు, టీవీ ఛానళ్లలో వారి ముఖాలు కన్పిస్తూ ఉండాలి. లేకుంటే తమని జనం మర్చిపోతారని వారి భయం. అందులోనూ ఎన్నికల సమయంలో ఇలాంటి పబ్లిసిటీ మరింత కీలకం. ఓట్లు కొనుక్కోవడానికి రెడీచేసేసొమ్మునుంచే కొంత పక్కనపెట్టి వార్తలను కొనుక్కుంటారు' ' చెప్పాడు శ్రీనివాస్.

"ఓట్లు కొనుగోలు అనేది చట్టవిరుద్ధం కదా! అందులోనూ ఓటర్లు ఎక్కువమంది నిరక్షరాస్యులు కాబట్టి ఈ ప్రజాస్వామ్యంలో సహజంగా మారింది. అందరికీ నీతులు చెప్పి, హితోపదేశాలు చేసే

పత్రికలే వార్తలు అమ్ముకోవడం ఏమైనా బాగుంటుందా? ” మళ్లీ తన మనసులోని సందేహాన్ని బయటపెట్టాడు అశోక్‌వర్ధన్.

“ఈ మాట మన ముగ్గురు మధ్య అన్నారు. కాబట్టి సరిపోయింది. పొరపాటున కూడా మీటింగ్‌లో నోరుజారకండి. న్యాయమైనా…అన్యాయమైనా…మన సంస్థ యాజమాన్యం చెప్పేపని చేయడానికే మనం ఉన్నాం ” అన్నాడు శ్రీనివాస్

“ ఈ పెయిడ్ న్యూస్ అనేది జర్నలిజానికి పట్టిన జాడ్యమే. ఉత్తరాది రాష్ట్రాల ఎన్నికలలో అక్కడి పత్రికలు ఏడాది కిందట ఈ అవలక్షణానికి తెరతీసాయి. దానిని మనతెలుగు పత్రికలు ఈఎన్నికల్లో అమలుచేయడానికి అందిపుచ్చుకున్నాయి.” చెప్పాడు సౌజన్యారావు తనకు తెలిసిన విషయాన్ని.

“బలేవారే…! ఈ మాట అందరి మధ్య మీటింగ్‌లో ఎలా అంటాను? నాకు వచ్చిన సందేహాన్ని మీముందు బయట పెట్టానంతే ” అన్నాడు అశోక్‌వర్ధన్.

“ సరే …మన ఎండీగారి మీటింగ్‌లో ఎవరేం చెబుతారో అంతా విని నోట్ చేసుకుందాం . మనకు మనంగా ఏ సలహాలూ ఇవ్వొద్దు. వారు చెప్పిన విషయాలు మొత్తం విని టార్గెట్లు పూర్తి చేస్తామని చెబుదాం” అన్నాడు శ్రీనివాస్.

“ఓకే అదే మంచిది. అలాగే చేద్దాం. మనం తొందరపడి నోరుజారి తర్వాత ఇబ్బందులకు గురికావడం ఎవరికీ మంచిది కాదు. ఇప్పటి వరకూ మన విశాఖ ఎడిషన్ మంచి టీమ్ వర్క్‌తో ముందుకు సాగుతోంది. అదే పద్దతిలో ముందుకు వెళ్దాం” అన్నాడు సౌజన్యారావు.

“ఉదయమే లేచి మీటింగ్‌కు రెడీ కావాలి కదా…ఇక పడుకుందాం…గుడ్‌నైట్” అన్నాడు శ్రీనివాస్.

“గుడ్‌నైట్” చెప్పుకుంటూ ఎవరి బెర్తులకు వారు చేరారు.

×××× ×××× ××××

‘త్రిముఖం’ ప్రధానకార్యాలయానికి అశోక్‌వర్ధన్ బృందం చేరుకునేసరికి ఉదయం పదిన్నర గంటలైంది. అప్పటికే రాష్ట్రం నలుమూలలనుంచి వచ్చిన వివిధ ఎడిషన్ కేంద్రాల బ్రాంచ్‌మేనేజర్లు, న్యూస్ ఎడిటర్లు,బ్యూరో ఇన్‌ఛార్జ్‌లు, స్టాఫ్ రిపోర్టర్లుతో కాన్ఫరెన్స్ హాలు నిండిపోయింది. ఇంకా మీటింగ్ మొదలుకాలేదు.

ఆఫీసు ఎదురుగా దిగువనున్న క్యాంటీన్‌లో టిఫిన్లు చేసి కాన్ఫరెన్స్‌హాల్లోకి వెళ్లారు సౌజన్యారావు, అశోక్‌వర్ధన్, శ్రీనివాస్‌లు.

చాలా రోజుల తర్వాత అన్ని ఎడిషన్ కేంద్రాల ముఖ్యులంతా ఒకేచోట కలవడంతో సందడిగా ఉంది వాతావరణం.

తమ తమ పరిదుల్లో జరిగిన విశేషాలు, సాధించిన ఎచీవ్‌మెంట్లు గురించి ఒకరితో మరొకరు చెప్పుకుంటూఉత్సాహం చూపిస్తున్నారు. ఈలోగాఅందరికీ టీలు,కాఫీలను ఆఫీస్‌బాయ్స్ అందజేసారు.

పదకొండు గంటలకు పత్రిక ఎండీ రామకోటి, ఎడిటర్ శ్రీకాంతాచార్యులు, క్వాలిటీసెల్ ఇన్‌ఛార్జ్ రఘురామ్, న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ విష్ణు ప్రకాశ్‌లు కాన్ఫరెన్స్‌హాల్లోకి వచ్చారు.

వారంతా లోపలకు రాగానే అంతవరకూ సందడిగా ఉన్న హాల్లోఉన్నవారంతా ఒక్కసారి గా నిశ్శబ్ధమైపోయారు. గౌరవపూర్వకంగా లేచి నిల్చున్నారు. అందరినీ చిరునవ్వుతో విష్ చేసాడు రామకోటి. సూటిగా విషయానికొచ్చేసాడు.

"మీ అందర్నీ ఇలాఒకేసారి మీటింగ్‌కు రమ్మని పిలవడంలో విశేషం ఏమిటో మీకు ఇప్పటికే సూచాయగా అర్ధమై ఉంటుందని అనుకుంటాను. మరికొన్ని నెలల్లో జరిగే సార్వత్రిక ఎన్నికల్లో మనం క్రియాశీలకపాత్ర పోషించబోతున్నాం. సర్క్యులేషన్‌బట్టి చూస్తే రాష్ట్రంలో రెండోస్థానంలో ఉన్నాం. మన పత్రిక క్రెడిబులిటీ విషయంలో మనమే ముందున్నామని పాఠకులంతా నమ్ముతున్నారు. ఇలాంటి సమయంలోనే మనం బిజినెస్‌ను మరింత పెంచుకోవాలి. ఎన్నికలసమయంలో వచ్చే రాజకీయనాయకుల యాడ్స్ వలన పెద్దగా ఆదాయం రాదు. ఎందుకంటే ఎన్నికల సంఘానికి ఆభ్యర్ధులు తాము అధికారికంగా ఖర్చుచేసే ప్రతీపైసాకూ లెక్క చూపించాల్సి ఉంటుంది. అందు వలన పత్రికల్లోనూ, టీవీ ఛానళ్లలోనూ ప్రకటనల కోసం పెద్దగా డబ్బు ఖర్చుపెట్టడానికి సాహసించరు. ప్రకటనల రేట్లు ఇప్పటికే ప్రభుత్వం దగ్గర రికార్డై ఉన్నాయి. కాబట్టి ఎలాంటి ప్రకటన ఎక్కడ వచ్చినా ఆయా అభ్యర్ధుల పేర్లతో అధికారులు రికార్డు చేసేస్తారు. దీనిని అధిగమించి మనం ఆదాయాన్ని సమకూర్చుకోవాలి. అందుకోసం కొత్తగా ఒక ప్లానింగ్ సిద్దం చేసాము"..ఒక్క నిమిషం ఆగాడు రామకోటి.

అందరి ముఖాల్లోకి చూసాడు. అందరూ ఆసక్తిగా అతన్నే చూస్తుండడంతో సంతృప్తిగా తలపంకిస్తూ మళ్లీ చెప్పడం మొదలు పెట్టాడు.

"పెయిడ్ న్యూస్, పెయిడ్‌ఆర్టికల్స్ అనే మాట ఇప్పటికే మీరు విని ఉంటారు. ఎన్నికలు ముగిసే వరకూ ఆవిధానాలనే మనం అమలు చేయాలనుకుంటున్నాం. అందుకే ఇప్పట్నుంచే పోటీచేస్తారనుకుంటున్న నాయకులను పూర్తి స్థాయిలో కాంటాక్ట్ చేయాలి. ఒక్కో ఎమ్మెల్యే అభ్యర్ధికి పది లక్షల రూపాయలు తగ్గకుండా, ఎంపీ అభ్యర్ధికి యాభైలక్షల రూపాయలు తగ్గకుండా ప్యాకేజీగానిర్ణయించాం. ఈప్యాకేజీకి అంగీకరించిన అభ్యర్ధి ఎన్నికల ప్రచార కవరేజ్ రెగ్యులర్‌గా మన పేపర్లో కన్పించాలి. ప్రతి రెండు మూడు రోజులకోసారి పొలిటికల్ రివ్యూ రాస్తూ ఆ అభ్యర్ధిని గెలిపిస్తేనే అభివృద్ధి సాధ్యం అన్పించేలా ఆకాశానికి ఎత్తేసేలా కథనాలు రాయాలి. ఆయనతో ఇంటర్వ్యూలు

వంటివిఎప్పటికప్పుడు ప్రచురించాలి. ప్రశ్నలూ మనం వేసుకొని వాటికి జవాబులు కూడా మనమే రాసుకుని ఆయనకు మరింత ప్రచారం కలిగించేలా ఇంటర్వ్యూలు వేయండి. ఆఅభ్యర్థికి నెగిటివ్‌గా ఒక్క వార్త కూడా రాయకూడదు. ప్రచురించకూడదు. అలా ఏదైనా జరిగినట్లు తెలిసిందంటే సీరియస్ యాక్షన్ ఉంటుంది. అయితే అందరు అభ్యర్థులూ ఈ ప్యాకేజీలకు సానుకూలంగా ఉంటా రని నేను అనుకోను. అలాంటివారికి ప్రజల్లో ఆదరణ ఉన్నా మనకు అనవసరం. వ్యతిరేకవార్తలు ఎక్కువగా అతనిపై రావాలి. పొరపాటున కూడా అతని ఎన్నికల ప్రచారానికి ఎలాంటి కవరేజ్ కూడా ఇవ్వకూడదు. మధ్యస్థంగా ప్యాకేజీ సొమ్ము ఇచ్చేవారికి కేవలం ఎన్నికల ప్రచారాల కవరేజ్ వార్తలు ఇస్తే చాలు. వారికి అనుకూలంగా గానీ, వ్యతిరేకంగాగానీ ప్రత్యేక కథనాలు, ఇంటర్వ్యూలు అవసరంలేదు. ఈప్యాకేజీలకు సంబంధించిన సొమ్ము ముందుగానే నగదు రూపంలో తీసుకోవాలి . చెక్కులు తీసుకుంటే వాటితో లేనిపోని తలనొప్పి. అంతేకాదు ఈ సొమ్ము ఎప్పటికప్పుడు హెడ్ ఆఫీసుకు ఒకకొత్త అకౌంట్‌కు పంపించాలి. ఇప్పుడున్న అకౌంట్ పుస్తకాలు, లెడ్జర్లలో ఈ అమౌంట్ వివరాలు రాయకండి. వాటిని యూనిట్ ఆఫీసుల్లో ఉంచకండి బ్రాంచ్‌మేనేజర్లు వాటిని తమ ఇళ్ల లోనే రహస్యంగా ఉంచాలి. ఈపెయిడ్ న్యూస్ వలన వచ్చిన సొమ్ములో న్యూస్ రాసిన రిపోర్టర్‌కు ఐదు శాతం, దానిని అందంగా ఆకర్షణీయంగా డిజైన్ చేసిన డెస్క్‌సబ్‌ఎడిటర్‌కు మూడు శాతం, బ్రాంచ్ మేనేజర్లకు రెండు శాతం కమీషన్ కూడా ఉంటుంది....ఓకేనా!?...." చెప్పడం ఆపాడు రామకోటి.

"ఎవరికైనా ఈ విషయంలో ఏమైనా సందేహాలు ఉన్నాయా? మీ సూచనలు,సలహాలు ఏవైనా ఉంటే చెప్పండి" అని అడిగాడు.

ఎవరూ ఎం మాట్లాడలేదు. ఎం.డీ. ఆదేశాలను తూ.చ.తప్పకుండా శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నట్లు అంతా కన్పించారు.

"మీరేమైనా చెబుతారా?"అంటూ శ్రీకాంతాచార్యులు, విష్ణుప్రకాశ్,రఘురామ్‌లను అడిగాడు రామకోటి.

"అన్ని విషయాలు మీరు చెప్పారు కదా? అందరికీ బాగా అర్థమైంది. కొత్తగా చెప్పే విషయాలైతే ఏం లేవని" అన్నాడు విష్ణుప్రకాశ్.

కేవలం అరగంటలోనే సమావేశం ముగిసింది.

తనకు హైదరాబాద్‌లో మరికొన్ని పనులున్నాయని రెండు రోజుల తర్వాత వస్తానని బ్రాంచ్ మేనేజర్ శ్రీనివాస్ మిగిలిన ఇద్దరికీ చెప్పాడు మీటింగ్ ముందే.

సౌజన్యారావు,అశోక్‌వర్ధన్‌లు సాయంత్రం ట్రైన్‌కు విశాఖపట్నం బయలుదేరడానికి ఎంతో టైమ్ ఉండడంతో ఆఫీసులోని మిగిలిన విభాగాలకువెళ్లారు. అప్పటికే హెచ్.ఆర్.విభాగంలో పనిఉందని శ్రీనివాస్ వెళ్లిపోయాడు.

వారిద్దరూ ముందుగా ఎడిటర్ ఛాంబర్‌కు వెళ్లి అక్కడ శ్రీకాంతాచార్యులను కలిసారు. ఆయన తన సహజధోరణితో కొంత సమయం వారిద్దరితో మాట్లాడాడు.విశాఖపట్నం, ఉత్తరాంధ్ర జిల్లాల్లోని సాహితీవేత్తలపై సమాచారాన్ని ఆయన వారిని అడిగాడు. ఆ జిల్లాల్లో జరుగుతున్న ప్రజా ఉద్యమాల పై వివరాలు అడిగి తెలుసుకున్నాడు." మెయిన్ ఎడిషన్‌కు మంచి స్టోరీలు ముందుగా ప్లాన్ చేసి పంపించాలని" చెప్పాడు. "అలాగే సార్! " అంటూ మరి కొంత సమయం ఎడిటర్ ఛాంబర్‌లో గడిపి వారిద్దరూ బయటకు వచ్చారు.

అక్కడ్నుంచి క్వాలిటీసెల్ ఇన్‌ఛార్జ్ రఘురామ్ గదిలోకి వెళ్లారు. ఆయన వారిని ఆదరంగా పలకరించి తాజా రాజకీయపరిణామాలపై వారితో ముచ్చటించాడు. విశాఖపట్నం ఎడిషన్‌ను, టాబ్లాయిడ్ పేజీలను మరింత మెరుగ్గా తీసుకురావడానికి ఏంచేస్తే బాగుంటుందన్న విషయాలపై సూచనలు ఇచ్చాడు. చివరిగా బాయ్‌తో కాఫీ తెప్పించాడు. కాఫీలుతాగి ఆయన గదినుంచి వారిద్దరూ బయటకు వచ్చారు.

ఆఫీసు కారిడార్‌లో ఒక పక్కనున్న విష్ణుప్రకాష్ సీటు దగ్గరకు వెళ్లారు వారిద్దరూ. అప్పటికే ఆయన ఎదురుగా ఉన్న కుర్చీలో నల్లగా తుమ్మమొద్దులాంటి ఓ ఏభైయేళ్ల వ్యక్తి కూర్చొని ఉన్నాడు. అతను ఏదో కవర్ తీసివిష్ణుప్రకాష్‌కు ఇవ్వబోతూ వీరిద్దరి రాక చూసి దానిని తిరిగి జేబులో కుక్కుకున్నాడు.

తన సీటు దగ్గరకు వచ్చిన సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లను చూసి ఎవరు అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసాడు విష్ణుప్రకాష్. వారిద్దరూ తమని తాము పరిచయం చేసుకోగా 'ఓహెూ మీరేనా!' అన్నట్లు తలూపాడు. ఆఫీసు బాయ్‌ని పిలిపించి రెండు చైర్లు తెప్పించాడు. వారు కూర్చొన్నాక తన ఎదురుగా ఉన్న వ్యక్తిని వారికి పరిచయం చేసాడు. అతనిపేరు బిక్షపతి అని, స్వస్థలం నెల్లూరని, కొంతకాలం నెల్లూరు ఎడిషన్‌కు న్యూస్ఎడిటర్‌గా పనిచేసాడని చెప్పాడు. వారిద్దర్నీ బిక్షపతికి పరిచ యం చేసాడు. "తనకు వేరే పని ఉందని,మళ్లీ తర్వాత కలుసుకుందాం" అని చెప్పి బిక్షపతి వారి దగ్గరనుంచి శెలవు తీసుకుని వెళ్లిపోయాడు.

తన ఎదురుగా కూర్చొన్న సౌజన్యారావు,అశోక్‌వర్ధన్‌లను చూస్తూ "నేను జాయిన్ అయ్యానని తెలిసినా ఒకసారి కూడా నేరుగా కలవడానికి ఎందుకు రాలేదు?" అంటూ సూటిగా ప్రశ్నించాడు విష్ణుప్రకాష్. తాము ఎదురుచూడని ప్రశ్నకి వారిద్దరూ విస్తుపోయారు.

"ఫోన్‌లో రెగ్యులర్‌గా మీతో మాట్లాడుతూ కాంటాక్టులో ఉన్నాం సార్!" అన్నారిద్దరూ.

"సరే...ఇప్పుడు చెప్పండి మీ జిల్లాలోని విశేషాలు ఏమిటి?"

"మామూలే సార్...ఎన్నికల హడావిడి మొదలైంది కదా! దానిపైనే అందరి కాన్సంట్రేషన్ " అన్నాడు అశోక్‌వర్ధన్.

"ఎలక్షన్ న్యూస్ అంటే మరీ రొటీన్‌గా ఉండకూడదు. దాని వలన మనకి, మనపేపర్‌కీ ఎంతో కొంత ఆర్థిక ప్రయోజనం ఉండాలి. అర్థమైందా? "

"అలాగే సార్! మీ సూచనలను తప్పక పాటిస్తాం " చెప్పాడు సౌజన్యారావు.

"మీ జిల్లాలో నాలుగైదు చోట్ల థర్మల్ పవర్ ప్లాంట్లు పెట్టడానికి ప్రభుత్వం అనుమతులు ఇచ్చింది తెలుసా?"

"సూచాయగా విన్నాను. ఇంతవరకూ పెద్దగా తెలియదు...ఇంతలో ఎలక్షన్లు వస్తున్నాయి. వీటి గురించి కూడా తెలుసుకుంటాను సార్!" అన్నాడు అశోక్‌వర్ధన్.

"మంచి వార్తలు ఇవ్వండి....ఇంకా సర్క్యులేషన్ బాగాపెరగాలి"

"అలాగే సార్"

"మీ జిల్లాలో కాకిపల్లి అనే ప్రాంతంలో పెట్టబోయే థర్మల్ పవర్ ప్రాజెక్టు కాలుష్యం వలన పక్కనే ఉన్న పక్షుల సంరక్షణా కేంద్రానికి ముప్పు తప్పదని అంతా అంటున్నారు"

"థర్మల్ కాలుష్యం వలన పక్షులకే ఏమిటి సార్! ప్రజలకు కూడా ముప్పు తప్పదు కదండీ. నీరంతా కలుషితమై తాగడానికీ, వ్యవసాయానికీ పనికి రాదు. భూములు కూడా పాడైపోతాయి." చెప్పాడు అశోక్‌వర్ధన్.

"అబ్బో నీకు చాలా విషయాలు తెలుసే"

"అదేం కాదు సార్! ఎక్కడో చదివాను...అంతే సార్!"

"సరే...కాకిపల్లిలో థర్మల్ పవర్ ప్లాంటు పెట్టబోయే ప్రాంతంపై మెయిన్‌కు మంచి స్టోరీ చేసి పంపించు"

"అలాగే సార్!" అన్నాడు విష్ణుప్రకాష్.

డెస్క్ పనితీరు గురించి సౌజన్యారావుతో మాట్లాడాడు విష్ణుప్రకాష్. చివరిగా "ఏ ట్రైనుకు వెళ్తున్నారు?" అని అడిగాడు.

"సాయంత్రం ఐదు గంటలకి విశాఖఎక్స్‌ప్రెస్‌లో వెళ్తున్నామని " చెప్పారు వారిద్దరు.

ఆయన దగ్గరనుంచి శెలవు తీసుకుని వారిద్దరూ సిటీలో షాపింగ్ పనిమీద వెళ్లారు. సాయంత్రం సికిందరాబాద్ రైల్వేస్టేషన్‌లో విశాఖఎక్స్‌ప్రెస్ ఎక్కారు.

××× ××× ×××

“మీరు జర్నలిస్టులా....?” అన్న ప్రశ్నతో అటువైపు చూసారు అశోక్‌వర్ధన్,సౌజన్యారావులు.

విశాఖఎక్స్‌ప్రెస్‌లోని థర్డ్ ఏసీ కంపార్ట్‌మెంట్లో కూర్చొని వారిద్దరూ ప్రస్తుత పత్రికా రంగం గురించి, ఎన్నికల వార్తల కవరేజ్ విషయాలపైనా చర్చించుకుంటున్నారు.

ఆ సంభాషణంతా వింటున్న ఓ పాతికేళ్ల యువతి వారిని “మీరు జర్నలిస్టులా....?” అంటూ చొరవగా ప్రశ్నించింది.

“అవును....మీరెవరు?”అని అడిగాడు అశోక్‌వర్ధన్.

“నాపేరు జ్యోతిర్మయి...అడ్వకేట్‌ను...సోషల్ యాక్టివిస్టుగా పనిచేస్తున్నాను” తనని తాను పరిచయం చేసుకుంది ఆమె.

“నా పేరు సౌజన్యారావు, ‘త్రిముఖం’ పత్రిక విశాఖపట్నం యూనిట్‌లో న్యూస్‌ఎడిటర్‌గా ఉన్నాను. ఈయన అశోక్‌వర్ధన్ విశాఖపట్నం జిల్లా స్టాఫ్‌రిపోర్టర్‌గా పనిచేస్తున్నారు” పరిచయం చేసుకున్నాడు సౌజన్యారావు.

“ఓ..! అలాగా ...మీరు కూడా వైజాగ్‌లోనే ఉంటున్నారా?”

“అవును”

ఆమెని ఇద్దరూ పరిశీలనగా చూసారు. మనిషి చామనఛాయగా ఉన్నా కళ్లు మాత్రం ఆకర్షణీయంగా ఉన్నాయి. ఒక విధంగా చెప్పాలంటే చైతన్య జ్యోతులుగా వెలుగుతున్నట్లు కన్పిస్తున్నాయి.

“ఉండేది వైజాగ్ టౌన్లోనే గానీ ఎక్కువగా ఉత్తరాంధ్ర జిల్లాల్లో తిరుగుతూ ఉంటాను. నెలలో వారం రోజులే ఇంటిపట్టున ఉండేది” చెప్పింది జ్యోతిర్మయి.

“మిగిలిన రోజుల్లో ఏం చేస్తారు?” ఆసక్తిగా అడిగాడు అశోక్‌వర్ధన్.

“ఏముందీ సోషల్ యాక్టివిస్టుని కదా...ఈ మూడు జిల్లాల్లో ఎక్కడ ఏ సామాజిక అన్యాయం జరిగినా వాటిపై ఆందోళనలు, నిరసన కార్యక్రమాలు, ఉద్యమాలు వాటిలో బిజీ” అంది జ్యోతిర్మయి.

“అలాగా...మరి హైదరాబాద్ వచ్చారు..ఎందుకని”

“ఇది కూడా యాక్టివిటీలో ఒక భాగమే. విజయనగరం జిల్లాలోని అటవీ ప్రాంతంలో బాక్సైట్ తవ్వకాలకు కొన్ని కార్పోరేట్ సంస్థలు ప్రభుత్వంతో ఒప్పందాన్ని కుదుర్చుకున్నాయి. మరో నెలరోజుల్లో తవ్వకాల పనులు మొదలుపెడుతున్నారు. అదే జరిగితే అక్కడున్న గిరిజన ప్రాంతాలకు చాలా ముప్పు పొంచి ఉంది. వన్యమృగాలు కూడా జనావాసాల్లోకి విరుచుకుపడతాయి. ఇప్పటికే ఏనుగుల గుంపు వలన విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో జరుగుతున్న బీభత్సం మీకు తెలియనిది కాదు. ఒడిసా ప్రభుత్వం...కార్పోరేట్ కంపెనీల స్వార్ధఫలితంగానే అక్కడ వాటికి నిలువనీడ కరువైంది. అవి ఆంధ్రాలోని జనావాసాల్లోకి వచ్చేసాయి...నిజం కాదంటారా......?” ఒక్క నిమిషం చెప్పడం ఆపింది జ్యోతిర్మయి.

"నిజమేనండి" అన్నాడు అశోక్‌వర్ధన్.

"ఎక్కడ ప్రజల్లో చైతన్యం ఉండదో? ఎక్కడ ప్రజలు ఎక్కువగా నిరక్షరాస్యులుగాఉంటారో? ఎక్కడ జనం ఆర్ధికంగా,సామాజికంగా దిగువస్థాయిలో ఉంటారో? ఎక్కడ మూఢనమ్మకాలు రాజ్యమేలు తుంటాయో? అలాంటి ప్రాంతాలపైనే కార్పోరేట్ కంపెనీల కన్ను ఉంటుంది"

"అంటే ఈస్టిండియా కంపెనీవారు మన దేశంలో పాతుకుపోయినట్లన్నమాట"

"కొంతవరకూ మీరు చెప్పింది నిజమే. ఎన్నో వందల యేళ్ల కిందట వారు అనుసరించిన విధానాలలోనే ఇప్పటి కార్పోరేట్ కంపెనీలు కూడా ముందుకు వెళ్తుంటాయి. వారు స్థానిక పాలకు లకు అప్పట్లో రకరకాల బహుమతులు ఇచ్చి తమ వ్యాపారాలకు అనుమతులు పొందేవారు. ఇప్పటి కార్పోరేట్ వ్యాపారులు స్థానిక ప్రజాప్రతినిధులకు డబ్బు, మద్యం వంటివి ఎరజూపి వారిని తమ గుప్పిట్లో పెట్టుకుంటున్నారు. అంతేకాదు ఈ కంపెనీలు ఒకవైపు ప్రజల శమశక్తినీ, ప్రకృతి వనరులనీ పెద్ద ఎత్తున దోచుకుంటూ తామే సమాజసేవకులమని భ్రమలు కల్పించడానికి సేవా కార్యక్రమాలు  కూడా చేస్తున్నట్లు ఫోజులు కొడుతుంటాయి. ఇవి పది రూపాయలు ఖర్చు చేస్తే వేలాది రూపాయలు ఖర్చు చేసినంత పబ్లిసిటీ ఇవ్వడానికి వారి పెంపుడు జంతువుల్లాంటి పత్రికలు, టీవీ ఛానళ్లు చాలాఉన్నాయి"

వారిద్దరి సంభాషణంతా తిరిగి పత్రికారంగంవైపు వస్తుండడంతో ఆమె మాటల ప్రవాహానికి సౌజన్యారావు అడ్డుకట్ట వేస్తూ

"మీరు ఇంతకీ హైదరాబాద్ ఎందుకు వచ్చారో ....చెప్పనే లేదు" అన్నాడు.

"ఆ విషయానికే వస్తున్నా...బాక్సైట్ తవ్వకాలకు ప్రభుత్వం ఇచ్చిన అనుమతులు అక్రమమని గిరిజనుల తరుపున ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని హైకోర్టులో దాఖలు చేసా...అంటే పిల్ అన్న మాట" చెప్పింది జ్యోతిర్మయి.

"హైకోర్టు నిర్ణయం మీకు అనుకూలంగా ఉంటుందని భావిస్తున్నారా?" ప్రశ్నించాడు అశోక్‌వర్ధన్.

"అదెలా చెప్పగలం?..ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఇంకా న్యాయవ్యవస్థే అంతో ఇంతో నిజాయితీతో ఉందని చెబుతుంటారు కదా! అందువల్ల ఆ ఆశతోనే పిల్ వేసాం. దానిని విచారణకు స్వీకరించాలా? వద్దా? అనేది అప్పటికి ఉన్న న్యాయమూర్తి విచక్షణపై అధారపడి ఉంటుంది. ఆయన నిజాయితీగా ఆలోచించి గిరిజనులకు అన్యాయం జరుగుతుందని భావిస్తే ఈ పిల్ మీద విచారణ జరుపుతారు. అలా కాకుండా కార్పోరేట్లు, ప్రభుత్వ ప్రలోభాలకు లొంగిపోతే దానిని కొట్టే స్తారు. ఏదైనా మన ప్రయత్నం మనం చేయాలి కదా" చెప్పిందామె.

"నిజమే"

"మీ కాంటాక్టు నెంబరు ఇవ్వండి. ఏదైనా సమాచారం మీకు ఇవ్వడానికి ఉపయోగపడుతుంది"

"ఓకే.." అంటూ తన మొబైల్ నంబర్‌ను ఇచ్చి జ్యోతిర్మయి నంబర్‌ను తీసుకున్నాడు అశోక్‌వర్ధన్.

"మీరు ఒకసారి గిరిజన ప్రాంతాలను, మత్స్యకార గ్రామాలను సందర్శించి లోతుగా పరిశీలన జరపండి. ఇప్పటి వరకూ ఏపత్రికలోనూ, ఛానల్‌లోనూ ఎవరూ రాయని చూపించని జనజీవన దుర్భర దృశ్యాలెన్నో కన్పిస్తాయి"

"నేను ఇప్పటికే చాలాసార్లు గిరిజన ప్రాంతాలు, మత్స్యకార గ్రామాలకు వార్తల సేకరణ నిమిత్తమై వెళ్లొచ్చాను"

"మంచిదే...కానీ ఆ సమయంలో మీరు ప్రభుత్వాధికారులతోనూ లేదా రాజకీయనాయకులతోనో వెళ్లి ఉంటారు. అందువల్ల మీకు వాస్తవాలు తెలిసే అవకాశాలు చాలా తక్కువ"

"ఏమిటా వాస్తవాలు?"

"మీకు మీరుగా మీ స్వంత వివేచనతో ఆ గ్రామాల్లో పర్యటించండి. అది కూడా ఒక్కో గ్రామంలో ఒక రోజంతా ఉండి పరిశీలన జరిపేలా ప్లాన్ చేసుకోండి. అప్పుడే అన్ని విషయాలు మీకు ఎవరూ చెప్పనవసరం లేకుండానే అర్థమౌతాయి"

"ఎలాంటి విషయాలు అవి?"

"గ్రామీణ జీవితం ఎలా పరాయీకరణలో నలిగిపోతోందో? సాంప్రదాయకంగా వస్తున్న చేతివృత్తుల చేతులు ఎలా విరిగిపోయాయో? కార్పొరేట్ పెట్టుబడిదారులు ఎలాంటి మాయలు ప్రదర్శిస్తూ గ్రామీణ ప్రజలను ఎలా వంచనకు గురి చేస్తున్నారో?అన్ని విషయాలు కళ్లకు కట్టినట్లు కన్పిస్తాయి"

"ప్రజలు అంతగా మోసపోతుంటే ప్రభుత్వం, అధికారులు, ప్రజాప్రతినిధులు ఏం చేస్తున్నట్లు?"

"ఈ దేశంలో పరిపాలన, ఎన్నికలు చాలా ఖరీదైన వ్యవహారంగా మారిపోయాయి. అందుకు అవసరమైన పెట్టుబడిని కార్పొరేట్ శక్తులే సమకూరుస్తూ తమ బినామీలనే ప్రజాప్రతినిధులుగా ఎన్నికల బరిలో నిలబెడుతున్నాయి.ఇప్పుడు మనం ప్రజాప్రతినిధులు అని చెప్పుకుంటున్నవారం తా కార్పోరేట్ పెట్టుబడిదారీ వర్గాల ప్రతినిధులే. అందువల్ల రాజకీయ పార్టీల జెండాల రంగుల్లో తేడాలు తప్పా వారి ప్రజావ్యతిరేక స్వభావం మాత్రం ఒక్కటే"

"అటువంటప్పుడు తమని దోపిడీ చేసేవారినే ప్రజలు ఎందుకు ఎన్నుకుంటున్నారు?"

"తప్పదు అంతకుమించి ప్రత్యామ్నాయం ప్రజలకు లేదు.ఏ ఎన్నికల్లోఅయినా ప్రజలు స్వయం గా ఆలోచించి ఓటు వేసే పరిస్థితి ఉందా? ధనం,కులం,మద్యం,మతం,వర్గం ఇలాఅనేక రకాల ప్రభావాల మధ్య ఓటు హక్కుకు విలువ లేకుండా పోయింది".

"ఈ పరిస్థితి మారాలంటే......?"

"ఏముందీ? తమ గురించి ప్రజలు ఆలోచించాలి తమ కష్టాలకు కారణం ఎవరో గుర్తించాలి. తమ కష్టాలకు కారణమైన వారిని ఎదుర్కొగలిగే మనోబలంతో ముందుకు కదలాలి".

"అలాంటి పరిస్థితులు ఇప్పుడు ఉన్నాయా?"

"లేవు, కానీ ప్రజల్లో ఆలోచనలుఉన్నాయి. వాటిని అవగాహన అనే దారిలో నడిపించాలి . అప్పుడే వారు తమసమస్యలకు మూలం ఎవరో? ఏమిటో? అది ఎక్కడుందో? గ్రహిస్తారు. అప్పుడే వారు సజీవ చైతన్యంతో ముందుకు కదులుతారు".

"మీమాటలు వినడానికి బాగానే ఉన్నాయి.కానీ ఆచరణలో సాధ్యమవుతాయంటారా....?"

"ఎందుకు కాదు, తప్పకుండా అవుతుంది. ఒకే ధ్యేయంతో పనిచేస్తే ఈ లక్ష్యానికి చేరుకోవడం సాధ్యమే. ఇప్పటికైతే కొంచెం కష్టంకావచ్చు.కానీ అసాధ్యం మాత్రంకాదు".

వారిద్దరి సంభాషణని ఆసక్తికరంగా వింటున్న సౌజన్యారావు "సరేనండి ఇప్పటికే ఆలస్యం అయింది ..... ఇక గుడ్ నైట్ " అంటూ మిడిల్‌బెర్త్‌ను కిందకు దించాడు.

అంతా నిద్ర పోవడానికి సన్నాహాలు చేసుకున్నారు.

తెల్లవారి విశాఖపట్నం స్టేషన్‌లో ట్రైన్ ఆగాక ఎవరికి వారు వీడ్కోలు చెప్పుకుని ఇళ్లకు వెళ్లారు.

×××× ×××× ×××× ×××

హైదరాబాద్ మీటింగ్ జరిగిన రెండు రోజులకువిశాఖపట్నం యూనిట్ ఆఫీస్‌లో మీటింగ్ ఏర్పాటు చేశారు. సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లు.

ఆర్‌సి ఇన్‌చార్జి రిపోర్టర్లు, నియోజకవర్గాల కేంద్రాల్లో పనిచేసే సీనియర్ రిపోర్టర్లు సమావేశానికి హాజరయ్యారు. హెడ్‌ఆపీస్‌లో జరిగిన మీటింగ్ విశేషాలను వారికి వివరించారు.

ఎన్నికల సమయంలో పోటీచేసే అభ్యర్థులతో కలిసి ప్రచార వార్తల కవరేజ్, అనుకూల కథనాలు రాయడానికి ప్యాకేజీలు మాట్లాడాలని సూచించారు.

హెడ్ ఆఫీస్‌లో ఇచ్చిన టార్గెట్‌లకు రూపాయి తగ్గినా మర్యాదగా ఉండదని రిపోర్టింగ్ నుంచి అలాంటప్పుడు తప్పుకోక తప్పదని హెచ్చరించారు.

అప్పటికే లైన్ అకౌంట్ పారితోషికాలు నెలల తరబడిఅందక విలవిలలాడుతున్న రిపోర్టర్లు ఈ విశేషాలు విని తమన్యూస్ ఎడిటర్‌కు,స్టాప్ రిపోర్టర్‌ను ఏమనాలో తెలియక వింత చూపులు చూశారు.

అయితే పెయిడ్‌న్యూస్ కోసం అందిన సొమ్ములో కొంతశాతం ఇస్తారన్న ఆశతో మనసులో అయిష్టత ఉన్న అడ్డంగా తల ఊపలేకపోయారు.

బయటకు మాత్రం చెప్పినట్లుగా టార్గెట్లు పూర్తి చేసేస్తామని హామీ ఇచ్చారు. తాము పెయిడ్ న్యూస్ విషయంలో టార్గెట్‌లు పూర్తిచేయకపోయినా మేనేజ్‌మెంట్‌తిట్లుతో సరిపెడుతుందని తమను రిపోర్టర్లుగా తీసివేయదని వారికి ఒకనమ్మకం. ఎందుకంటే నెలలతరబడి లైన్ అకౌంట్ పారితోషి కం ఇవ్వకపోయినా తమలా ఉచితంగా సేవలు అందిచడానికి ఎవరు ముందుకు రారని వారికి ఒక ధీమా.

పేపర్లు పారితోషికాలు ఇవ్వకపోయినా చాలా మంది రిపోర్టర్లు హాస్టళ్ల వార్డెన్ల దగ్గర, రేషన్ డీలర్ల దగ్గర, మద్యం దుకాణాల యజమానుల దగ్గర, కాంట్రాక్టర్ల దగ్గర వసూళ్లకు అలవాటు పడి పోవడంతో మేనేజ్‌మెంట్‌వెట్టి చాకిరిచేయించుకుంటున్న ఆపత్రికలను పట్టుకుని వేళ్లాడడం మానరు. ఈ సంగతి ఆయా పత్రికల నిర్వహకులకు తెలుసు. మనం సొమ్ములు ఇవ్వకుండా మనకి వార్తలు అవీ ఇస్తుంటారు. అడిగినప్పుడల్లా అన్నో ఇన్నో అడ్వరైజ్‌మెంట్లు ఇస్తున్నారు. ఇకవారు ఎవరిని ఎలా బ్లాక్‌మెయిల్‌చేసి దండుకున్నా మనకేం అనే అభిప్రాయాలనికి వారు ఎప్పుడో వచ్చేశారు.

అందుకే పత్రికలు,చానెళ్లలో వచ్చే వార్తలను జనం నమ్మడం మానేశారు. సొమ్ము అందితే వార్త లు ఎలా మారిపోతాయి. సొమ్ములు అందకపోతే ఎలాంటి వార్తలు వస్తుంటాయో ఎలిమెంటరీ స్కూ ల్ పిల్లాడు కూడా అర్థం చేసుకునే స్థాయికి ఎదిగిపోయాడు.

పెద్దగా శ్రమ పడకుండా ఎలక్షన్ సందర్భంగా పెయిడ్ న్యూస్ ఇవ్వడానికి, ప్యాకేజీలు మాట్లాడడానికి రిపోర్టర్లును ఒప్పించారు. సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లు.

నియోజకవర్గాలు, రిపోర్టర్ల వారీగా టార్గెట్‌లు ఫిక్స్ చేసి వాటిని ఒక డైరీలో అశోక్‌వర్ధన్ నోట్ చేశాడు.

“కాకిపల్లి మత్స్యకార గ్రామం ఎవరి ఏరియాలోకి వస్తుంది” అడిగాడు అశోక్‌వర్ధన్.

జ్ఞానప్రసాద్ అనే రిపోర్టర్ లేచి “సార్! అది మాఏరియాలో ఉంది. ఏమిటి విశేషమా? సార్!!” అన్నాడు.

“ఏమిలేదులే అక్కడేదో థర్మల్ విద్యుత్ కేంద్రం నిర్మిస్తారట నీకు తెలుసా?”

“నేను విన్నాను సార్!..... మా తహశీల్దార్ చెబుతుంటే విన్నాను”

“పక్కనేదో విదేశీ పక్షులు వచ్చే ఒక గ్రామం కూడా ఉందట”.

“అవునండీ... తేలిపేట అనే విలేజ్ సార్ అది. అవి సైబీరియా ప్రాంతం నుంచి వచ్చి ఈ విలేజ్ లోని చింతచెట్లపై ఉంటాయండి. వేల సంఖ్యలోవస్తాయి. చెట్లుపై గూళ్లుకట్టుకుని గుడ్లు పెట్టి పిల్లల ను పొదిగి అవి కాస్త పెద్దయ్యాక వాటితోకలిసి తిరిగి వెళ్లిపోతాయి. ఏడాదిలో ఆరు మాసాలు అవి ఆవిలేజ్‌లోనే ఉంటాయి సార్”.

“వాటికి ఆహారం, నీళ్లు, ఆ గ్రామస్థులే పెడతారా.?”

"అదేంలేదు సార్. ఆ విలేజ్‌లో చెట్లు ఎక్కువగా ఉండడంతో అక్కడ అవి ఉండటానికి అనుకూలం గా ఉంది. పక్కనే ఉన్న కాకిపల్లి విలేజ్ తంపర భూముల్లో చేపలను వేటాడి తింటాయి".

"తంపర భూములంటే చిత్తడినేలలా?"

"అవును సార్! ఏడాది పొడవునా అక్కడ నీరు నిలిచి ఉంటుంది. అందులో ఉండే చేపలపైనే ఈవిదేశీ వలస పక్షులు వెయ్యి కుటుంబాలకు పైగాస్వదేశీ మత్స్యకారులు అధారపడి ఉన్నారు".

"కాకిపల్లిలో థర్మల్ పవర్‌ప్లాంట్ ఎక్కడ భూములు కేటాయిస్తున్నారు ఏమైనాతెలుసా?"

"కొంచెం తెలుసు సార్. ఆ మండల సర్వేయర్ ద్వారా తెలిసింది.  తంపర భూములనే థర్మల్ ప్లాంట్‌కోసం కేటాయిస్తున్నారట".

"చిత్తడి భూముల్లో ఎలాంటి నిర్మాణాలు జరపకూడదని వాటిని పరిరక్షించాలని చట్టం ఉన్నట్లు అక్కడి  రెవెన్యూ అదికారులకు తెలియదా?"

"ఏమో సార్ నాకు తెలిసిన వివరాలు మీకు చెప్పాను" అన్నాడు.ఇంకే వివరాలు తనకుతెలియ వన్నట్టు

"సరేలే నేను ఆదివారం నాడు మీమండలానికి వస్తాను తేలిపేట, కాకిపల్లి విలేజ్‌లకు వెళదాం పరిస్థితి ఏమిటో తెలుస్తుంది".

"తప్పకుండా రండి సార్".

"ఓకే" అన్నాడు అశోక్‌వర్ధన్.

మీటింగ్ ముగిసిపోవడంతో ఎవరిఏరియాకు వారు వెళ్లే హడావిడిలో రిపోర్టర్లు ఉన్నారు . వారికి ఆఫీస్ పక్కనున్న  హొటల్లో భోజనాలు పెట్టించి ఇళ్లకు పంపించేశారు. సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లు.

××× ××× ×××

అదివారం ఉదయం ఏడు గంటలకే సూర్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. అసలే మే మాసం వేసవికాలం. ఉక్కపోత తీవ్రంగా ఉంది. కాకిపల్లి వెల్లడానికి అశోక్‌వర్ధన్ తమ స్టాఫ్ పోటో గ్రాపర్ రమణమూర్తితో కలిసి విశాఖపట్నం ఆర్టీసీ బస్‌స్టేషన్‌లో బస్సుకోసం ఎదురుచూస్తున్నాడు.

"హాలోసార్....బాగున్నారా!"  అన్న పలకరింపుతో ఒకసారి వెనుదిరిగాడు అశోక్‌వర్ధన్. ఏదో ఎక్కడో పరిచయమైన ముఖంలా కనిపించింది అతనిది.

ఆ వ్యక్తి నేరుగా "మీరే 'త్రిముఖం'  స్టాఫ్ రిపోర్టర్ అశోక్‌వర్ధన్ కదా! " అని ప్రశ్నించాడు. "అవును మీరెవరు?".

"నా పేరు దయానిధి. నేను జర్నలిస్ట్ల సంఘానికి అధ్యక్షుడిని. మీపత్రికలో ఉన్న చాలా మంది నా శిష్యులే. మీకు నేను పరిచయం లేదు లెండి. ఇప్పుడు నేను టివి ఛానల్‌కు న్యూస్ రిపోర్టర్‌గా ఉన్నాను.జర్నలిస్ట్ సంఘం తరుపున అన్ని నేనే చూస్తాను. నో ప్రాబ్లమ్.... ఏ ప్రాబ్లమ్ వచ్చినా వెంటనే చెప్పండి" గడగడ చెప్పుకుంటూ పోతున్నాడు అతను.

అశోక్‌వర్ధన్‌కు ఏం చెప్పాలో అర్థం కాలేదు. దయానిధి దగ్గర మద్యంతో అదోరకమైన సెంట్ కలిసిన వికృతమైనవాసన, ముద్దముద్దగా మాటలతో అతనే ఒక పెద్ద ప్రాబ్లమ్‌లా కనిపించాడు అశోక్‌వర్ధన్‌కి.

ఇంతలోనే కాకిపల్లి వెళ్లే బస్సు రావడంతో తరువాత కలుద్దామని చెప్పి అశోక్‌వర్ధన్ పోటోగ్రాఫర్‌తో కలిసి బస్సు ఎక్కేశాడు. బస్సు ఎక్కిన తరువాతకూడా అశోక్‌వర్ధన్ అంతకు ముందు తనను కలిసిన దయానిధి గురించే ఆలోచిస్తున్నాడు. అతని ముఖం ఇంతకు ముందు ఎక్కడ చూశాడో గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. బస్సు ఓ పది కిలోమీటర్లు వెళ్లేసరికి దయానిధి ఎవరో అతనికి గుర్తొచ్చింది.

ఒకప్పుడు దయానిధి కాకినాడలోనే ఉండేవాడు. అప్పటికి అశోక్‌వర్ధన్ స్టూడెంట్ గా ఉండే సమయంలో వారివీధిలోనే ఉంటూ ఒక చిట్‌ఫండ్ కంపెనీని నడిపేవాడు. లక్షలాది రూపాయలు చిట్స్ కట్టించుకుని జనం సొమ్ముతో జల్సాలు చేసేవాడు. అంతే చిట్‌ఫండ్ కంపెనీని ప్రారంభించిన ఏడాదిలోనే మూసేశారు. ఖాతాదారులు సొమ్ముతిరిగి చెల్లించకపోవడంతో వారంతా ఘర్షణకు దిగారు. ఆ విషయాలన్ని అప్పట్లో పేపర్లో రావడంతో కాకినాడ నుంచి పరారై పోయాడు. ఆ చిట్‌ఫండ్ సంస్థ యజమాని ఈ దయానిధి జనాన్ని చీట్ చేసి చివరికి జర్నలిస్ట్‌గా మారిపోయాడన్న మాట అని గ్రహించాడు అశోక్‌వర్ధన్.

బస్సు కాకిపల్లి జంక్షన్‌కు చేరేసరికి పది గంటలు దాటింది. రిపోర్టర్ జ్ఞానప్రసాద్, అతని మిత్రుడు రెండు మోటార్ సైకిళ్లతో రెడీగా ఉన్నారు.

అశోక్‌వర్ధన్,రమణమూర్తిలు బస్సు దిగారు. వారిని జ్ఞానప్రసాద్ విష్‌చేశారు. పక్కనే ఉన్న తన స్నేహితుడు రాముని వారికి పరిచయం చేశాడు.

కాకిపల్లిజంక్షన్‌లో రెండు కిల్లీ బడ్డీలు ఎప్పుడో జన్మభూమి పథకం కింద కట్టించిన బస్‌షెల్టర్ మాత్రమే ఉన్నాయి. "ఇక్కడికి కాకిపల్లి విలేజ్ ఎంత దూరం?" అడిగాడు అశోక్‌వర్ధన్.

"జస్ట్...రెండు కిలోమీటర్లుంటుంది సార్!"

"ముందుగా తేలిపేట విలేజ్‌లో ఆగుదాం...అక్కడ కొంత సమయం గడిపి కాకిపల్లి వైపు వెళ్దాం"

"అలాగే చేద్దాం సార్!"

మోటారు సైకిళ్లు బయలుదేరాయి. రెండింటిపై చెరో ఇద్దరూ కూర్చొని ముందుకు కదిలారు.

తేలిపేట గ్రామం సమీపిస్తున్న కొలదీ వాతావరణం మారిపోయింది. దట్టమైన చింతచెట్లు దర్శనమిచ్చాయి. వాటితో పాటు రకరకాలపక్షుల అరుపులతో అంతా సందడి సందడిగా ఉంది. ఊరిపొలిమేరల్లోనే మోటారుసైకిళ్లు ఆపించి 'వాటన్నింటినీ చూసుకుంటూ ఊళ్లోకి వెళ్లాలని' అశోక్ వర్ధన్ అంటే 'అలావద్దు సార్!' అంటూ జ్ఞానప్రసాద్ వారించాడు. "చెట్ల కింద నుంచి వెళ్తే పక్షుల రెట్టలతో వేసుకున్న డ్రెస్ అంతా పాడవుతుందని, అంచేత రోడ్డుపై నుంచే ఊళ్లోకి వెళ్దామని...." చెప్పాడు.

తేలిపేట భారతీయగ్రామాల దైన్య స్థితికి దర్పణంలా కనిపిస్తోంది. ఐదారు డాబాఇళ్లు, పదికిపైగా పెంకుటిళ్లు, మిగిలినవి అక్కడక్కడా సిమెంటురేకుల ఇళ్లు, ఎక్కువగా పూరిళ్లు ఉన్నాయి గ్రామంలో. పంచాయతీ కేంద్రమైనప్పటికీ పెద్దగా అభివృద్ధి మాత్రం లేదు. శిధిలావస్థలో ఉన్న ఒక బడి.. రంగులతో వెలిగిపోతున్న ఒక గుడి ఉన్నాయి. మంచినీటికోసం ప్రభుత్వం ఏర్పాటు చేసిన బోర్లు పనిచేయక పోతే పక్కనే ఉన్న చెరువునుంచి నీటిని తీసుకొస్తున్నారు మహిళలు. ఊరి మధ్యలో రోడ్ల వంటివి కన్పిస్తున్నా కేవలం బిల్లుల కోసమే వేసినవి కావడంతో అవి నడకకు కూడా ఏమంత అనుకూలంగా లేవు. మురికినీరు జీవనదిలా రోడ్డుమీద ప్రవహిస్తోంది.

"నమస్కారమండీ...!ఏమిటిలాగ వచ్చేసినారు ఇలేకరిగారు. తీరుబాటైపోనాది మీకు..." అంటూ జ్ఞానప్రసాద్‌ను పలకరించాడు తేలిపేట సర్పంచ్ చంద్రయ్య.

జ్ఞానప్రసాద్‌తోపాటు వచ్చినవారిని చూసిన చంద్రయ్య "మనోలు ఎవులు?" అని అడిగాడు.

"ఈయన మాస్టాఫ్‌రిపోర్టర్ అశోక్‌వర్ధన్ గారు, ఇతను ఫోటోగ్రాఫర్ రమణమూర్తిగారు..ఇద్దరూ విశాఖపట్నం నుంచి వచ్చారు" అంటూ అతనికి పరిచయం చేసాడు.

"నమస్కారం బావూ!...మా ఇలేకరి పెసాదు మాకు బాగా చనువు. యూరి ఇసయం ఏదైనా పేపర్లో బాగ రాస్తాడు. మండల ఆపీసర్లతో సెప్పి ఊరు కోసం సాయం సేత్తాడు"

"అలాగా...?" అన్నాడు అశోక్‌వర్ధన్.

"మీరంతా పెందిలాడే వచ్చి శానామంచిపన్చేసినారు...కొంచెం లేటయ్యుంటే నాను పొలానికి బయలెల్లిపోయుందును. పదండి మనింటికాడికి కాపీతాగి ఎల్దురుగాని" అంటూ రెండోవీధిలో ఉన్న తనింటికి దారితీసాడు సర్పంచ్ చంద్రయ్య.

కాఫీలు తాగాక "ఏంటి బావూ! యిప్పుడు సెప్పండి.. ఇసాకపట్నం నుంచి మాఊరొచ్చినారు. నాసాయం ఏమిటి కావాలా?" అని అడిగాడు చంద్రయ్య.

"ఏమీ లేదండీ..మీ గ్రామానికి ఈ పక్షులు ఎప్పటి నుంచి వస్తున్నాయి? మీకు ఏమైనా తెలుసా?"

"నాసిన్నతనం నుంచీ సూత్తన్నానండీ ...ఆరేడొందల సంవత్సరాల కితం నుంచీ ఇవి వస్తన్నాయి మాయూరికి"

"ఈ పక్షుల  హడావిడి మీ ఊరివాళ్లకు ఇబ్బందిగా లేదా?"

"ఏటి బావూ! అలాగంతారు. ఈ పచ్చులు గూడబాతులు, ఎర్రముక్కు కొంగలు....ఇలాంటివి మాయూరుకు వస్తన్నాయంటే మాకెంతో గర్వంగా ఉందండీ..ఈ పచ్చుల్ని సూడడానికి మీలాంటి పెద్దోళ్లంతా మాయూరికొచ్చి ఎల్తుంటారు.పెతీఏటా ఈ పచ్చులు వచ్చి ఎల్తుంటాయి. ఇవి రాకపోతే మాయూరికేదో అరిష్టమొచ్చేసిందని అనుకుంతాము"

"ఈ విదేశీ పక్షులు రాకపోయిన సందర్భాలు కూడా ఉన్నాయా?"

"ఎందుకునేవండి...? రెండేళ్ల కిందట ఏటైందో ఈ పచ్చులు ...మా ఊరికి రానేదు. ఆ ఏడంతా కరువెట్టేసింది. పంటలు సరిగా పండనేదు. రాబడిలేక నష్టబోయాము. అన్ని కష్టాలూ ఒక్కసారి ఎలిపొచ్చాయి"

"ఈ పక్షుల సంరక్షణకు ఏలాంటి శ్రద్ధ తీసుకుంటున్నారు?"

"ఈ పచ్చులు మా యూరి జనాబాలో ఒక బాగమే అనుకుంతాము. పసిపిల్లల కన్నా ఎక్కువ జాగర్తలు తీసుకొని వాటిని కంటికి రెప్పలా సూసుకుంతన్నామండి"

"సరే...చిన్న పిల్లలు పక్షులు  గూళ్లనుంచి పడిపోతుంటాయా?"

"అప్పుడప్పుడు...రేతిరేల జారిపోతున్నాయండి..వాటిని కూడా జాగర్తసేస్తున్నామండి"

"మీ ఊరిప్రక్కనే బొగ్గుతో తయారయ్యే కరెంటు ప్లాంటు ఏర్పాటు చేస్తున్నారట. తంపర భూముల్లో చేపలు దొరకక పక్షులు ఈ ప్రాంతానికి ఆతర్వాత రావేమో...!?"

"ఆ పేక్టరీ సంగతి మాకు తెలదు బావూ..ఆమొన్న కొందరు ఆపీసర్లొచ్చి తంపరంతా సూసెల్లారు. అందులో కరెంటు పేక్టరీ పెడతారా?"

"అవును మీకు మంచినీళ్లుకు కూడా సమస్యలొస్తాయని అనుకుంటా.."

"ఇంకేమిటీ మాకు తెలదు బావూ!...ఊరుమొత్తం ఈ ఇసయమై పంచాయతి మీటింగెట్టుకొని ఏదో ఒకటనుకొని ఒక మాట మీదుండాల...నీరే నేకపోతే బతుకేలేదు బావూ!!"

"సర్పంచ్‌గారూ! ఇక మేము వెళ్లొస్తాం... ఈ విలేజ్‌లో కొన్ని ఫోటోలు తీసుకుని వెళ్తాం" అంటూ అశోక్‌వర్ధన్ అతని దగ్గర సెలవుతీసుకున్నాడు.

ఫోటోగ్రాఫర్ రమణమూర్తి రిపోర్టర్ జ్ఞానప్రసాద్ సహకారంతో మంచి ఫోటోలు తీసుకున్నాడు. అక్కడ నుంచి కాకిపల్లి తంపర భూములకు వెళ్లారు.

సుమారు ఐదు వేల ఎకరాల విస్తీర్ణంలో నిత్యం అడుగులోతు నీటితో చిత్తడిగా ఉండే ప్రాంతమది. పక్కనే ఉన్న గ్రామంలో వెయ్యికిపైగా స్వదేశీ మత్స్యకార కుటుంబాలవారు తంపరలో దొరికే మంచినీటి చేపల్ని పట్టుకుని వాటిని అమ్ముకుని జీవితాలు గడుపుతున్నారు.

కాకిపల్లి సర్పంచ్ బతకయ్యకు అశోక్‌వర్ధన్,రమణమూర్తిలను పరిచయం చేసాడు జ్ఞానప్రసాద్.

“నమస్కారం సార్! ఏటి మాఊరొచ్చారు?” అంటూ వారిని అడిగాడు బతకయ్య.
“ఏమీ లేదు. తేలిపేటలో పక్షులను చూడాలని వచ్చాము. అలా పక్కనే ఉన్న మీ ఊరు చూద్దామని పించి వచ్చాం” చెప్పాడు.

“మంచిదే సారూ! మా యూరికి మంచి రోడ్డు నేదు. తాగడానికి మంచినీలు లేవు. ఎన్ని మార్లు మండలాఫీసుకు ఎల్లి అక్కడ ఆపీసర్లతో సెప్పినా,తరవాత ఎమ్మెల్యేగారికి సెప్పినా ఆలెవులూ పట్టించుకోవడమేనేదు. మీరైనా మా కష్టాలు పేపర్లో రాయండి. కలట్రుగారైనా సూసి ఈ పనులకి సొమ్ము సాంక్షన్ సేత్తారు.”
“అలాగే నండీ...తప్పకుండా” అంటూ కాకిపల్లి సమస్యలపై స్టోరీ రాయాలని రిపోర్టర్ జ్ఞానప్రసాద్ కు సూచించాడు అశోక్‌వర్ధన్.
గ్రామం ఫొటోలు, తంపర భూముల్లో తిరుగాడే పక్షుల ఫొటోలు, భూముల ఫొటోలు తీసుకుని వెను దిరిగారు.

××××   ××××   ××××

అశోక్‌వర్ధన్ కాకిపల్లె వెళ్లొచ్చిన రెండు రోజుల తర్వాత ‘త్రిముఖం’ పత్రిక మెయిన్ ఎడిషన్‌లో పతాకవార్తగా వచ్చింది “కాకిపల్లి చిత్తడి భూములపై కార్పోరేట్ శక్తుల కన్ను” అనే హెడ్డింగ్‌తో ప్రత్యేక కథనం.

సుమారు నాలుగు వేల ఎకరాల చిత్తడి నేలలను ప్రభుత్వ నిబంధనలకు విరుద్దంగా థర్మల్ విద్యుత్ విద్యుత్ కేంద్రం ఏర్పాటుచేయడానికి కార్పోరేట్ కంపెనీలకు కట్టబెడుతున్నారని....దాని వలన పర్యావరణానికీ రైతులకూ మత్స్యకారులకూ పక్కనే ఉన్న తేలిపేట గ్రామానికి వలస వచ్చే విదేశీపక్షులకూ ప్రమాదం పొంచి ఉందన్నది ఆకథనంలోని సారాంశం.
గ్రామస్థులు, పర్యావరణ శాస్త్రవేత్తలు, ప్రజాఉద్యమాల ప్రతినిధుల స్పందనలతో వచ్చిన ఆకథనం అందరిలోనూ పెద్దఎత్తున చర్చకు దారితీసింది. మిగిలిన పత్రికలూ ఎలక్రానిక్ మీడియా న్యూస్ ఛానళ్లవారు కూడా ఇదే అంశంపైనే దృష్టి కేంద్రీకరించేలా చేసింది. ‘త్రిముఖం’ పత్రికలో వచ్చిన ఆవార్తాకథనం కాకిపల్లి ప్రాంతంలో బొగ్గు ఆధారిత విద్యుత్‌పరిశ్రమను నెలకొల్పాలని సన్నాహాలు చేస్తున్న ఎంకేసీకంపెనీని బాగా ఇరుకునపెట్టేసింది. ప్రభుత్వం దగ్గరా, పర్యావరణ మంత్రిత్వశాఖ దగ్గరా పెండింగ్‌లో ఉన్న అనుమతులకు ఇక క్లియరెన్స్ వస్తుందో? రాదో ? అన్న సందేహం కంపెనీ యాజమాన్యానికి పట్టుకుంది.

ఎంకేసీ కంపెనీ పీఆర్ఓ రాజలింగం ఒకప్పుడు విష్ణుప్రకాశ్‌కు శిష్యుడు కావడంతో 'త్రిముఖం' మేనేజింగ్ డైరెక్టర్ రామకోటిని ప్రసన్నం చేసుకుని తమపై వ్యతిరేక కథనాలు ఇకపై రాకుండా చూసుకోవాలని ప్రయత్నాలు ప్రారంభించాడు.

రామకోటి ఛాంబర్‌లో కంపెనీ ప్రతినిధులతో సమావేశానికి అంగీకారం కుదిరింది.

ప్రస్తుతం నలుగురు వ్యక్తులు ఈ కథనంపైనే చర్చిండానికి అక్కడ సమావేశమయ్యారు. వారిలో ఒకరు రామకోటి, మరొకరు న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జ్ విష్ణుప్రకాష్, ఎంకేసీ కంపెనీ జనరల్ మేనేజర్ విశ్వరూప్, పీఆర్ఓ రాజలింగంలు.

ముందుగా రాజలింగం మాట్లాడుతూ "మీ పేపర్లో వచ్చిన న్యూస్ మమ్మల్ని డిఫెన్స్‌లో పడే సింది. ఇప్పటికే రకరకాల క్లియరెన్స్‌ల కోసం కోట్లాది రూపాయలు ఖర్చు చేసేసాం. ఇంకా పర్యావ రణ అనుమతులు రావాల్సి ఉంది. ప్రభత్వం భూమిని కేటాయించడానికి అంతా సిద్ధం చేసింది. ఇలాంటి సమయంలో ఈ వార్త రావడం చాలా ఇబ్బందులలోకి నెట్టేసింది. ఇది సమంజసమేనా? మీరు ఆలోచించండి" అన్నాడు.

"ఇందులో అలోచించడానికి ఏముందీ? మీరు అక్కడ పెట్టబోయే థర్మల్ పవర్ ప్లాంట్ వలన వేలాది కుటుంబాలకు ఉపాధిలేకుండా పోతుంది. జీవనాధారమైన చేపలవేటకు వారికి అవకాశం లేకుండా పోతుంది. తేలిపేట ప్రాంతానికి వలస పక్షులు రావడం ఆగిపోతుంది. అక్కడి ప్రజల సెంటిమెంట్‌తో అవి ముడిపడి ఉన్నాయి" చెప్పాడు విష్ణుప్రకాశ్.

"అవును సార్! మీపేపర్లోరాసిన వార్తను మేము ఖండించడం లేదు, వ్యతిరేకించడం లేదు. రాసిన దంతా నిజమే. కానీ, మా పరిస్థితిని అర్థం చేసుకోండి అని విజ్ఞప్తి చేస్తున్నాము" అన్నాడు రాజలింగం. "ఇంకా అక్కడ ప్రజాభిప్రాయ సేకరణ ప్రక్రియ జరగలేదు కదా!"

"లేదు....ఈ నెలాఖరులో జరిపిస్తామని కలెక్టర్‌గారు చెప్పారు. ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమానికి ముందే ఇలాంటి న్యూస్ రావడంతో ప్రజల్లో అనుమానాలు మొదలై అవి ప్లాంటుకు వ్యతిరేకంగా పరిణమిస్తాయని అందోళన కల్గిస్తోంది." చెప్పాడు రాజలింగం.

వారి సంభాషణని మొదట్నుంచీ వింటున్న రామకోటి జోక్యం చేసుకుని " మీ ప్రాజెక్ట్ కాస్ట్ ఎంత?" అని ప్రశ్నించాడు.

"పద్దెనిమిది వందల కోట్ల రూపాయలు " చెప్పడు విశ్వరూప్

"సరే అందులో ఏభై కోట్ల రూపాయలు మాపేపర్‌కు డొనేషన్‌గా ఇచ్చేయండి" అన్నాడు రామకోటి.

"అంత మొత్తాన్ని ఇచ్చుకోలేమండి. ఇప్పటికే ఎలక్షన్లు రావడంతో అన్ని రాజకీయపార్టీల నాయకులూ ఎలక్షన్‌ఫండ్ అంటూ సొమ్ములివ్వాలని డిమాండ్ చేస్తున్నారు. ఎవరు అధికారంలోకి వస్తారో తెలియదు. ఇప్పుడున్న అధికారపార్టీ నాయకులు ఎక్కువ సొమ్ము మాకే ఇవ్వాలని వత్తిడి

చేస్తున్నారు. తామే ఎన్నికల్లో అధికారంలోకి వస్తాము కాబట్టి తమకే ఎక్కువమొత్తం ఎలక్షన్ ఫండ్ గా ఇవ్వాలని ప్రతిపక్షనాయకులు కూడా వత్తిడిపెంచారు. పెద్ద తలనొప్పిగా మారింది” అని చెప్పిన విశ్వరూప్ మాటలకు రామకోటి అసహనంగా ముఖం పెట్టాడు.

మళ్లీ విశ్వరూప్ తనకు తానే సర్దిచెప్పుకుంటూ “మీరు ఆలోచించండి. ఓ ఇరవై కోట్లు ఇవ్వగలం. .. .ఎలాగోలా సరిపెట్టుకోండి..” అన్నాడు.

“ఎలా కుదురుతుంది? మీ పవర్‌ప్లాంట్ విషయంలో లోకల్‌పీపుల్ నుంచి వ్యతిరేకత వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. ఆవిషయం మీకు కూడా తెలుసు. మీరు మాకు సొమ్ము ఇచ్చిన తర్వాత అనుకూల వార్తలు ఇవ్వకపోయినా వ్యతిరేకవార్తలు రాయకుండా ఉండడం మీకు అవసరం....అలాంటప్పుడు మా పేపర్‌కు ప్రజల్లో ఉన్న విశ్వసనీయత బాగా దెబ్బతింటుంది. దాని వలన సర్క్యులేషన్,యాడ్స్ ఆప్రాంతంలో కొంత తగ్గే ప్రమాదం కూడా లేకపోలేదు. దానికి జరిగే మూల్యం ఎవరు చెల్లిస్తారు?....సరే ...మీ ప్రాబ్లమ్స్ మీరు చెప్పారు కాబట్టి ఫైనల్‌గా ముప్పై కోట్ల రూపాయలు ఇవ్వండి. నెగిటివ్ వార్తలు రాకుండా చూసుకుంటాం.” అన్నాడు రామకోటి.

“అలా కూడా కష్టమే...!” చెప్పాడు విశ్వరూప్ నసుగుతూ.

“ఏదో నిర్ణయించుకుని వెంటనే చెప్పండి ...అవతల మాకు చాలా పనులున్నాయి” మళ్లీ ముఖంలో అప్రసన్నతని పులుముకుంటూ అన్నాడు రామకోటి.

ఏంచెప్పాలో తెలియనిస్థితిలో రాజలింగంవైపు చూసాడు విశ్వరూప్.

రాజలింగం, విష్ణుప్రకాష్‌లు బయటకు వెళ్లి కొంతసమయం మాట్లాడుకుని వచ్చారు. మళ్లీ రాజలింగం తనకూడా విశ్వరూప్‌ని తీసుకుని బయటకు వెళ్లి కొంతసేపు చర్చించుకొని లోపలికి వచ్చారు.

చివరికి రామకోటికి పాతికకోట్ల రూపాయలు ఇవ్వడానికి ఏకాభిప్రాయం కుదిరింది.

అయితే ఇందులో రామకోటికి తెలియని విషయం మరొకటుంది. రిపోర్టర్లతో అనుకూల కథనాలు రాయించుకోవడానికి విష్ణుప్రకాష్‌తో రెండు కోట్ల రూపాయలకు విశ్వరూప్‌తో ఒప్పందం కుదిరింది. ఆసొమ్ము అక్కడికి రెండురోజుల తర్వాత విష్ణుప్రకాష్ఇంటికి రహస్యంగా చేరిపోయింది.

వెంటనే అశోక్‌వర్ధన్‌కు విష్ణుప్రకాష్ ఫోన్లో ఆదేశాలు జారీ చేసేసాడు.

“కాకిపల్లి ఏరియాలో ఎంకేసీ కంపెనీ ఏర్పాటుచేయబోయే పవర్‌ప్లాంట్ విషయంలో ఎలాంటి వ్యతిరేక కథనాలు రాయకూడదని, వీలైనప్పుడల్లా పవర్‌ప్లాంటుకు అనుకూలంగా పాజిటివ్ వార్తలు రాయాలని” సూచించాడు.

"ప్రజల నిరసనలు, ఆందోళనలకు ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వాల్సిన అవసరంలేదని, ఒక వేళ అటువంటి వాటిని ఇవ్వాలనుకుంటే ఫోటోలు లేకుండా ప్రాధాన్యతలేని స్థలంలో టూకీగా వేయాలని " సౌజన్యారావుకు కూడా ఆదేశాలు ఇచ్చేసాడు విష్ణుప్రకాష్

×××× ××××× ××××

ఎన్నికల నోటిఫికేషన్ ఇచ్చేసారు.

'త్రిముఖం' పత్రికలో పెయిడ్ న్యూస్ విషయమై హైదరాబాద్ ఆఫీసులో మీటింగ్ జరిగి అప్పటికే రెండువారాలుగడిచిపోయింది. ఒక్కరూపాయి కూడా కలెక్ట్ కాలేదు. పైనుంచి విష్ణుప్రకాష్ వత్తిడి రోజురోజుకీ పెరిగిపోతోంది.

ప్రతియేటా పేపర్ వార్షికోత్సవానికి యాడ్స్ ఇవ్వటానికి అలవాటు పడిపోయిన రిపోర్టర్లు పెయిడ్‌న్యూస్ విషయాన్ని అంత సీరియస్‌గా తీసుకున్నట్లు కన్పించడం లేదు.

అదే విషయాన్ని సౌజన్యారావు దగ్గర ప్రస్తావించాడు అశోక్‌వర్ధన్.

"నాకు కూడా అంతే అన్పిస్తోంది. ఎన్నికలవార్తలను కూడా రాయడం మానేసారు. మళ్లీ మరోసారి మీటింగ్‌పెట్టి రిపోర్టర్లందర్నీ అలర్ట్ చేయాలి."

"నేనూ అదే ఆలోచిస్తున్నాను సార్! అయితే అందర్నీ ఎడిషన్ కేంద్రానికి రప్పించి చెప్పటం కన్నా రీజనల్ సెంటర్లవారీగా మీటింగ్స్ పెట్టి టార్గెట్లు ఎంత పూర్తిచేసారో వెళ్లి తెలుసుకోవాలి"

"అవును...అదే మంచిది. అవసరమైన చోట్ల మనం కూడా ఆయా పార్టీల నాయకుల దగ్గరకు వెళ్దాం. అభ్యర్థులను ఈ ప్యాకేజీలకు ఒప్పిద్దాం"

"అలాగే సార్! ఈ రోజు సాయంత్రమే వెళ్దాం. ప్రతిపక్షంలో సీనియర్ నాయకుడు నాగేంద్ర నాయుడు మీకు తెలుసుకదా. పదేళ్ల కిందట కేంద్రమంత్రిగా కూడా ఉన్నారు. ఇప్పుడు మళ్లీ ఎంపీ గా పోటీచేస్తున్నారు. ఆయనని కలుద్దాం"

"ష్యూర్....! ఆయనకు మన పేపర్ అంటే కూడా ప్రత్యేకమైన అభిమానం అని విన్నాను. మన ప్రయత్నాన్ని ఆయననుంచే అరంభిద్దాం" తలూపుతూ అన్నాడు సౌజన్యారావు.

ఆ సాయంకాలమే నాగేంద్రనాయుడు ఇంటికి వెళ్లారు సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లు.

అప్పుడే రెండోపూట ఎన్నికల ప్రచారానికి బయలుదేరుతున్న నాగేంద్రనాయుడు వీరిద్దర్నీ చూసి ఆగాడు. ఒకఅరగంట ఆలస్యంగా బయలుదేరుదామని కార్యకర్తలకుచెప్పి వారిద్దరితో సంభాషించాడు.

"ఏం..ఆశోక్‌వర్ధన్ ఎలా ఉన్నారు? ఈయనెవరు? " అంటూ సౌజన్యారావు గురించి అడిగాడు.

"ఆయన మా న్యూస్ ఎడిటర్" అని పేరు చెప్పి పరిచయం చేసాడు.

పరస్పరం పలకరింపులు అయ్యాక
"ఎలా ఉంది ప్రజల్లో మా పార్టీపై అభిప్రాయం?" అడిగాడు నాగేంద్రనాయుడు.
"బాగానే ఉంది సార్! గత పదేళ్ల నుంచీ ఒకే ప్రభుత్వం ఉండడం వల్ల ప్రజల్లో అధికారపార్టీపై వ్యతిరేకత బాగా పెరిగిపోతోందే కానీ తగ్గడం లేదు" చెప్పాడు అశోక్‌వర్ధన్.
"కొంతవరకూ నిజమే మరి మాపార్టీకి కూడా ప్రజలు ఒకప్పుడు పదేళ్లు అధికారమిచ్చారు. ఎప్పుడూ ఒకే పార్టీ అధికారంలో ఉండిపోవాలంటే కుదరదు కదా.."
"అవునండీ ఇప్పుడున్న అధికారపార్టీ పనితీరుని గత మీ ప్రభుత్వ పనితీరుతో జనం భేరీజు వేసుకుంటున్నారు. అందువల్ల మళ్లీ మీపార్టీ అధికారంలోకి రావడానికి అవకాశాలు చాలాఎక్కువ గా కన్పిస్తున్నాయి. "
"నేనూ అదే అనుకుంటున్నాను. కానీ, ఇప్పుడున్న పాలకపార్టీ అడుగడుగునా అవినీతి అక్రమాలతో ప్రజల మనసుల్ని కూడా కలుషితం చేసేస్తోంది. ఎవరు అవినీతికి పాల్పడడం లేదు... మేము అవినీతిపనులు చేస్తే తప్పేమిటి? అనే ప్రమాదకరమైన ధోరణి పెరిగిపోయింది.
మీ పత్రికలు, టీవీ ఛానళ్లు కూడా అవినీతి కార్యకలాపాలు నిత్య జీవితంలో ఒక భాగం అన్పించే విధంగా ప్రచారం చేస్తున్నాయి"
మీడియా ప్రస్తావన రావటంతో అప్పటివరకూ వారి సంభాషణని ఆసక్తిగా వింటున్న సౌజన్యారావు జోక్యం చేసుకుంటూ " అలాంటిది ఏమీలేదు సార్! అవినీతిపరుల గురించి ప్రజలను అప్రమత్తం చేయడానికి వారిపైన వార్తలు ఎక్కువగా ఇవ్వాల్సి వస్తుంటుంది. అంతేగానీ అది అవినీతిని పాజిటివ్‌గా చూపించే ప్రయత్నం మాత్రం కాదు" అన్నాడు.
"సరే లెండి...ఏది ఎలా జరిగినా జరుగుతున్నది మాత్రం ఒకటే. ప్రజలు అవినీతిపై అప్రమత్తం కావడం మాట అటుంచి తాము కూడా అదే మార్గంలో వెళ్తేనే సులభంగా సొమ్ము సంపాదించవచ్చనే అభిప్రాయానికి వచ్చేసారు. ఇంతకీ మీరు వచ్చిన పనేమిటి?" అడిగాడు నాగేంద్రనాయుడు.
"పేపర్ పనిమీదే వచ్చాము. ఎన్నికల సమయంలో ప్రచారప్రకటనలపై ఎన్నికలసంఘం విధించిన ఆంక్షలు మీకు తెలియనివి కావు. వాటి వలన ఎన్నికల సమయంలో యాడ్స్ రాకపోవడంతో పత్రికలకు ఎక్కువగా నష్టం జరుగుతోంది. ఎందుకంటే ఈ సమయంలోనే రీడబిలిటీ ఎక్కువ ఉంటుందని ప్రత్యేకపేజీలు అదనంగా ప్రచురిస్తుంటాము. ఇదిఅదనపుభారంతో కూడుకుని ఉంటుంది. ఖర్చులు కూడా గిట్టుబాటు కావు మరి" చెప్పాడు అశోక్‌వర్ధన్.
"నిజమే...ఈ సమస్యని ఎలా అధిగమించాలని అనుకుంటున్నారు?"

"ఓ..పెయిడ్ న్యూసా!.. మన తెలుగుపేపర్లకీ ఈ జాడ్యం వచ్చేసిందా..? మొన్న ఎన్ని కల ప్రచారానికి వెళ్తే మీ లోకల్ రిపోర్టర్లు ఒకరిద్దరు ఈ విషయాన్ని సూచాయగా ప్రస్తావించారు. అయితే నేను నమ్మలేదు. కానీ మీరు కూడా ఇదే విషయంపై వచ్చారంటే నమ్మకతప్పడంలేదు. సరే నేనేం చేయాల్సి ఉంటుంది?"

"ఎన్నికల పోలింగ్ తేదీ వరకూ మీ ప్రచారవార్తల కవరేజ్ పూర్తిగా ఫోటోలతో సహా ఇస్తాం. రోజు విడిచిరోజు మీ ఇంటర్వ్యూలు, వీలునిబట్టి ఎన్నికల వాతావరణంపై రాసే కథనాలు, సమీక్ష ల్లో మీగురించి పాజిటివ్‌గా ప్రెజెంట్ చేయడం...ఇలాంటివన్నీ ఈ ప్యాకేజీలో ఉంటాయి"

"ఎంత ఖర్చౌతుంది?"

"మీరు ఎంపీగా పోటీ చేస్తున్నారు కాబట్టి పదిలక్షల రూపాయల ప్యాకేజీ ఇది"

"అంత మొత్తం సొమ్మును మీ ఒక్క పేపర్‌కే ఇస్తే మిగిలిన వాళ్లు ఒప్పుకుంటారా?"

"మిగిలిన పత్రికలన్నీ ఇప్పటికే ఆయా రాజకీయపార్టీలకు బాకాలుగా ఉన్నాయి. పాఠకుల్లో అంతో ఇంతో విశ్వసనీయత ఉన్నది మా పేపర్‌కే. మీకుకూడా ఆ విషయం తెలుసు. అందుకే ముందుగా మీ దగ్గరికి వచ్చాము"

"సరే ఈ ప్యాకేజీ అంతా ఓ ఐదు లక్షల రూపాయల్లో అయ్యేలా చూడండి. మాకైతే అంతే సరిపోతుందని అనుకుంటున్నాను"

"లేదు సార్! ఎంపీ అభ్యర్థి అంటే మీ పరిధిలోని అన్ని అసెంబ్లీ నియోజకవర్గాల్లో కూడా ప్రచారం జరగాలి. అందుకే మాపైవాళ్లు పది లక్షల ప్యాకేజీ ఫిక్స్ చేసారు"

"అంత మొత్తం ఇవ్వడం కష్టమమ్మా....సరే ఏడు లక్షల రూపాయలకు తగ్గించి సరిపెట్టుకోండి"

"మా ఎండీగారు ఒప్పుకుంటారో...లేదో..." అంటూ నసిగాడు అశోక్‌వర్ధన్.

"మీ ఎండీ రామకోటితో నేను మాట్లాడుతాను. ఆవిషయంలో మీకేం భయం లేదు. ఫైనల్‌గా ఎనిమిది లక్షల రూపాయలు ఇస్తాను. ఈరోజే ఐదు తీసుకెళ్లండి. ఎన్నికల పోలింగ్‌కు రెండు రోజు ల ముందు మిగిలిన మూడూ మా పీఏతో మీ ఆఫీసుకు పంపించేస్తా సరేనా?" చెప్పాడు నాగేంద్ర నాయుడు.

"ఓకే సార్! థాంక్యూ సార్!" అన్నారిద్దరూ.

వారికి ఐదు లక్షల రూపాయలివ్వాలని తన పీఏకి చెప్పి నాగేంద్రనాయుడు ఎన్నికల ప్రచారానికి వెళ్లిపోయాడు.

పిఏ మురళి దగ్గర ఐదు లక్షల రూపాయలు తీసుకుని వెంటనే దానికి ప్రారంభించిన ప్రత్యేక ఎకౌంట్‌లో జమచేసారు సౌజన్యారావు, అశోక్‌వర్దన్‌లు.

ఈ ప్యాకేజీల స్కీమ్‌కు తాము స్వయంగా వెళ్తేగానీ ఎంతో కొంత వర్కవుట్ కాదని వారికి అర్ధమైపోయింది.

మిగిలిన ఎంపీ అభ్యర్ధుల దగ్గరికీ, ఎమ్మెల్యే అభ్యర్ధుల దగ్గరికి కూడా లోకల్ రిపోర్ట ర్లతో కలిసి సౌజన్యారావు, అశోక్‌వర్ధన్‌లు వెళ్లారు. మానేజ్‌మెంట్ ఇచ్చిన టార్గెట్‌ను పూర్తి చేయలేక పోయినా ఎనభైశాతం వరకూ పెయిడ్‌న్యూస్ ప్యాకేజీల సొమ్ములు వచ్చేసాయి.

'త్రిముఖం' తో పాటు 'నారాజ్యం' మరికొన్ని ఇతర పత్రికలు వారివారి స్థాయిల్లో పెయిడ్‌న్యూ స్ వల్ల బాగానే సంపాదించాయి.

ఎన్నికలు చెదురుమదురు ఘటనలు మినహా ప్రశాంతంగానే ముగిసాయి.

ప్రతిపక్షంలో ఉన్న రాజకీయపార్టీనే ఓటర్లు అధికారపీఠంపై కూర్చోబెట్టారు. ముఖ్యమంత్రిగా భుజంగంనాయుడును పార్టీ అధిష్టానం నిర్ణయించింది.

×××× ×××× ××××

రాష్ట్ర ముఖ్యమంత్రిగా భుజంగంనాయుడు ప్రమాణస్వీకారం చేయడం జరిగిపోయింది.

ఆర్ధికసంక్షోభంలో ఉన్న రాష్ట్రాన్ని భుజంగంనాయుడే గట్టెక్కించగలడని రెండు పేపర్లు మినహా మిగిలినవన్నీ ఆకాశానికెత్తేసాయి.

ఆయన లేకపోయుంటే ఈ రాష్ట్రం దిక్కులేనిదైపోయిఉండేదని పత్రికలు బోల్డంత పబ్లిసిటీ ఇచ్చేసాయి.

ముఖ్యమంత్రిని తమ భజనవార్తలతో ప్రసన్నం చేసుకుని ప్రభుత్వ ప్రకటనలను భారీగా దండుకన్నాయి కొన్ని పత్రికలు, టీవీ ఛానళ్లు.

భుజంగంనాయుడు ముఖ్యమంత్రి కాకూడదని అసలు ఆయన ఉన్న పార్టీ అధికారం లోకి రాకూడదని మొదటి నుంచీ కోరుకుంటున్న పత్రికలు రెండు. అందులో ఒకటి 'నారాజ్యం' అయితే రెండోది 'త్రిముఖం' . వాటి సహజధోరణిలోనే భుజంగంనాయుడు పాలనావైఫల్యాలను అతని అనుచరులు మంత్రివర్గసహచరులు అధికారం ముసుగులో చేస్తున్న ఆక్రమాలను పనిగట్టుకు ని ఈ రెండు పత్రికలు ఎప్పటికప్పుడు జనం ముందు పెడుతున్నాయి.

మొదట్నుంచీ సొంతప్రచారం కోసం ఎంతకైనా సిద్దమైపోయే భుజంగంనాయుడుకు ఈ రెండు పత్రికల ధోరణి ఏమాత్రం మింగుడుపడంలేదు. రాష్ట్రంలో సర్క్యులేషన్ బలంగా ఉన్న పత్రికల్లో అవి ముందుండడం కూడా అతనికి రుచించడం లేదు. ఈ పరిస్థితుల్లో విశాఖపట్నం జిల్లా నుంచి ఎమ్మెల్యేగా ఎన్నికై తన మంత్రివర్గ సహచరునిగా ఉన్న ధర్మరాజుతో మంత్రాంగం చేసాడు.

రాజకీయ చదరంగంలో సర్పంచ్ స్థాయి నుంచి ఒక్కో మెట్టు ఎక్కి అడ్డొచ్చినవారిని పడగొట్టి మంత్రి స్థాయికి చేరుకున్నాడు ధర్మరాజు. అతనిపేరులోనే ధర్మంఉంది తప్పా అనుకున్నది సాధించడానికి ఎంతటి అధర్మానికైనా వెనుదీయడని ఆయనతో బాగా పరిచయం ఉన్నవారంతా చెప్పుకుంటూ ఉంటారు.

అటువంటి ధర్మరాజుతో ఈ రెండు పత్రికల గురించి “ఏం చేద్దాం....? ” అంటూ సంప్రదించాడు భుజంగంనాయుడు.

అప్పటికే వాటిలోని ఒకదాని ఎడిటర్‌ని చేయని నేరానికి కొన్నాళ్లపాటు జైలుఊచలు లెక్క పెట్టించినా వారి పొగరుదిగలేదు. అందుకే ఆరెండు పత్రికలపేర్లు వింటేచాలు భుజంగంనాయుడు కి ఎక్కడలేని పూనకం వచ్చేస్తుంది. ఆగ్రహానికి ఆవేశం తోడై ఊగిపోతుంటాడు.

భుజంగంనాయుడుతో సుదీర్ఘకాలంపాటు రాజకీయసాహచర్యం ఉన్న ధర్మరాజుకు ఆరెండు పత్రికలు అతనిని ఎలా ఎదగనీయకుండా దెబ్బతీస్తూవచ్చాయోకూడా బాగా తెలుసు.

అందుకే బాగా ఆలోచించి ఒక సలహా ఇచ్చాడు. “మనమే ఒక పత్రిక ప్రారంభించేస్తే బాగుంటుందని” చెప్పాడు భుజంగంనాయుడుకు.

“ఈ ఆలోచన బాగానే ఉంది. ఆయితే పార్టీ పత్రికగా భావించి ప్రజలు పెద్దగా పట్టించు కోరేమో?...ఒకప్పుడు ఒక పార్టీ పదిపైసలకే ఒక పత్రిక నడిపింది. దానిని ఎవరూ చదవలేదు కానీ కిళ్లీలు కట్టుకోవడానికి ఇతర పనులకూ వాడుకున్నారు.”

“మనం అలాంటి పనికిమాలిన పేపర్ ఎందుకు నడుపుతాం? ఇంటర్నేషనల్ లెవల్లో ఉన్న పేపర్లతో పోటీపడపడేలా నడుపుతాం. అప్పుడు మనకు వ్యతిరేకంగా జనాన్ని రెచ్చగొట్టే ఆ రెండు పత్రికలు నోళ్లుమూసుకోకతప్పదు.”

“నీ సలహా బాగానే ఉంది కానీ మన పేర్లతో పత్రిక పెడితే ప్రభుత్వ పత్రిక గా అందరూ అనుకుంటారు. ఇప్పటికే మూడు భాషల్లో మాసపత్రికలను ప్రభుత్వం నడుపుతోంది. మనం చేసే అభివృద్ధి కార్యక్రమాలన్నింటినీ వాటి ద్వారా ప్రజలకు తెలియజేస్తోంది.”

“నేను చెప్పేది అలాంటి పత్రిక గురించి కాదు. ఆరెండు పత్రికల కన్నా ప్రింటింగ్ లోనూ, క్వాలిటీలోనూ హైలెవల్లో ఉండాలి. కొన్నిపేజీలు మన గురించి మనం చెప్పుకోవడానికి, మిగిలిన పేజీలన్నీ ప్రతిపక్షాన్ని దానికి కొమ్ముకాసే ఆరెండు పత్రికల్నీ చీల్చిచెండాడడానికీ ఉపయో గించాలి”

“నీకు పత్రికల గురించి బాగా అవగాహన ఉందే...ఎప్పుడైనా ఏదైనా పత్రిక నడిపావా?” సందేహంగా ప్రశ్నించాడు భుజంగంనాయుడు.

"అలాంటిదేమీ లేదు. మా జిల్లాలో ఒక సీనియర్‌జర్నలిస్టు నాకు ఎప్పటినుంచో బాగా తెలుసు. అతనూ నేనూ కలిసి ఎల్లప్పుడూ మందుపార్టీలు, పేకాటల్లో కూర్చొన్న సమయాల్లో పత్రికలగురించి ఆతను చెప్పిన విషయాలు బాగా గుర్తున్నాయంతే"

"అలాగా...కొంపతీసి అతన్ని నీతోపాటు హైదరాబాద్‌గానీ తీసుకొచ్చేసావా?"

"నేను ఇప్పడు పిలిచినా రాలేని స్థితిలో ఉన్నాడు"

"అదేమిటీ....?"

"ఏమీలేదు...నేను మంత్రిని అవుతానని తెలిసే ఈ మధ్య ఒక పత్రిక రిజిస్ట్రేషన్ చేసేసాడు . పత్రిక నడపకపోయినా అన్ని జిల్లాల అధికారులతో నాపేరు చెప్పుకుని భూసేకరణ ప్రకటనలు, ఇతర ప్రకటనలు దండుకుంటున్నాడు. ఆపనిలో చాలా బిజీగా ఉన్నాడు. అందుకే ఇక్కడికి రాలేదు. ఎవరైనా ఉద్యోగుల బదిలీలు, అపాయింటుమెంట్లు వంటి పనులు తగిలితే ఇక్కడికి వస్తుంటాడు"

"సరే అతని గొడవ మనకెందుకు....మనం పెట్టే పత్రిక గురించి చెప్పు ఏం చేద్దాం?"

"కనీసం మూడొందల కోట్ల రూపాయల పెట్టుబడైనా ఉండాలి."

"దాని సంగతి నేను చూసుకుంటాను. మిగిలిన విషయాలు చెప్పు"

"ఎలా సమకూరుస్తారు? అంత పెద్ద మొత్తాన్ని"

"అదేమంత పెద్ద సమస్యకాదు ప్రభుత్వమే మన చేతుల్లో ఉంది. చాలా కార్పోరేట్‌కంపెనీలన్నీ మన కనుసన్నల్లో ఉన్నాయి. మాఅబ్బాయి జగదీశ్వర్ నా పరిశ్రమలన్నీ చూసుకుంటున్నాడు కదా!"

"అయితే....!"

"అమాయకుడిలా అడుతావేమిటి? ఇప్పటికే సెజ్‌లకనీ, పరిశ్రమలకనీ, కార్పోరేట్ కారిడార్లకనీ లక్షల ఎకరాలు చాలా కంపెనీలకు ఇచ్చాం. అవన్నీ ఊరికే ఇచ్చామా? వారందరితో మా జగదీశ్వర్ నడిపే కంపెనీల్లో పెట్టుబడులు పెట్టిస్తా, అదనంగా కేవలం రికార్డులపైనే కొన్ని కంపెనీలు ఉన్నట్లు చూపిస్తాం. వాటిలో పెట్టుబడులు పెట్టించి వాటిని పేపర్‌కోసం సమీకరిస్తాం. అందువలన పెట్టుబడి కోసం వెతుక్కోవడం అసలు సమస్యేకాదు. ఇప్పటికైనా అర్థమైందా?"

"చాలా బాగుంది మీ ప్రపోజల్...పెద్ద సమస్యని ఇట్టే పరిష్కరించేసారు"

"స్టాఫ్ సంగతే ఇక చూస్కోవాలి"

"దీనికి మంచి ప్లాన్ ఉంది. ఆ రెండు పత్రికల్లో తక్కువ జీతానికే పనిచేస్తున్న సమర్థులు చాలా మంది ఉన్నారు. వారికి రెట్టింపు జీతాన్ని ఆఫర్‌చేద్దాం. తప్పనిసరిగా మన పేపర్లో చేరుతారు. ఆ రెండు పత్రికలూ కొంత బలహీనపడతాయి. బాగా రాసేవాడు లేకపోతే ఏ పత్రికా బాగా నడవలేదు."

"మంచి నిర్ణయం...ఇంకెందుకు ఆలస్యం? సాయంత్రమే జగదీశ్వర్ తో మాట్లాడుతాను. కార్పోరేట్ కంపెనీల నుంచి పెట్టుబడులు వచ్చే విషయం నీవు చూసుకో. నెలరోజుల్లో మన పత్రిక మార్కెట్లో ఉండాలి అంతే" అర్డర్ వేస్తున్నట్లు చెప్పాడు భుజంగంనాయుడు.

ధర్మరాజు ఆపనుల్లో బిజీ అయిపోయాడు.

రాష్ట్రంలో ఇరవై ఎడిషన్లతో 'న్యూస్‌విట్నెస్' అనే తెలుగుపత్రిక ప్రారంభమైపోయింది. వారు ప్లాన్‌చేసుకున్నట్లే 'నారాజ్యం', 'త్రిముఖం' పత్రికలనుంచి కొందరు జర్నలిస్టులను తీసుకొచ్చి కొత్త పత్రికను ఆరంభించేసారు.

×××× ×××× ××××

రామకోటికి అంతా కలలా ఉంది.

పెయిడ్‌న్యూస్ అన్న ఐడియా తన జీవితాన్నే మరోమలుపు తిప్పుతుందన్న ఆనందాన్ని ఆతనింకా జీర్ణించుకోలేకపోతున్నాడు.

కేవలం ముప్పైలక్షల రూపాయల పెట్టుబడితో 'త్రిముఖం' పత్రికను ప్రారంభించి వంద కోట్ల రూపాయలకు పైగా స్థిరాస్తిని పోగుచేసుకున్న రామకోటికి పెయిడ్‌న్యూస్ ఆలోచన బాగా కలిసొచ్చింది. నూటాఏభైకోట్ల రూపాయల ఆదాయం పెయిడ్‌న్యూస్ వల్ల రావడంతో తన అదృష్టాని కి మురిసిపోతున్నాడు. ఈసొమ్ముకు ఆదాయపుపన్నుశాఖకు ఎలాంటి లెక్కలు చెప్పాల్సిన పనిలేదు. ఎన్నికల్లో తాము లోపాయికారిగా మద్దతు ఇచ్చిన పార్టీ ఓడిపోయినా ఆదిగులు రామకోటిలో ఏమాత్రం లేదు. ఇప్పుడున్న ఆలోచనంతా ఈ సొమ్మును మళ్లీ ఎలా రెట్టింపు చేయాలన్నదే.

అందుకోసం విష్ణుప్రకాష్, శ్రీకాంతాచార్యులు, రఘురాంలతో మీటింగ్ పెట్టాడు రామకోటి.

ముందుగా రఘురాం మాట్లాడుతూ " మన పేపర్‌లో న్యూస్‌కంట్రిబ్యూటర్లకు చాలా యేళ్ల నుంచి లైన్‌ఎకౌంట్ పారితోషికాలు ఇవ్వడంలేదు. అందువల్లవారంతా మొక్కుబడిగా పనిచేస్తున్నారు . వారందరికీ లైన్‌ఎకౌంట్ బకాయిలు ఇచ్చేస్తే బాగుంటుందేమో అన్నాడు.

అతని మాటలకు విష్ణుప్రకాష్ అడ్డుపడుతూ "మనం వారికి ఇవ్వాల్సిన లైన్‌ఎకౌంటు పారితో షికాలు ఏమూలలకు సరిపోతాయి వారికి. వారి సంపాదన మన జీతాలకన్నా రెట్టింపు ఉంటుంది తెలుసా? " అన్నాడు

"అదెలా...?" అర్థం కానట్లు అడిగాడు రఘురాం.

"మీరు డెస్కుల్లో మాత్రమే పనిచేసి ఈ స్థాయికి వచ్చారు. అందుకే వారి గురించి అంత అవగాహన లేదు. మనతోపాటు మరికొన్ని పేపర్లు వారికి రూపాయికూడా రెమ్యూనరేషన్ ఇవ్వడం లేదు. కానీ ఒక్కొక్కడి మెయింటైనెన్స్ ఎలా ఉంటుందో తెలుసా...? ప్రతీ ఒక్కడికీ మోటారుసైకిళ్లు

, పెద్దపెద్ద బిల్డింగులు, కొంతమందికైతే కార్లు కూడా ఉన్నాయి. కొంతమంది మద్యం షాపులకు క
ూడా యజమానులు. పేపర్లని అడ్డంపెట్టుకుని అన్నిరకాల దందాల్లోనూ వారిదే కీలకపాత్ర. అందుకే
క పైసా పారితోషికం ఇవ్వకపోయినా ఇంటి  చూరుకు వేళ్లాడే గబ్బిలాల్లా బయటకు పోరు" అన్నా
డు విష్ణుప్రకాష్.

"అందరూ మీరు చెప్పినట్లే ఉండరు. కొంతమందైనా నిజాయితీపరులుంటారు. మీరు చెప్పిన వాళ్లే మీకు అత్యంత సన్నిహితులేమో...!" చురక అంటించాడు రఘురాం.

"నిజాయితీపరులైతే ఈ పత్రికారంగానికి ఎందుకు వస్తారు?" ఎదురుప్రశ్నవేసాడు విష్ణుప్రకాష్.

వీరిద్దరి మాటలు వింటూ అసహనానికి గురైన రామకోటి "ఇక్కడికి మీకు పిలిపించింది. ..మీ ఆర్గ్యుమెంట్లు వినడానికి కాదు" అంటూ చిరాకుపడ్డాడు.

అతని స్వరంలో తీవ్రతని గుర్తించిన వారిద్దరూ మౌనం వహించారు.

అప్పుడు రామకోటి మాట్లాడడం మొదలుపెట్టాడు.

"జాగ్రత్తగా వినండి. మనం పెయిడ్‌న్యూస్ ద్వారా సంపాదించినదంతా రికార్డుల్లో చూపించని సొమ్ము. స్టాఫ్ జీతాలు, లోకల్ రిపోర్టర్ల పారితోషికాలు వంటివి ఆ సొమ్ము నుంచే ఇవ్వాలంటే

ఇబ్బంది ఉంటుంది. అంత సొమ్ము ఎలా వచ్చిందని ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటు ఆరాతీస్తే అసలు విషయం బయటపడుతుంది. అందుకని ఈ సొమ్ములో కొంత భాగం వేరే అకౌంట్‌లో డిపాజిట్‌చేసి మిగిలిన సొమ్ముతో అందరికీ ఉపయోగపడే ఒక న్యూస్‌ఛానల్‌ని ప్రారంభించాలని అనుకుంటున్నాను. మీరేమంటారు? "

"ఆ ఆలోచన మంచిదే సార్! " అన్నారు ఆముగ్గురూ.

"గుడ్ ఏ పేరు పెడితే మన న్యూస్‌ఛానల్‌కు బాగుంటుందో చెప్పండి?" ఉత్సాహంగా అడిగాడు రామకోటి.

"టి.ఎన్.టీవీ" అనే పేరు బాగుంటుంది " చెప్పాడు విష్ణుప్రకాష్..

"అంటే....?" ప్రశ్నార్థకంగా అడిగాడు రామకోటి.

""త్రిముఖం  న్యూస్ టీవీ....సంక్షిప్తంగా టీ ఎన్ టీవీ"

"చాలా బాగుంది "

మిగిలిన ఇద్దరూ అంగీకార ప్రాయంగా తలూపారు.

"అయితే స్టాఫ్ రిక్రూట్‌మెంట్ ఈరోజు నుంచే ప్రారంభించండి. నోటిఫికేషన్‌ను మనపేపర్‌లో ప్రముఖంగా ప్రచురించండి"

"అలాగే నండి..." చెప్పాడు శ్రీకాంతాచార్యులు.

"మనం టెక్నికల్ స్టాఫ్‌ని, కెమెరామన్‌లను వేసుకుంటే సరిపోతుంది. ప్రింట్‌కు ఉన్న రిపోర్టర్లనే ఛానల్‌కు కూడా వాడుకుందాం" అన్నాడు విష్ణుప్రకాశ్. ఛానల్ న్యూస్‌నెట్‌వర్క్ కూడా తనగుప్పిట్లో నే ఉండాలన్నది అతని దూరాలోచన.

" అలా నడపడం కష్టమౌతుందేమో? " అని సందేహాన్ని వ్యక్తం చేసాడు శ్రీకాంతాచార్యులు.

"మన పేపర్లో పనిచేస్తున్న చాలామంది రిపోర్టర్లకు పెద్దగా పని ఉండడం లేదు. అందువల్ల వారిలో కొంతమందిని ఎంపిక చేసి ఛానల్‌కు రిపోర్టింగ్ బాధ్యతలు కూడా అప్పగించేద్దాం. కొత్త వాళ్లని రిక్రూట్‌చేస్తే వారికి కొత్తగా జీతాలివ్వాలి. ఇది అదనపు ఖర్చు. అదే మనపేపర్లో ఇదివరకే పని చేస్తున్నవారైతే ఒకే జీతానికి రెండు పనులు చేయించుకోవచ్చు. ఖర్చు లేకుండా పని జరిగిపో తుంది" వివరించాడు విష్ణుప్రకాష్.

"మంచిది అలాగే చేయండి. ఈ నెలాఖరుకల్లా మన ఛానల్ ప్రారంభం కావాలి. టెస్ట్ సిగ్నల్స్ అవీ ఏమీ వద్దు. నేరుగా ఎయిర్‌లో వచ్చే విధంగా చూసుకోండి" చెప్పాడు రామకోటి.

"అలాగే సార్! ఈ రోజు నుంచీ అదేపనిలో ఉంటాం" చెప్పారు మిగిలినవారు.

అక్కడికి నాలుగువారాల తర్వాత "టి.ఎన్.టీవీ" ఛానల్ ప్రారంభమైంది.

××× ×××× ×××

విశాఖపట్నంలోని మంత్రి ధర్మరాజు నివాసంలోనికి అడుగుపెట్టాడు దయానిధి.
ధర్మరాజు పీఏ రామారావు పలుకరించాడతనిని "ఏమిటో విశేషం...? ఇలా వచ్చారు" అన్నాడు.

"ఏమీ లేదులే లోపల సార్ ఉన్నారా...?"

"ఉన్నారు....కూర్చోండి, మీరొచ్చారని చెప్పి వస్తాను " అంటూ లోపలికి వెళ్లబోయాడు.

"ఆయన ఉంటే నీ రికమండేషన్‌తో పనేమిటి...?" అంటూ దయానిధి తానే నేరుగా లోపలకు వెళ్లి పోయాడు మంత్రి దయానిధిని కలవడానికి.

డైనింగ్‌హాల్‌లో బ్రేక్‌ఫాస్ట్ తీసుకుంటున్న ధర్మరాజు లోపలికి వస్తున్న దయానిధిని చూసి "ఏమిటోయ్....ఉదయాన్నే వచ్చావు...ఏదైనా విశేషమా?" అన్నాడు.

"ఏం రాకూడదా? " ఎదురు ప్రశ్న వేసాడు దయానిధి.

"అలా అని కాదు. ఈటైమ్‌లో నీవింకా తాగిన మత్తులోనే పడుకుని ఉంటావుగా...ఈరోజు విచిత్రం గా తెల్లవారే వచ్చావుకదా అని"

"అంటే నాలోని తాగుబోతునే గుర్తించారన్నమాట....కొన్ని దశాబ్దాల అనుభవం ఉన్న జర్నలిస్టుని గుర్తించలేదన్నమాట"

"నీ బోడి జర్నలిజం ఎవడికి కావాలయ్యా! వచ్చిన సంగతి ఏమిటో చెప్పు"

"ముందు బ్రేక్‌ఫాస్ట్ చేసి తీరుబడిగా చెప్తాను"

"సరే....కానివ్వు..."

దయానిధి టిఫిన్ తింటూ మధ్యమధ్యలో మాట్లాడుతున్నాడు.

"ఈ జిల్లాలో మా మామగారి ఊరులోనే పదెకరాల ప్రభుత్వభూమి ఉండేది. దానిని గతంలో కొంతమంది ఆక్రమించుకుని ఒకరికి అమ్మేసారు. ఆయన బాగా ముసలాడైపోయాడు. అతనికి భార్యా పిల్లలుగానీ ఇతర వారసులుగానీ ఎవరూ లేరు. ఆ ముసలాడు రెండు రోజుల కిందటే చనిపోయాడు. ఆయన నాకు మూడేళ్ల కిందటే ఆ భూమిని నాకు అమ్మేసినట్లు దస్తావేజులు తయారుచేయించాను. వాటికి రిజిస్ట్రేషన్ కూడా చేయించేసాను. అయితే వాటిపి చూసి పట్టాదారు పాసుపుస్తకం, టైటిల్ డీడు ఇవ్వడానికి మండల తహశీల్దార్ ఇబ్బందులు పెడుతున్నాడు. అక్కడికి మీపేరు కూడా చెప్పాను. అయినా సరే రూల్స్ ఎలాఉంటే అలా వెళ్తానని భీష్మించుకుని మాట్లాడుతున్నాడు. గత్యంతరం లేని పరిస్థితుల్లో మీ దగ్గరికి వచ్చాను"

"సరే ఆ తహశీల్దార్ పేరేమిటి?"

"గోపాలావని ఎస్సీ కేస్టు"

"అలాగా....నేను ఆర్డీఓ తో చెప్పిస్తాన్లే....ఆ భూమి విలువ ఎంతుంటుంది?"

"ఎంతుంటే ఏమిటండీ...ఏదో మీనీడలో కాస్తా అభివృద్ధి చెందాలన్నదే నా ఆశ"

" ఓకే...! మీ జర్నలిస్టు సంక్షేమ సంఘం ఎలా ఉంది?"

"దానికేమండి బాగానే ఉంది...మా సంఘానికంటూ కొంతమంది స్పాన్సర్లు ఎప్పటికప్పుడు ముందుకొస్తుంటారు. వారి దయ వల్ల మాసంఘానికి ఎలాంటి లోటూ లేదు. దీనికితోడు సభ్యుల దగ్గర నుంచి సభ్యత్వం డబ్బులు కలెక్ట్‌చేస్తుంటాం. వాటన్నింటితో ఏడాదిపొడవునా డబ్బుల కోసం వెతుక్కోనవసరం లేకుండా గడిచిపోతుంటుంది"

"మీ సంక్షేమసంఘంలో ఉన్నవారిలో సగంమంది జర్నలిస్టులే కారని చాలా మంది అంటున్నారు"

"అలాంటిది ఏమీ లేదండీ...అందరి దగ్గరా జర్నలిస్టులుగా అక్రిడేషన్‌కార్డులు ఉన్నాయి. అయితే కొంతమంది బార్లలోనూ, మెకానిక్ షెడ్లలోనూ, టీస్టాళ్లలోనూ, కాకాహొటళ్లలోనూ పనిచేస్తుంటారంతే"

"వారు పేపర్లలోనూ, టీవీ ఛానళ్లలోనూ పనిచేయరా?"

"అలా పనిచేసిన వారికి సంఘంలో తిరగడానికి తీరిక ఎక్కడుంటుందండి? మా సంఘంలో కూడా కొంతమంది అలాంటివాళ్లు ఉన్నారు. వారు వార్తలయితే రాయగలరు కానీ సొమ్ములు మాత్రం కలెక్షన్ చేయలేరు"

“సరే మీ సంఘం బాగుందన్నమాట…నీవు రెండు వైన్ బెల్ట్ షాపులు నడుపుతున్నానని ఇంతకు ముందు అన్నావు కదా ….బిజినెస్ ఎలా ఉంది?”

“రెండు కాదు సార్! ఎన్నికల ముందు మాట అది…ఎలక్షన్లరోజుల్లో సేల్స్ బాగా జరిగింది. మీరు మంత్రి అయ్యాక వాటికి మరో మూడు కలిపాను. ఇప్పుడు ఐదు బెల్టుషాపులు మనచేతిలో ఉన్నాయి” గర్వంగా చెప్పాడు దయానిధి.

“ఏదోలే…నన్ను మాత్రం ఎందులో ఇరికించకు” అన్నాడు ధర్మరాజు.

“అలా జరగదు సార్! ఎంతైనా మీ నీడలో బతుకుతున్నాను. మిమ్మల్ని ఇబ్బందుల్లో పెడతానా? కలలో కూడా అలా జరగదు సార్” అతి వినయంగా చెప్పాడు దయానిధి.

కొంతసమయం అక్కడేఉండి తనకు ఇంకోపని ఉందని ధర్మరాజు నుంచి సెలవుతీసుకుని వెళ్లిపోయాడు దయానిధి.

××× ××× ×××

అశోక్‌వర్ధన్ మరో పది నిమిషాల్లో లోకల్ ఆఫీసుకు బయలుదేరాలని అనుకొంటున్న సమయం లో బ్రాంచ్‌మేనేజర్ శ్రీనివాస్ నుంచి ఫోన్.

“గుడ్ మార్నింగ్! అశోక్ ఏం చేస్తున్నారు?”

“గుడ్ మార్నింగ్ సర్! ఆఫీసుకు బయలుదేరుతున్నాను…చెప్పండి…ఏమైనా విశేషమా!”

“అవును…మన సౌజన్యారావుకు బదిలీ అయ్యింది”

“నిజమా! ఎక్కడికి? ఎప్పుడు? ఏం జరిగింది? నాకు తెలియదే” ఆశ్చర్యంగా అడిగాడు.

“ఇప్పుడే హెడ్డాఫీసు నుంచి ఫ్యాక్స్‌లో ఆర్డర్స్ పంపించారు. ఇంకా ఆయనకే తెలియదేమో. ..ఇప్పుడింకా నిద్రలేవకపోయుంటారు. ఒక గంటాగి ఆయనకు ఫోన్ చేసి చెప్తాను.”

“ఇంత సడెన్‌గా ఆయనను ఎక్కడికి ట్రాన్స్‌ఫర్ చేసారు?”

“అనంతపురం ఎడిషన్‌కు న్యూస్‌ఎడిటర్‌గా ట్రాన్స్‌ఫర్ చేసినట్లు ఆర్డర్స్‌లో ఉంది. ఈరోజే ఇక్కడ రిలీవింగ్ ఆర్డర్ తీసుకుని మరో మూడు రోజుల్లో అనంతపురం యూనిట్లో జాయినింగ్ రిపోర్టు ఇవ్వాలట”

“అలాగా ! ఆయన పనితీరు బాగా ఉండేది కదా! ఎందుకు ఇలా జరిగింది?”

“అవును సౌజన్యారావు మంచి టాలెంట్ ఉన్న న్యూస్ ఎడిటర్. ఎదుటివారిలో ఉన్న టాలెంట్ ను గుర్తించి ఆయన ప్రోత్సాహం ఇస్తారు. ఈవిషయం ఆయన త్రిముఖం పత్రికలో పని చేసిన దగ్గర నుంచీ నాకు తెలుసు. అందరిలోనూ మంచి క్వాలిటీని చూసి తగిన విధంగా ఆయన మన

ఎడిషన్‌కు వారిని ఉపయోగించుకునేవారు. నిజంగా ఆయన మన యూనిట్ నుంచి ట్రాన్సఫర్ అయి వెళ్లిపోతుండడం మనం కొంత బాధపడాల్సిన విషయమే."

"ఇంత హఠాత్తుగా ఆయనను ఎందుకు ట్రాన్స్‌ఫర్ చేసారు?"

"నేను కూడా అదే విషయాన్ని ఆలోచిస్తున్నా...ఆయన వల్ల మన యూనిట్‌కు లాభమేగానీ ఎలాంటి నష్టం లేదు. పోటీ పత్రికల కన్నా మంచి వార్తలు,కథనాలు తెలుగుదీపంలో రావడానికి చాలా శ్రద్ధ తీసుకునేవారు.తన పనితీరుతో మిగిలిన వారందరికీ మంచి సూచనలు చేసేవారు"

"అదే సార్! నాకూ అర్దం కావడం లేదు. కారణమేమై ఉంటుందో?"

"ఈ మధ్య మన ఎండి గారి దగ్గరకు ఆషాడభూతిల్లాంటివారు కొంతమంది చేరారు. ఎవరూ ప్రశాంతంగా పనిచేసుకోవడం వారికి నచ్చదు. వారికి పనిచేతకాదు, సక్రమంగా పనిచేసే వారంటే వారికి కిట్టదు. వారు స్థిమితంగా ఉండలేరు. ఎదుటివారిని స్థిమితంగా ఉంచరు. బహుశా ఇది వాళ్ల పనే అయి ఉంటుంది. ఈలెక్కన చూస్తే మిగిలిన యూనిట్లలో కూడా ట్రాన్స్‌ఫర్స్ ఉంటాయేమో?"

"ఇక్కడికి ఆయన ప్లేస్‌లో ఎవరిని వేస్తున్నారు?"

"సెంట్రల్ డెస్క్‌లో సబ్‌ఎడిటర్‌గా ఉన్న గురునాధ్ అనే ఆయనని పంపిస్తున్నారు. ఆయన డ్యూటీలో జాయిన్ అయ్యేటంత వరకూ కోటేశ్వరరావుకు ఇన్‌ఛార్జ్ బాధ్యతలను అప్పగిస్తున్నారు."

"ఓహో! అలాగా అయితే మరో గంటలో నేను మన యూనిట్ ఆఫీసుకు వస్తాను. టౌన్లో కూడా పెద్ద కార్యక్రమాలు ఏవీ లేవు."

"ఓకే...రండి...అప్పటికి సౌజన్యారావు కూడా ఆఫీసుకు వచ్చేస్తారు. ఆయనని కలిసినట్లు కూడా ఉంటుంది"

"ఓకే సార్!" అన్నాడు అశోక్‌వర్ధన్.

అశోక్‌వర్ధన్ యూనిట్ ఆఫీసుకు చేరేసరికే సౌజన్యారావు బ్రాంచ్ మేనేజర్ ఛాంబర్‌లో ఉన్నాడు. లోపలికి వస్తూనే అతను వారిద్దరికీ విష్‌చేసి వారికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చొన్నాడు.

అప్పటికే సౌజన్యారావు ముఖంలో నిరుత్సాహం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. నిజాయితీకి ఇవి రోజులు కావనే నిర్లిప్తత ఆయనలో వ్యక్తమౌతోంది. సౌజన్యారావు సొంత ఊరు విశాఖపట్నం కాకపోయినా  ఈ జిల్లాతో ఆయన మమేకమైపోయాడు. మండలాల రిపోర్టర్లకు, ఆర్‌సీ ఇన్‌ఛార్జి రిపోర్టర్లకు ఎప్పటికప్పుడు మంచి సూచనలు చేస్తూ మార్గ దర్శకత్వం ఇస్తూ వారందరికీ గౌరవ పాత్రునిగా నిలిచాడు. ఆయన ఎవరిపైనా కావాలని కఠినంగా వ్యవహరించకపోయినా ఆయనంటే కొంత భయభక్తులతోనే అంతా ఉండేవారు. ఎలాంటి చిల్లర పనులకూ పాల్పడకుండా నిగ్రహించు కునే వారు. ఆ విషయం అశోక్‌వర్ధన్‌కు కూడా తెలుసు. అందుకే  త్రిముఖం పత్రికకు ఇతర

ఎడిషన్లతో పోలిస్తే ఈ ఎడిషన్‌కు సర్క్యులేషన్ ఎక్కువగా ఉంది. అదంతా మార్కెటింగ్ సిబ్బంది ప్రతిభ మాత్రమే కాదు. సౌజన్యారావు అంకిత భావంతో రిపోర్టర్ల ద్వారా మంచి కథనాలు వార్తలు రాయిస్తుండడమే. అంతా బాగున్న సమయంలో మేనేజ్‌మెంట్ నిర్ణయం ఆముగ్గురులోనూ కొంత ఆవేదన కల్గిస్తోంది.

బ్రాంచి మేనేజర్ శ్రీనివాస్ దగ్గర నుంచి రిలీవింగ్ ఆర్డర్ తీసుకున్న సౌజన్యరావుతో

"సార్! సెండాఫ్ మీటింగ్ ఏర్పాటు చేద్దామా...!" అన్నాడు అశోక్‌వర్ధన్.

"వద్దు..... అలాంటివి నాకు నచ్చవని మీకు తెలుసుకదా! నా ఆలోచనఅంతాఒక్కటే పిల్లలు ఇక్కడే చదువుతున్నారు వారిని సడన్‌గా అనంతపురం ఎలా తీసుకువెళ్లడమా... అని"

"నిజమేనండి ఈఏడాది ఇక్కడే ఎలాగోలా స్టడీస్ కంటిన్యూ అయ్యేలా చూడండి. వైజాగ్ నుంచి అనంతపురం దూరమే అయినప్పటికీ మేమంతా ఉన్నాం కదా మీరు ఫోన్‌లో చెబితే చాలు ఎలాంటి సాయమైనా చేసి పెట్టడానికి" భరోసా ఇస్తున్నట్లు చెప్పాడు అశోక్‌వర్ధన్.

"చాలండి...... ఆ మాటే చాలు నాకు ఇప్పుడు ఏ టెన్షన్‌లేదు" అన్నాడు సౌజన్యరావు.

కాస్త అన్యమనస్కంగానే వారిద్దరికి మళ్లీ కలుద్దాం అని చెప్పి బయటకువచ్చేశాడు అశోక్‌వర్ధన్.

సాయంత్రం నాలుగన్నర ప్రాంతంలో అశోక్‌వర్ధన్‌కు సౌజన్యరావు ఫోన్‌చేశాడు తనపర్సనల్ నంబర్ నుంచి

"నేను అనంతపురం వెళ్లడంలేదండి "

"ట్రాన్స్‌ఫర్ రీబ్యాక్ అయ్యిందా సార్! గుడ్‌న్యూస్ చెప్పారు"

"అదేమీ లేదండి. న్యూస్‌విట్‌నెస్ పత్రికకు విశాఖపట్నం ఎడిషన్ ఇన్‌చార్జ్‌గా జాయిన్ అవుతున్నాను . మనవాళ్లు ఇచ్చేజీతంకన్నా పదివేలు అదనంగా ఇస్తామన్నారు"

"గుడ్‌న్యూస్ చెప్పారు సార్! కంగ్రాట్యులేషన్స్" అశోక్‌వర్ధన్ అభినందనలు తెలిపాడు.

అవతల నుంచి సౌజన్యరావు ఫోన్‌కట్‌చేసిన తరువాత టిట్ ఫర్ టాట్ అనుకున్నాడు. అచ్చంగాచెప్పాలంటే కుక్కకాటుకు చెప్పుదెబ్బలా ఉంది. ఇప్పటికైనా మేనేజ్‌మెంట్ తెలివి తెచ్చు కుంటుందని మనసులోఅనుకున్నాడు.

×××× ×××× ×××

కోటేశ్వరరావుకు పట్టరానంత ఆనందంగా ఉంది.

ఏనుగెక్కినంత సంబరంగాఉంది.

జాక్‌పాట్ తగిలినంత ఉత్సాహంగా ఉంది

ఒకసాధారణ సబ్ఎడిటర్గా ఉన్న తనని త్రిముఖం మేనేజ్మెంట్ ఏకంగా న్యూస్ ఎడిటర్ బాధ్యతలు అప్పగించేసింది.

కోటేశ్వరరావు సొంతూరు విశాఖపట్నం జిల్లాలోని అనకాపల్లి. ఇంటర్మీడియట్మూడు సార్లు తప్పి చదువు తనకు అబ్బదని గ్రహించి ఇక ఆప్రయత్నం విరమించుకుని ఒక రియల్ ఎస్టేట్ సంస్థలో బ్రోకర్గాచేరాడు.

ఆయన దగ్గరి చుట్టం ఒకాయన నారాజ్యం పత్రికలో మంచి పొజిషన్లోనే ఉండేవాడు. ఆయన ప్రాపకంతో లోకల్రిపోర్టర్గా మారి జర్నలిస్ట్ అవతారం ఎత్తేశాడు. అందులో పనిచేసిన మూడేళ్లు మంచి జర్నలిస్ట్గా కాకపోయినా మంచి ఎర్నలిస్ట్గా ఎదిగిపోయాడు.

ఇతగాడి ఎర్నలిజం చూసిన నారాజ్యం పత్రికయాజమాన్యం మీ సేవలు ఇకచాలు అంటూ బయటకు గెంటేసింది. నారాజ్యం పత్రికలో పనిచేశాడన్న ఒకేఒక్క అంశాన్ని అర్హతగా చూపించి త్రిముఖం పత్రికలో సబ్ఎడిటర్ అయిపోయాడు.

చేసే పనితక్కువ తనకు తాను గొప్పలు చెప్పుకోవడం ఎక్కువ. అటువంటి కోటేశ్వరరావుని తాత్కాలికంగానైనా న్యూస్ఎడిటర్ సీట్లో కూర్చోబెట్టడంతో కోతికి కొబ్బరి కాయ దొరికినట్లయ్యింది.

కొత్త న్యూస్ ఎడిటర్ వచ్చేలోపలే ఎంతో కొంత వెనకేసుకోవాలన్నతపన అతనిని స్థిమితంగా ఉండనివ్వడం లేదు.

ఆఫీసులో ఉన్న రిపోర్టర్ల ఫోన్నెంబర్ల జాబితానుతీసి ఒక్కొక్కరికి ఫోన్లు చేయడం ప్రారంభించారు.

"తనని ఎడిటర్గారు న్యూస్ ఎడిటర్గా నియమించారని ఇక నుంచి తనకు అందరూ కాంటాక్ట్లో ఉండాలని ఏ విషయమైనా తనతోనే మాట్లాడాలని, వార్తలు బాగా రావాలంటే తన నిర్ణయంపైనే ఆధారపడి ఉంటుందని" అందరికీ చెప్పాడు.

కోటేశ్వరరావు చేతివాటం త్రిముఖం పత్రికలో మొదట్లోనే బయటపడింది. అతడు సబ్ఎడిటర్గా జాయిన్ అయిన తొలినాళ్లలో కొంతమంది రిపోర్టర్లను లోబరుచుకుని వారిద్వారా కలెక్షన్లు,రాజకీయ నాయకులదగ్గర సొంతంగా పైరవీలతో పై సంపాదన చేసేవాడు. ఈవిషయాన్ని గమనించిన సౌజన్యారావు కొంతవరకు కోటేశ్వరరావు దూకుడుకు బ్రేకులు వేశాడు. ఆయనబదిలీతో ఒక్క సారిగా స్వేచ్ఛావాయువులు పీల్చుకున్నట్లు ఫీలవుతున్నాడు ఇతడిప్పుడు.

ఏయే వార్తలు ఏవరెవరు రిపోర్టర్లతో రాయించాలి.ఏయే గవర్నమెంట్ డిపార్ట్మెంట్ల నుంచి బాగాగిట్టుబాటు అవుతుంది అన్నవిషయాలన్నీ ఇదివరకే కోటేశ్వరరావుకు క్షుణ్ణంగా తెలుసు.

అందుకే ప్లానింగ్ సిద్ధంచేసుకున్నాడు.

అయితే అతనికి ఒక భయం కూడా వెంటాడుతోంది. స్టాఫ్ రిపోర్టర్‌గా ఉన్న అశోక్‌వర్ధన్ అంటే కొంత భయం అతనికి ఎన్నాళ్లనుంచో ఉంది. ఏ ఒత్తిడికి తలొగ్గకుండా ఏమాత్రం వెనుకంజ వేయకుండా వార్త కథనాలు రాస్తూ అశోక్‌వర్ధన్ మేనేజ్‌మెంట్ దృష్టిలో కూడామంచి పేరు సంపాదించాడు. అదే కోటేశ్వరరావు భయమల్లా.

తనచేతి వాటాన్ని గమనించి పైవాళ్లకు తన గురించి కంప్లయింట్ కాదు కదా మాటవరసకు అతడు ప్రస్తావించినా తన ఉద్యోగానికి ముప్పు తప్పదన్న భయం ఏమూలో కోటేశ్వరరావు మనసు లో పొంచి ఉంది.

అందుకే అశోక్‌వర్ధన్‌తో ఎంతో సాన్నిహిత్యం ఉన్నట్లు, అతడే ఆత్మీయుడు అన్నట్లు నటించడం ప్రారంభించాడు.

ఒక సందర్భంలో అశోక్‌వర్ధన్‌తో " మీ పుల్ కోపరేషన్ కావాలినాకు నేను సౌజన్యారావు లాంటి చాదస్తం మనిషిని కాను ఆ విషయం మీకుతెలుసు" అన్నాడు.

"ఒకేసంస్థలో పనిచేస్తున్నాం కదా కోపరేషన్ తప్పనిసరిగా ఉంటుంది. అలా కాకపోతే మనం పోటీ పత్రికల దగ్గర వెనుకబడి పోతాం" చెప్పాడు అశోక్‌వర్ధన్.

"నేను చెప్పేది మీకు అర్ధం కానట్లు ఉంది. ఆ కోపరేషన్ ఎలాగూ ఉంటుంది. వార్తల విషయంలో కొన్ని సార్లు మనం అనుకుని కొన్ని నిర్ణయాలు తీసుకోవాలి".

"అలాగే తప్పకుండా డెస్క్‌లో కోఆర్డినేషన్ లేకపోతే వార్తల వలన లీగల్ ప్రాబ్లమ్స్ వస్తే కష్టం కదా."

తాను చెప్పేది అశోక్‌వర్ధన్‌కి అర్ధంఅవుతుందా అర్ధమై కానట్లు మాట్లాడుతున్నాడా. ఏదీ నిర్ణయించుకోలేక ఏమాట్లాడాలో తెలియక కోటేశ్వరరావు కొంతసేపు ఆగాడు.

అంతలోనే సంభాళించుకొని "లీగల్ ప్రాబ్లమ్స్ వచ్చేలా మనం ఎందుకువార్తలు పెడతాం. అన్ని పర్ఫెక్ట్‌గా చూసిన తరువాతే పబ్లిష్ చేద్దాం" అన్నాడు.

అశోక్‌వర్ధన్ ధోరణిచూస్తే కోటేశ్వరరావుకి తన ప్లాన్స్ వర్కవుట్ అవుతాయో లేదో అన్న అనుమానాలు మొదలయ్యాయి. ఒకటి రెండు రోజులు దీర్ఘంగా ఆలోచించగా అతనికి ఒక ఉపా యం తట్టింది. మేనేజ్‌మెంట్ దగ్గర అశోక్‌వర్ధన్‌ను దోషిగా నిలబెట్టి ఈ యూనిట్ నుంచిగాని, ఈ సంస్థ నుంచిగాని తప్పించేయగలిగితే తనకుఇక తిరిగే ఉండదన్న ఆలోచన మనసులో బాగా ఆశలను రేపింది. అంతలోనే మరో సందేహం అతనిలో రాజుకుంది. అశోక్‌వర్ధన్ స్థానంలో వచ్చే వాడు ఎలా ఉంటాడో తన మనిషినే వేయించుకోగలిగితే.....ఇలాంటి ఊహలన్నీ కోటేశ్వరరావులో రకరకాల ఆలోచనలను సృష్టిస్తున్నాయి.

అనుకున్నవన్నీ జరగాలంటే తాను చేయాల్సినవి ముందుగా న్యూస్ నెట్‌వర్క్ ఇన్‌చార్జ్ విష్ణుప్రకాష్ ప్రాపకాన్ని సంపాదించాలి. ఆయనను ప్రసన్నం చేసుకుంటే మిగిలినవన్నీ ఇట్టే జరిగి పోతాయి. కాగలకార్యం గంధర్వులే తీరుస్తారన్నంటూ తనకు ఎదురులేక పోతుంది. పనిలోపనిగా తాను ఎన్నాళ్లైనా న్యూస్ ఎడిటర్ సీట్లో కూర్చోవచ్చు.

ఆలోచన తట్టిందే తడువుగా విష్ణుప్రకాష్‌కు కోటేశ్వరరావు ఫోన్‌చేశాడు.

"ఏమోయ్! కోటేశ్వరరావుఏం చేస్తున్నావు?"

"నమస్కారం సార్!. మీదయవల్ల అంతా బాగానే ఉంది సార్!!".

"కొత్త బాధ్యతలు ఎలాఉన్నాయి?".

"అంతా మీఆశీర్వాదం సార్!".

"అందరితో సఖ్యతగానడుచుకో. బాగుంటుంది."

"అలాగే సార్. అందరి కోపరేషన్ ఉండాలనికోరుకుంటున్నాను. అశోక్‌వర్ధన్ మాత్రం కొంచెం తేడాగా ఉన్నాడు."

"నీవు అతని జోలికి వెళ్లకు. ఆ సౌజన్యారావుతో చెట్టాపట్టాలేసుకుని తిరిగేవాడు కదా! అతనికి ట్రాన్స్‌ఫర్ కావడాన్ని ఇతనింకా జీర్ణించుకోలేకపోతున్నాడు. ఇతనికీ ఓ రోజు వస్తుందిలే".

"థ్యాంక్స్ సార్!. మొన్న మీరు ఏదో పంపించాలని చెప్పారు. హైదరాబాద్ నుంచి మా బామ్మర్ది వారం రోజుల కిందటే ఊరికి వచ్చాడు. రేపే అక్కడికి బయల్దేరుతున్నాడు. మీ ఫోన్ నెంబర్ ఇచ్చి అతనితో పంపిస్తున్నాను".

"సరే ఆఫీసులో ఉంటే నన్ను కలవద్దనిచెప్పు. ఇంటిదగ్గరికే వెళ్లాలని అతనికి చెప్పు."

"అలాగే సార్!".

"ఓకే......" అటునుంచి విష్ణుప్రకాష్ ఫోన్ కట్‌చేశాడు.

×××× ×××× ×××××

"హలో ! అశోక్‌వర్ధన్ గారేనా?" మొబైల్ ఫోన్లో విన్పించిన గొంతుని వెంటనే గుర్తుపట్టాడతడు. అవతలనుంచి మాట్లాడుతున్నది జ్యోతిర్మయి.

"నేను అశోక్‌వర్ధన్‌నే చెప్పండి జ్యోతిర్మయి గారూ! ఎలా ఉన్నారు?"

"నేను బాగానే ఉన్నాను.....ఇప్పుడు ఎక్కడ ఉన్నారు మీరు"

" సిటీ ఆఫీస్‌లో ఉన్నాను"

"నేను మీ ఆఫీసుకు ఐదు నిమిషాల్లో వస్తున్నాను"

"రండి....రండి"

అటునుంచి ఫోన్ కట్‌చేసింది జ్యోతిర్మయి.

ఆమె చెప్పినట్లే ఐదు నిమిషాలు పూర్తయ్యాయోలేదో ద్వారం దగ్గర నుంచి "నమస్తే! మే ఐకమిన్ సర్!" అంటూ జ్యోతిర్మయి.

"రండి " అంటూ లోపలకి పిలిచాడు అశోక్‌వర్ధన్.

అతని టేబుల్‌కు ఎదురుగా ఉన్న కుర్చీలో జ్యోతిర్మయి కూర్చొంది. తన బ్యాగ్ తెరచి దాన్నుంచి నాలుగైదు పుస్తకాలు తీసింది.

"ఇవి మీకు చాలా ఉపయోగపడతాయి. బాగా చదవండి " అంటూ అశోక్‌వర్ధన్‌కు ఇచ్చింది. అవన్నీ పర్యావరణం గురించి ప్రజాహక్కులు గురించి వచ్చిన పుస్తకాలు. కొన్ని కొన్ని అంశాలపై వివిధ ప్రజాసంఘాల నిజనిర్ధారణ కమిటీల నివేదికలు కూడా అందులో పొందుపర్చారు.

"కొంత తీరుబడి సమయంలో వీటిని చదువుతాను"

"సరే! నేను వచ్చింది మీకు ఈ పుస్తకాలు ఇవ్వడానికే కాదు. వేరే కారణం ఉంది"

"ఏమిటో అది చెప్పండి. చాలా రోజుల క్రితం మనం ట్రైన్‌లోనే కలవడం, ఆతర్వాత నేను చాలా బిజీ అయ్యాను"

"తెలుస్తూనే ఉంది. మీరు పరిచయమయ్యాక మీ వార్తలపై కొంత కాన్సంట్రేషన్ చేసాను. మంచి వార్తలు ఇస్తున్నారు" అంది ప్రశంసాపూర్వకంగా .

"థాంక్యూ...అండీ"

" ఆ మధ్య కాకిపల్లిలో థర్మల్ పవర్ ప్లాంట్ విషయంపై మంచి స్టోరీ ఇచ్చారు. కానీ ఒక్కరోజుతోనే ఆపేసారేమిటీ?. మిగిలిన వార్తలు ఏవీ దాని గురించి రాయలేదు."

"అవును....అక్కడ పర్యావరణ విషయంలో ఉత్పన్నమయ్యే సమస్యలను ఎత్తి చూపించాను. వాటిని మా పత్రిక కూడా హైలెట్ చేయడంతో మెయిన్‌లో స్టోరీ బాగా ఇచ్చాము."

"నేను ఆ స్టోరీ చదివాను. చాలా అవగాహనతో ఆలోచించి రాసారు. కానీ ఆతర్వాత ఒక్క వార్త కూడా దానిపై ఇవ్వకపోవడం చాలా అనుమానంగా ఉంది"

"ఏమిటి అనుమానాలు? నామీద అనుమానమా?"

"కాదు...కాదు...మీ గురించి కాదు. అక్కడ థర్మల్ పవర్‌ప్లాంటు ఏర్పాటు చేయబోయే ఎమ్‌కేసీ కంపెనీ ప్రతినిధులు లోకల్‌గాఉన్న సర్పంచ్‌లను, ఎంపిటిసీ సభ్యులను, జెడ్పీటీసీ సభ్యుల ను కొనేశారు.ప్రజలు కొంతమంది వ్యతిరేకంగా ఉన్నా వారిని పవర్‌ప్లాంటుకు అనుకూలంగామార్చ డానికి ప్రయత్నాలు చేస్తున్నారు. నెలాఖరులోగా ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం ఉంది అక్కడ"

"ఇంత జరుగుతోందా? మరి ఆవిశేషాలు మాకు తెలియదే. ఇంకే పత్రికలో కూడా రాలేదు."

"ఎలా వస్తాయి చెప్పండి? లోకల్‌గా ఉన్న రిపోర్టర్లకు ఆ కంపెనీవారు మందుపార్టీలు ఇచ్చి, సొమ్ములు అందించి బాగా మేనేజ్ చేసారు. అందుకే అక్కడ ప్రజల సమస్యలపైనే కాదు, పర్యావరణ శాస్త్రవేత్తల ప్రకటనలుకూడా ఎవరూ ప్రచురించలేదు"

"మీరు చాలా నిష్టూరంగా మాట్లాడుతున్నారు"

"ఇది నిష్టూరం కాదు...నిజం. ఎవరివరకో ఎందుకు మీరు ఒక్క వార్త రాసి మిగిలిన వార్తలేవీ రాయకుండా ఆపేసారెందుకు? మీ పేపర్‌లో న్యూస్ వచ్చిన తర్వాత అక్కడ సమస్యంతా పరిష్కార మైపోయిందా? అలా జరగలేదు కదా? మిగిలిన వార్తలు రాయడానికి మీ చేతులు ఎందుకు ముందుకు కదలలేదు? థర్మల్ ప్లాంటు పెడుతున్న భూములు చిత్తడి నేలలని మీరు స్వయంగా చూసారు కదా!"

"అవును.....కానీ మా పైవాళ్లు ఆప్లాంటు గురించి నెగిటివ్ న్యూస్ అవసరం లేదని చెప్పారు. అందుకే మిగిలిన విషయాల గురించి పట్టించుకోలేదు"

"ఇప్పటికైనా అర్ధమైందా? ప్లాంట్ యాజమాన్యం హైదరాబాద్‌లోని పత్రికలు,టీవీ ఆఫీసుల్లో ఉన్న వారినికొనేసిందని"

"బహుశా...ఏమో....ఏం...జరిగిందీ మాకు తెలియదు. కానీ మేమేం చేయగలం. మా మేనేజ్ మెంట్ల దగ్గర మేము ఉద్యోగులం మాత్రమే."

"అంతదానికి ఏదో పత్రికల ద్వారా సమాజాన్ని ఉద్ధరించేస్తాం అంటూ ప్రగల్బాలు దేనికీ?"

"మీరు నాతో పోట్లాడడానికే వచ్చినట్లున్నారు"

"అదేమీ లేదండీ.... కార్పోరేట్లకు కాపుకాసే పత్రికలు,ఛానళ్లు ప్రజల ప్రధాన సమస్యల మూలాల గురించి ఏమాత్రం మాట్లాడవు.. అనే విషయాన్ని గుర్తు చేస్తున్నా"

"అవునండీ నాకూ అదే అన్పిస్తోంది. ప్రస్తుత పరిస్థితి కాకిపల్లిలో ఎలా ఉందో మళ్లీ స్వయంగా పరిశీలించి ఒక స్టోరీ రాస్తాను. ఏమౌతుందో చూద్దాం"

"మంచిది...మీ ప్రయత్నం మీరు చేయండి. మావరకూ కోర్టులో కేసు వేయాలనుకుంటున్నాం. పర్యావరణ అనుమతులు కూడా కాలుష్యనియంత్రణ మండలి నుంచి ఆ పవర్‌ప్లాంటుకు ఇంకా రాలేదు.అయినా కలెక్టర్ మాత్రం అత్యుత్సాహంతో భూములు కేటాయించేస్తున్నారు. ఆయనకు ఎంత ముట్టి ఉంటుందో?"

"నావరకూ నేను నిజాయితీగానే ఉన్నానని అనుకుంటున్నా"

"సరే...మీ విషయం మీకు తెలుసు...మీ గురించి తెలిసిన నాకు తెలుసు. మీడియాలో మేనేజ్‌మెంట్లు, డెస్కుల్లో ఉన్నవాళ్లు ఎవరు ఎక్కడ సొమ్ములకు కక్కుర్తి పడినా ప్రజలు మాత్రం రిపోర్టర్లనే అనుమానిస్తారు. వారినే ఆయా పత్రికలకు,టీవీ ఛానళ్లకు ప్రతినిధిగా భావిస్తారు.

తెరముందు ఉండేది వారే.  వారికి తెలియకుండా, తెలియనివ్వకుండా తెరవెనుక జరిగే అవినీతి బాగోతాలకు కూడా వారే బాధ్యత వహించకతప్పదు."

"మీరు చెప్పింది కూడా కొంత వరకూ నిజమే, కాదనలేను. కానీ మీరు నాతో పోట్లాడడానికే వచ్చారా? అనే డౌట్ మాత్రం తీరలేదు."

"మీతో పోట్లాడితే ఏమౌతుంది? ఎందుకో ఉన్నదిఉన్నట్లుగా మాట్లాడడం నాకు చిన్నప్పటినుంచీ అలవాటైపోయింది"

"సరే మీ నాన్నగారు ఏం చేస్తుంటారు? ఆయన కూడా మీలా లాయరా? "

"ఆయన స్కూల్ టీచర్‌గా పనిచేసి రిటైర్ అయ్యారు. రిటైర్మెంట్ బెనిఫిట్స్‌తో విశాఖపట్నంలో ఇల్లు కొనుక్కున్నాం"

"ఓహో....అలాగా!"

"మీకు తీరికైతే మానాన్నగారిని మీకు పరిచయం చేస్తాను"

"అలాగేనండీ...తప్పకుండా కలుస్తాను"

"ఓకే...బాయ్ అండీ...కాకిపల్లిలో ప్రజాభిప్రాయ సేకరణ రోజున కలుద్దాం" అంటూ జ్యోతిర్మయి వెళ్లిపోయింది.

ఆ తర్వాత రోజే కాకిపల్లిలో ఏర్పాటు చేయబోయే థర్మల్ పవర్‌ప్లాంటుపై ఫాలోఅప్ స్టోరీని రాసి మెయిన్‌కు పంపించాడు అశోక్‌వర్ధన్.

దానిని చూసిన విష్ణుప్రకాష్ అగ్గిమీద గుగ్గిలమైపోయాడు.

"నీకు ఈ పేపర్లో పనిచేయాలని ఉందా? లేదా?" అంటూ తిట్ల వర్షం కురిపించాడు.

ఆరోజంతా అశోక్‌వర్ధన్ అన్యమనస్కంగా గడిపాడు. అతనికి స్పష్టంగా బోధపడింది. పత్రికా స్వేచ్ఛ అంటే అది జర్నలిస్టులకు దొరకని బ్రహ్మపదార్థమని. ఆస్వేచ్ఛ కేవలం మేనేజ్‌మెంట్లకు, కొంతమంది మీడియా పెద్దలకే పరిమితమని.

××× ××××× ×××

విశాఖపట్నం జిల్లాలోని తీరప్రాంత మండలాల్లో అదొకటి.

స్వామిపేట రెవెన్యూ కార్యాలయంలోని తహశీల్దారు గది. తహశీల్దారు వెంకటరావుతోపాటు ఐదుగురు రిపోర్టర్లు కూర్చొని ఉన్నారు. నారాజ్యం రిపోర్టరు త్రిలోచనరావు, త్రిముఖం రిపోర్టరు దస్తగిరి, ప్రజాయుద్ధం రిపోర్టరు పార్వతీశం, మరో ఇద్దరు ఛానళ్ల రిపోర్లర్లు పాండురంగారావు, బాలాజీలు.

ఈ ఐదుగురూ ఆరోజు ఉదయమే తహశీల్దారు ఆఫీసుకు వెళ్లిపోయారు.

వారికి అంతకు ముందురోజు రాత్రే ఒక సెన్సేషన్ విషయం తెలిసింది. దాంతో తమలో తాము డిస్కస్ చేసుకుని రెవెన్యూ ఆఫీసులో ఇలా వాలిపోయారు.

ఆ ఆఫీసులోని రెవెన్యూ ఇన్స్‌పెక్టర్ సుధీర్, రిపోర్టర్ త్రిలోచనరావుకు గ్లాస్‌మేట్. వీరిద్దరూ రోజూ ఊరిపక్కనే ఉన్న దాబాలో కూర్చొని ఎక్కడెక్కడ ప్రభుత్వ స్థలాలు ఉన్నాయి ? వాటిని ఎలా సొంతం చేసుకోవాలి...రియల్ఎస్టేట్లుగా ఎలా మార్చుకోవాలి అని చర్చించుకుంటూ ఉంటారు. అలాంటి చర్చల్లోనే సుధీర్ ఒక కొత్త విషయాన్ని బయటపెట్టాడు.

"స్వామిపేట గ్రామానికి అనుకొని ఉన్న చిత్తడి తంపర భూముల్లో జెడ్‌సీసీ అనే కంపెనీ థర్మల్ పవర్ ప్లాంటు పెట్టబోతోందని, దానికి భూమలు కేటాయించాలని ప్రభుత్వం రెవెన్యూ శాఖకు ఆదేశాలు ఇచ్చిందని" చెప్పాడు.

"అయితే ఇందులో విశేషం ఏమీ లేదని మంత్రి ధర్మరాజు ఈ విషయంలో కీలకపాత్ర వహించి ఆ చిత్తడినేలలను ఏమాత్రం నీరులేని బీడుభూమలుగా రికార్డుల్లో మార్చేయాలని మాటల తోనే ఆదేశాలు జారీచేసాడని" అసలు విషయం బయటపెట్టాడు.

"ప్రభుత్వ భూములే కదా...పవర్ ప్లాంటుకు కేటాయిస్తే ఏమైపోతుందంటూ...." అడిగాడు త్రిలోచనరావు. అశ్చర్యంగా చూసాడతనివైపు ఆర్ఐ సుధీర్.

"నీకు కలెక్షన్లూ, కబ్జాలు తప్పా..ఇంకే విషయం తెలిసినట్లు లేదు. ఇది కొంపలు మునిగిపోయే వ్యవహారం"

"ఇందులో రిస్క్ ఏముందీ" చికెన్ లెగ్‌ను నోటినిండా కుక్కుకుంటూ అడిగాడు త్రిలోచన రావు.

వీడికి నోరు పెరిగినంతగా బుర్రపెరగలేదని ఆర్ఐ సుధీర్ మనసులో అనుకొంటూ "చిత్తడి నేలలు అంటే నిరంతరం నీటి సామర్థ్యం ఉన్న నేలలు. అటువంటివాటిని పరిరక్షించాలి గానీ, వాటిలో పరిశ్రమలు,నిర్మాణాలు జరిపి భూ భౌతిక స్వరూపాన్ని మార్చకూడదు. మంత్రి ధర్మ రాజుగాడికేం పోయింది. ఈ టెర్మ్‌లో పదవిలో ఉంటాడు, వచ్చే టెర్మ్‌లో గవర్నమెంట్ వాళ్లది కాక పోతే రోడ్డుమీద ఉంటాడు. కానీ రెవెన్యూ ఎంప్లాయిస్‌మి మేము. రికార్డుల్లో తప్పుడు రాతలు రాయడం, టాంపరింగ్ చేయడం వంటివి జరిపితే గవర్నమెంటు ఉద్యోగాన్ని ఊడబెరికేస్తుంది. పెళ్లాం పిల్లలతో పాటు ఇక పస్తులుండాలి"

"అంత రిస్క్ ఉంటుందా" త్రిలోచనరావు ముఖంలో ఆశ్చర్యం.

"అవును మరి...ఆ రికార్డుల టాంపరింగ్‌లో నేనెతై కలగజేసుకోలేదు. మా తహశీల్దార్, ఆర్డీఓలు ఏవో తంటాలు పడ్డారు. ఈ ఉద్యోగంలో ఉండి ఎన్నిరకాలు మాయలు చేసినా ఆ చిత్తడి

భూములపై ఆధారపడున్న రైతులు,మత్స్యకారుల పొట్టలు కొట్టడం నాకు అంత మంచి పని అన్పిం చడం లేదు." సుధీర్ గొంతులో కొంత ఆవేదన ధ్వనించింది.

"ఏం చేస్తే బాగుంటుంది?"

"ఏదో ఒకటి చేయ్...నీవు నా ఫ్రెండ్‌వి కాబట్టి ఈ విషయం చెప్పాను. నేను నీకిది చెప్పినట్లు ఎక్కడా లీక్ చేయకు.మళ్లీ నాకు అనవసరమైన ప్రాబ్లమ్స్."

"ఓకే...నేను చూసుకుంటాగా!...నీవు నాకేమీ చెప్పలేదు సరేనా?"

"ఆ...సరే"

ఆ రాత్రే ఈ విషయాన్ని మిగిలిన తన సహచర రిపోర్టర్లకు చెప్పాడు త్రిలోచనరావు.

ఏం చేస్తే బాగుంటుందో కూడా సలహా ఇచ్చాడు. ఈ విషయాన్ని తాను తహశీల్దారు దగ్గర ప్రస్తావిస్తే తనకు ఆర్ఐ సుధీర్ చెప్పినట్లు తెలిసిపోతుందని, అందువల్ల దస్తగిరికి వారి జిల్లా రిపోర్టర్ చెప్పారని ఒక ప్లాన్ సిద్ధం చేసాడు.

ముందుగానే ఎలా మాట్లాడాలో ఒక పథకం వేసుకుని రెవెన్యూ ఆఫీసుకు వచ్చారు వారంతా.

తహశీల్దార్ వెంకట్రావు తన ఛాంబర్‌కు రాగానే ఆయన ముందు ప్రత్యక్షమైపోయారు.

ఒకేసారి ఐదుగురు విలేకరులు వచ్చేసరికి కొంత కలవరానికి లోనైనా బయటకు రెవెన్యూ దర్పాన్ని ప్రదర్శిస్తూ

"ఏమిటి విశేషం...? అంతా కట్టకట్టుకుని వచ్చేసారు" అన్నాడు.

ముందుగా అనుకున్న విధంగానే దస్తగిరి మాట్లాడుతూ " ఏమీ లేదండీ...మాకో విషయం తెలిసింది. అది నిజమా? కాదా? తెలుసుకుందామని వచ్చామంతే" అన్నాడు.

"ఏమిటో చెప్పండి"

"మన స్వామిపేట పక్కనున్న చిత్తడి భూములను థర్మల్ పవర్‌ప్లాంటు నిర్మాణానికి కేటాయిస్తున్నారట కదా!"

"మీదాకా వచ్చిందా ఇన్ఫర్మేషన్....అవునండీ. మరి ప్రభుత్వ నిర్ణయాలు ప్రకారం పనిచేయడా నికేగా మేమున్నాం"

"అది సరేనండీ చిత్తడి భూములను పరిరక్షించాలని చట్టాలున్నప్పటికీ వాటిని తడిలేని బీడు భూములుగా రెవెన్యూ రికార్డులు మార్చి అడ్డగోలుగా కేటాయిస్తున్నారని తెలిసింది"

తహశీల్దారు వెంకట్రావు ముఖంలో చిరుచెమటలు అలముకున్నాయి.

"అలాంటిది ఏమీ లేదండీ. మీకు ఎవరు చెప్పారో గానీ అది తప్పుడు సమాచారం"

తహశీల్దారు నుంచి ఆ సమాధానం వస్తుందని ముందుగానే మాట్లాడుకున్న విలేకరులు నవ్వుముఖాలతో ఒకర్నొకరు చూసుకున్నారు.

దస్తగిరి చిరునవ్వుతోనే “మాకు అంతా తెలుసులెండి…మీరూ ఆర్డీఓగారూ కలిపి ఏంచేసారో?” అన్నాడు.

తేలుకుట్టిన దొంగలా వెంకట్రావు స్వరాన్ని తగ్గిస్తూ “మీకు ఎవరు చెప్పారు?” అని అడిగాడు.

దస్తగిరి ఏమాత్రం తడుముకోకుండా “మా జిల్లా రిపోర్టర్ అశోక్‌వర్ధన్ చెప్పారండి” అన్నాడు.

“అక్కడి వరకూ ఈ విషయం వెళ్లిపోయిందా? ” అని ఆందోళన నిండిన స్వరంతో వెంకట్రావు ఆదుర్దాగా అడిగాడు.

“ఈ విషయం అందరికీ తెలిసిపోయిందని చెబితే వెంకట్రావు నుంచి పెద్దగా వర్కవుట్ కాకపోతుందేమోనన్న ” అనుమానం విలేకరులకు వచ్చేసింది.

వెంటనే దస్తగిరి తెలివిగా “కేవలం మా జిల్లా రిపోర్టర్ ఒక్కరికే తెలిసింది. ఆయనకింకా ఈ విషయంలో పూర్తి వివరాలు తెలియదు. జస్ట్ అవునా? కాదా? తెలుసుకోమని నాకు చెప్పారంతే”

“అలాగా! ఐతే అలాంటిది ఏమీ లేదని చెప్పేయండి చాలు. మీకు ఏది కావాలంటే అది చేద్దాం”

“ఏం చేద్దామంటారు?” అడిగాడు త్రిలోచనరావు.

“మీ ఇష్టం…మా పరిధిలో సాధ్యమయ్యేది చెప్పండి. తప్పకుండా చేద్దాం”

“ఏమీ లేదండీ మాకు ఒక్కొక్కరికి ఐదు సెంట్ల చొప్పున ఇళ్ల స్థలాల పట్టాలు ఇవ్వండి. జెడ్‌సీసీ కంపెనీని ఒప్పించి ఐదు లక్షల రూపాయలు క్యాష్ ఇప్పించండి” చెప్పాడు త్రిలోచనరావు.

“క్యాష్ విషయం ఆర్డీఓ గారితో మాట్లాడిస్తాను. నా పరిధిలో ఇళ్ల స్థలాలు మూడు సెంట్లు మించి ఇవ్వకూడదనుకుంటా. ఆర్డీఓ గారితో మాట్లాడి చెబుతాను ” అన్నాడు వెంకట్రావు.

“ఇప్పుడే మాట్లాడండి..ఆర్డీఓ గారితో ” అన్నారు విలేకరులు.

తహశీల్దార్ వెంకట్రావు వెంటనే ఆర్డీఓ నూకరాజుకు ఫోన్ చేసాడు.

“సార్! గుడ్‌మార్నింగ్ సార్! మన కొంపలు మునిగేటట్లున్నాయి ” స్వరంలో కొంత ఆందోళనని మిళితం చేస్తూ.

“ఏం జరిగింది..? మీ మండలంలో ఏమైనా ప్రాబ్లమ్సా? ” అట్నుంచి అడిగాడు ఆర్డీఓ నూకరాజు.

“మండలంలో కాదు సార్! మనకే ప్రాబ్లమ్ సార్! ఎలా తెలిసిందో చిత్తడిభూములను రికార్డుల్లో బీడుభూములుగా చూపించి థర్మల్ పవర్ ప్లాంటు వాళ్లకు ఇస్తున్నామని ”

“ఎవరికి తెలిసింది?”

“ఎవరికేమిటండీ…మా లోకల్ విలేకరులకు తెలిసిపోయింది”

“అయితే ఏం? వారిని ఏలాగోలా మానేజ్‌చేయండి”

“ఆ ప్రయత్నం లోనే ఉన్నాను సార్! వారు ఐదుగురున్నారు. ఒక్కొక్కరికి ఐదు సెంట్లు చొప్పున ఇళ్ల స్థలాలు ఇమ్మంటున్నారు. థర్మల్ పవర్ ప్లాంటు వాళ్ల దగ్గర నుంచీ ఒక్కొరికీ లక్ష రూపాయలు ఇప్పించాలని డిమాండ్ చేస్తున్నారు”

“సరే చేసేద్దాం...నీ జేబులోనిది గానీ...నా జేబులోనిది గానీ ఏమీ ఇవ్వం కదా! మనలో మన మాట రిపోర్టర్లు రెండులక్షల రూపాయల చొప్పున అడుగుతున్నారని ఆ జెడ్‌సిసివాళ్లతో చెబుతాను. రిపోర్టర్లకు ఐదు లక్షలు, నీకురెండు నాకుమూడు ఏమంటావు” అన్నాడు అవతల్నుంచి నూకరాజు అప్పుడే సరికొత్త ప్లాన్‌కు బీజం వేస్తూ.

వెంకట్రావుకు అప్పుడన్పించింది. నూకరాజు తనకంటే రెండాకులు ఎక్కువే చదివాడని ....అందుకే ఆర్డీఓ అయ్యాడు కాబోలు..ఈ లెక్కన కలెక్టర్ ఇంకెంత కలెక్షన్ చేసుకుంటాడా.....? అన్పించింది అతనికి.

“అలాగే సార్! మీరు చెప్పినట్లే చేద్దాం సార్! ” అన్నాడు ఆనందంగా వెంకట్రావు.

ఆర్డీఓ ఆటునుంచి ఫోన్ పెట్టేయగానే తన ఎదురుగా ఉన్న విలేకరులవైపు చూస్తూ

“ఆర్డీఓగారు మీరు చెప్పినట్లే చేద్దామన్నారు. మూడు రోజుల్లోగా క్యాష్ మీకు అందుతుంది. వారం రోజుల్లో హౌస్‌సైట్ పట్టాలు కూడా మీకు అందుతాయి. ఈ విషయం ఇంతటితో మర్చి పోండి. పొరపాటున కూడా ఎక్కడా కెలక్కండి” అంటూ రిక్వెస్ట్ చేసాడు.

“మీరు  ఇంత ఫ్రెండ్లీగా ఉంటామంటే మాకు అంతకంటేనా!” అంటూ విలేకరులు వెళ్లిపోయారు. వెంకట్రావు హామీ ఇచ్చినట్లు వారం రోజుల్లో వారికి చేరాల్సినవన్నీ చేరిపోయాయి.

××××                    ×××××                    ××××

త్రిముఖం పత్రికకు విశాఖపట్నం న్యూస్ఎడిటర్‌గా బాధ్యతలు తీసుకున్న కోటేశ్వర రావుకు ఆసంబరం పట్టుమని నెలరోజులు కూడా లేకుండా పోయింది.

అంతకు ముందు నిర్ణయించినట్లే మేనేజ్‌మెంట్ గురునాథ్‌ని న్యూస్ఎడిటర్‌గా విశాఖ పట్నం పంపించింది. దీంతో తన కలలన్నీ కల్లలైనట్లుగా ఫీలైపోయాడు కోటేశ్వరరావు.

విష్ణుప్రకాష్ మీద కోపం కూడా వచ్చేసింది. ఉండబట్టలేక ఫోన్లో అడిగేశాడు కూడా.

“ఏం..సార్! ఇలా చేసారు. నేను మీ మనిషిని. మీకోసం ఏం చేయడానికైనా సిద్ధంగా ఉన్నాను. మీకు కావలిసినవన్నీ పంపిస్తున్నాను కదా....అయినా ఆ గురునాథ్‌ని ఎందుకు పంపిం చారు ఇక్కడికి.....” అని ఆవేదనతో అడిగేశాడు.

దానికి విష్ణుప్రకాష్  సర్దిచెబుతున్నట్లుగా

"గురునాధ్ అక్కడికి పంపించనీయకుండా ఎన్నో ప్రయత్నాలు చేసాను. నీకు తెలుసు కదా. రిపోర్టర్ల విషయాలవరకైతే నా ప్రమేయం ఉంటుంది. డెస్కల వ్యవహారాల్లో మిగిలినవారు చూసుకుంటారు. ఎందుకనో ఎండీగారు పట్టుబట్టి అతనిని మీ యూనిట్‌కు పంపించారు. ఏం చేస్తాం చెప్పు..అలా జరిగిపోయింది" అన్నాడు.

"గురునాధ్ వ్యవహార శైలి ఎలా ఉంటుందో ....?" సందేహం వ్యక్తంచేసాడు కోటేశ్వరరావు.

"వ్యక్తిగతంగా చాలా సాఫ్ట్, మెతక మనిషి, పనికూడా అంతగా రాదు. పేజినేషన్ వంటి వాటిలో బాగా వీక్. పేరుకి అతను న్యూస్ ఎడిటర్ అయినా చక్రం తిప్పాల్సింది నీవే. ఏమీ టెన్షన్ పడాల్సిన పనిలేదు. అతనికి అన్నీ చెప్పి పంపిస్తున్నాను. నువ్వేం కంగారు పడకు" అని అభయ మిచ్చాడు విష్ణుప్రకాష్.

అతని మాటలతో కోటేశ్వరరావు కొంత తేరుకున్నాడు.

వడ్డించేవాడు మనవాడైతే ఎక్కడ కూర్చొంటే ఏం? కావాల్సినవన్నీ కాళ్ల దగ్గరకే వస్తాయి కదా... అని సర్దిచెప్పుకున్నాడు.

ఆరోజు సాయంత్రం మంత్రి ధర్మరాజుతో కలవాలని కోటేశ్వరరావుకు దయానిధి చెప్పిన విషయం గుర్తుకొచ్చింది.

××× ×××× ×××

విశాఖపట్నంలోని ఫైవ్‌స్టార్ హోటళ్లలో అదొకటి. అందులోని ఒక పెద్ద సూట్‌రూమ్‌లో ఉన్నాడు మంత్రి ధర్మరాజు.

ఆరోజు మధ్యాహ్నం నుంచీ ఎంగేజ్‌మెంట్లు ఏవీ పెట్టుకోకుండా ఆసూట్‌లో తినడం తాగడం మాట్లాడడం మాత్రమే పనిగా ఉన్నాడు.

ఆయనతో పాటు మరో ముగ్గురు వ్యక్తులు కూడా అక్కడున్నారు. వారిలో ఒకడు దయానిధి, మిగిలిన ఇద్దరూ జెడ్‌సీసీ కంపెనీ డైరెక్టర్లు దుర్గానంద్, లవకుమార్‌లు.

స్వామిపేటలో జెడ్‌సీసీ కంపెనీ ఏర్పాటు చేయబోయే థర్మల్ పవర్ ప్లాంటుకు ఎలాంటి అడ్డంకులు లేకుండా ఎవరిని ఎలా మేనేజ్ చేయాలన్నదానికే ధర్మరాజు ఆరోజు పూర్తి సమయాన్ని కేటాయించాడు. ఎందుకంటే అందుకుగాను ఈ పవర్‌ప్లాంటు వ్యవహారంలో వందకోట్ల రూపాయలు అందుతున్నాయి. అందువల్లే జిల్లాలో కొన్ని శంకుస్థాపనలను, ఓపెనింగులనూ వాయిదావేసి ఆరోజంతా జెడ్‌సీసీ కోసమే కేటాయించేసాడు ధర్మరాజు.

తాను హొటల్‌లో ఉన్నట్లు ఎవరికీ తెలియకుండా ఉండడానికి గాను తన సెక్యూరిటీని కూడా ఇంటిదగ్గరకు పంపించేసాడు. ఎలాగూ అనధికార పీఏలాంటి దయానిధి ఉన్నాడు కాబట్టి పీఏలను కూడా తనక్యాంపు ఆఫీసు దగ్గరే ఉంచేసాడు.

సాయంత్రం త్రిముఖం ఆఫీసుకు వెళ్లకుండానే కోటేశ్వరరావు మంత్రి ధర్మరాజు బసచేసిన హొటల్‌కి వెళ్లాడు.

ముందుగానే కోటేశ్వరరావుకు దయానిధితో పరిచయం ఉండడంతో రిసెప్షన్‌లోనే వారిద్దరూ కలుసుకున్నారు. సూట్ రూమ్‌లోకి తీసుకెళ్లి ధర్మరాజుతో కోటేశ్వరరావుకు పరిచయం చేసాడు.

ధర్మరాజును చూడగానే కోటేశ్వరరావు అతి వినయం ప్రదర్శిస్తూ "నమస్కారం సార్! ఇలా మీకు కలుస్తుండడం ఆనందంగా ఉంది" అన్నాడు.

"రండి రండి కూర్చోండంటూ " కోటేశ్వరరావుకు ఎదురుగా ఉన్న సోఫా చూపించాడు ధర్మరాజు.

సోఫాలో కూర్చొన్నాడు కోటేశ్వరరావు. ఉదయం నుంచీ ఏసీ అన్‌చేసి ఉంచడం వల్ల సూట్ రూమ్ బాగా చల్లగా ఉంది.

తన ఎదురుగా కూర్చొన్న కొత్త వ్యక్తులు ఇద్దరిని చూసి ఎవరు అన్నట్లు దయానిధిని కళ్లతోనే ప్రశ్నించాడు కోటేశ్వరరావు.

జెడ్‌సిసీ కంపెనీ డైరెక్టర్లు దుర్గానంద్, లవకుమార్‌లుగా వారిని దయానిధి పరిచయం చేసాడు కోటేశ్వరరావుకు.

పరస్పర పరిచయాలు అయ్యాక ఎదురుగా ఉన్న వైన్ బాటిళ్లను ఖాళీచేసేపనిలో పడ్డారు ముగ్గురూ.

పవర్ ప్లాంటు డైరెక్టర్లు మాత్రం ఎందుకనో మద్యం బాటిళ్ల జోలికిపోలేదు. పక్కనే ఉన్న స్టఫ్ తో సరిపెట్టుకున్నారు.

"అందరు లోకల్ రిపోర్టర్లని మేనేజ్‌చేసామండి. జిల్లా రిపోర్టర్లు కూడా చాలావరకూ మాకు ఫేవర్‌గానే ఉన్నారు. కానీ మీ పేపర్ స్టాఫ్ రిపోర్టర్ ఎవరో అశోక్‌వర్ధన్ అట. మనకి ఏమాత్రం కోపరేట్ చేయడం లేదండి" దుర్గానంద్ చెప్పాడు కోటేశ్వరరావుతో

"వాడికి కొంచెం తలబిరుసులెండి. వాడి నాన్న ఒకప్పుడు కొన్ని పత్రికలకు ఎడిటర్‌గా పని చేసాడు. అదీ వాడి బడాయి. అలా ఆయనే నీతినిజాయితీ అంటూ తనకొడుక్కి పాఠాలు చెప్పాడను కుంటున్నాను. అందుకే తానేదో పెద్ద నిజాయితీపరుడిలా ఫోజొకటి" అన్నాడు కోటేశ్వరరావు.

"అయితే ...మేమంతా అవినీతిపరులమా? గవర్నమెంటే పర్మిషన్ ఇచ్చింది పవర్‌ప్లాంటు పెట్టుకోవడానికి, ప్రభుత్వవిధానాలను అమలుచేసే అధికారం మినిష్టర్‌గారికి ఉంది. పవర్‌ప్లాంటు పెడితే ఎందరికో ఉద్యోగాలు వస్తాయి. ఇలాంటి పాజిటివ్ యాంగిల్స్ ఎన్నో ఉండగా.........మీ

అశోక్‌వర్ధన్ రైతులు, మత్స్యకారులకు మనుగడ ఉండదని, పొల్యూషన్ వచ్చేస్తుందని ఏదేదో రాస్తాడు ఎందుకు? మీవాళ్లు కూడా వెనకా ముందూ చూసుకోకుండా వాడు రాసింది రాసినట్లు ప్రింట్ చేసేస్తున్నారు. ” నిష్టూరంగా అన్నాడు దయానిధి.

కోటేశ్వరరావుకు అప్పటికే మత్తు తలకెక్కుతోంది.

“మా పవర్ ప్లాంటు వలన పొల్యూషన్ ఎందుకుంటుంది? మేము ఎవరూ చేయని విధంగా సూపర్ క్రిటికల్ టెక్నాలజీని పెడుతున్నాం” చెప్పాడు దుర్గానంద్.

“కోటేశ్వరరావ్ నువ్వు ఏంచేస్తావో నాకు తెలియదు. నీగురించి అన్ని విషయాలూ మా దయానిధి చెప్పినతర్వాతే నిన్ను ఇక్కడికి పిలిపించాను. ఆ పవర్ ప్లాంటు మనది. మన జిల్లాకే రాష్ట్రంలో ప్రెస్టేజ్ తీసుకొచ్చే విషయం. దానికి వ్యతిరేకంగా ఎలాంటి వార్తలు రానివ్వకుండా రాకుండా చూసుకో...నీకు ఏం కావాలంటే అది మనవాళ్లు ఇస్తారు. ” ఆదేశిస్తున్నట్లు చెప్పాడు ధర్మరాజు.

“స్వామిపేట ఏరియాలో ప్లాంట్ వ్యతిరేక కమిటీ బలంగా ఉందని తెలుస్తోంది...నిజం కాదా!” అడిగాడు కోటేశ్వరరావు.

“ఏం కమిటీ అండీ అది...? కొంతమంది మత్స్యకారులను వెంటేసుకుని వారికి మందుపోయించి మాకు ఇబ్బందులు కల్గించాలని చూస్తున్నారు. వారిలో కొందరు అంతకుమందు మాతో ఉన్నవారే” చెప్పాడు లవకుమార్.

“మరి మీతో ఉన్నవారైతే మీకు అనుకూలంగా ఉండాలి గానీ, పొల్యూషన్ విషయంలో ప్రజలతో కలిసి పోరాటం చేస్తున్నారు కదా?” మళ్లీ ప్రశ్నించాడు కోటేశ్వరరావు.

“వారి సంగతి మేము చూసుకుంటాం గానీ మీ విషయం చెప్పండి...ఏం చేయాలంటారు?” అన్నాడు దుర్గానంద్.

“మీ పవర్ ప్లాంటుకు వ్యతిరేకంగా వార్తలు రాకుండా చూడడంలో నాది పూర్తి హామీ. స్టాఫ్ రిపోర్టరేకాదు. అన్ని రకాల రిపోర్టర్లు రాసిన వార్తలనూ దిద్ది పేపర్లో పెట్టేది నేనే. నన్నే నేరుగా అప్రోచ్ అయ్యారు కాబట్టి ఆ భయం ఇకపై మీకు ఉండదు. అయితే నాకు పైనుంచి ప్రెజర్ రాకుండా చూసుకోండి. కొన్ని ఫోన్ నెంబర్లు మా పైవాళ్లవి మీకు ఇస్తాను. వారితో మీరు డీల్ చేసుకుని నా వరకూ కోటి రూపాయలు ఇవ్వండి. మిగిలిన పేపర్ల డెస్కల వాళ్లను కూడా మేనేజ్ చేసేస్తాను. మిగిలిన పేపర్లలో ప్లాంటుకు వ్యతిరేకంగా వార్తలు వచ్చి మా పేపర్లో రాకపోతే మా క్రెడిబులిటీ దెబ్బతింటుంది కదా!” చెప్పాడు కోటేశ్వరరావు.

దుర్గానంద్, లవకుమార్‌లు కొంత అనుమానంగా అది జరిగేపనేనా అన్నట్లు దయానిధి వైపు చూసారు.

"కోటేశ్వరరావు గారూ మీరు చెప్పింది బాగానే ఉంది. అయితే ఇంకెలాంటి ప్రారంభం జరగకుండా అంతసొమ్ము పేపర్లవారికి అందులోనూ ఒక్కరికే ఇవ్వడానికి కంపెనీ అంగీకరించక పోవచ్చు. పక్కనే ఉన్న కాకిపల్లిలో ఎలాంటి అడ్డంకులు లేకుండా పవర్‌ప్లాంటు పనులు జరిగిపోతు న్నాయి. వారంతా మీ హైదరాబాదుల్లోని హెడ్డాఫీసులలెవల్లోనే బాగా మేనేజ్ చేసేసారు. అందువల్ల ఎవరు ఎలాంటి ఉద్యమాలు చేసినా అవి ఏమాత్రం హైలెట్ కాకుండా అన్ని పేపర్లు ఛానళ్లు చేస్తు న్నాయి. కానీ మన జెడ్‌సీసీ వాళ్లు జిల్లాలోని మీడియావాళ్లకి ఎంతో కొంత సాయం అందించాలని ఇలా ముందుకు వచ్చారు. వీరు కూడా కాకిపల్లి పవర్‌ప్లాంటు వారిలాగా చేస్తే జిల్లాలో ఉన్న మన లాంటి వారందరికీ మిగిలేది చిప్పే" వివరించాడు దయానిధి.

తమలో తాము కొంతసమయం తర్కించుకున్నాక దుర్గానంద్, లవకుమార్‌లు ఒక నిర్ణయానికి వచ్చారు. మొదటి విడత యాభై లక్షల రూపాయలు ఇవ్వడానికి, ప్లాంటు పనులు ప్రారంభించే సమయంలో మిగతాసొమ్ము ఇవ్వడానికీ అంగీకారం కుదిరింది.

మంత్రి ధర్మరాజు పీఏ సర్వేశ్వరరావు ద్వారా యాభై లక్షల రూపాయలు పెద్ద బ్యాగ్‌లో కోటేశ్వరరావు ఇంటికి ఆమరుసటి రోజే చేరిపోయాయి.

అంతవరకూ మీటర్ దూరానికి లీటరు పెట్రోలు తాగేసే డొక్కు మోటారుసైకిల్ నడుపుతున్న కోటేశ్వరరావు తనకు సొమ్ము అందగానే ఒక కారు కొనేశాడు. మిగిలిన సొమ్ముతో బంగారం కొన్నాడు. ఇక తనకు ఈ దిక్కుమాలిన సబ్ఎడిటర్ ఉద్యోగం లేకపోయినా వెనుదిరిగి చూడాల్సిన అవసరం లేదనే నిర్ణయానికి వచ్చేసాడు. అయితే అక్రమసంపాదనకు ఇలాంటి బంగారు బాతు లాంటి పత్రికా ఉద్యోగం ఎందుకు వదులుకోవాలన్న ఆలోచనతో ఆపరిస్థితి వచ్చినపుడు చూద్దాంలే ..అనుకున్నాడు.

××××　　　　××××　　　　××××

కాకిపల్లి, స్వామిపేట థర్మల్ పవర్ ప్లాంట్లకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు ఊపందుకుంటు న్నాయి. ఆ నేపథ్యంలో జ్యోతిర్మయి తరుచూ అశోక్‌వర్ధన్‌ని కలుసుకుంటూ ఉంది.

త్రిముఖంతో సహా మిగిలిన అన్ని పత్రికలూ కాకిపల్లి పవర్‌ప్లాంట్ ఉద్యమంపై వార్తలు ఇవ్వడం క్రమేపీ తగ్గించేసాయి. న్యూస్‌ఛానళ్లలో కూడా ఆ పవర్ ప్లాంటుకు వ్యతిరేకంగా ఏవీ వార్తలు రావడం లేదు. స్వామిపేట పవర్‌ప్లాంటు యాజమాన్య ప్రతినిధులు లోకల్‌రిపోర్టర్లతో డీల్ కుదుర్చు కుని హెడ్డాఫీసుల్లో పనిచేసేవారిని సంతృప్తి పర్చకపోవడంతో వ్యతిరేకకథనాలు బాగా వస్తున్నాయి .

అయితే కోటేశ్వరరావు మంత్రి ధర్మరాజు సమక్షంలో పవర్‌ప్లాంటు డైరెక్టర్లతో ఒప్పంద కుదుర్చుకోవడంతో త్రిముఖం లోకల్ ఎడిషన్లలో స్వామిపేట పవర్‌ప్లాంటుకు వ్యతిరేకంగా వార్తలు రావడం తగ్గింది. తక్కిన పత్రికల్లో స్వామిపేట పవర్‌ప్లాంటుపై బాగా వార్తలు వస్తూ తమపత్రికలో తగ్గిపోవడంపై న్యూస్ఎడిటర్ గురునాధ్‌కు అనుమానం వచ్చింది.

అదే విషయాన్ని కోటేశ్వరరావు దగ్గర మాటల సందర్భంలో నెమ్మదిగా ప్రస్తావించాడు.

వెంటనే కోటేశ్వరరావు ఏమాత్రం తడుముకోకుండా “ఏముందండీ...? మన స్టాఫ్ రిపోర్టర్‌కి అవగాహన లేదు. ఏదో రాసి పంపించేస్తుంటాడు. రేపు ఏవైనా లీగల్ ప్రాబ్లెమ్స్ వస్తే మీరు, నేనూ, మేనేజ్‌మెంటూ ఇరుక్కుంటాము.” అని చెప్పి భయపెట్టాడు.

“థర్మల్ పవర్‌ప్లాంట్ అక్కడ కట్టడం వల్ల ఎంతోమందికి ఉద్యోగాలు వస్తాయండి. ఇక పొల్యూషన్ అంటారా? మనం పీలుస్తున్నది స్వచ్ఛమైన గాలేనా? తాగుతున్నది పరిశుభ్రమైన మంచి నీరేనా? మన వాతావరణమంతా ఎప్పుడో కలుషితమైపోయిందండి. దాంతో పోలిస్తే ఈ థర్మల్ పవర్ ప్లాంట్ పొల్యూషన్ సముద్రంలో కాకిరెట్టంత కూడా ఉండదు. ఇక మీరు ఆ విషయం మర్చి పోండి” అని సర్ధిచెప్పాడు.

కోటేశ్వరరావు తనకు పవర్‌ప్లాంట్‌వాళ్లు ఇచ్చిన సొమ్ముతో ఒక ఎల్ఈడీ టీవీ, ఫ్రిజ్, వాషింగ్ మెషీన్‌లు కొనేసి గురునాథ్ ఇంటికి పంపించేశాడు. అంతే న్యూస్ ఎడిటర్ గురునాథ్ నోరు కూడా మూతపడి పోయింది.

స్వామిపేట థర్మల్ ప్లాంట్‌కు వ్యతిరేకంగా ఉద్యమం కూడా అదే స్థాయిలో రాజుకుంటోంది. అశోక్‌వర్ధన్ ఎన్ని వార్తలు రాసినా అవి డెస్క్‌లోనే మాయమై పోతున్నాయి. ఈలోగా పవర్‌ప్లాంట్ నుంచి పేపర్‌కి అడ్వర్టైజ్‌మెంట్లు కూడా బాగా వచ్చాయి. వాటిని అడ్డం పెట్టుకుని పవర్‌ప్లాంట్ వల్ల ప్రయోజనాలు ఉంటాయని అనుకునేవిధంగా కథనాలు రాయాలని అశోక్‌వర్ధన్‌పై ఒత్తిళ్లు పెరిగి పోయాయి.

మరోపక్క జ్యోతిర్మయి సహా థర్మల్ ప్లాంట్‌కు వ్యతిరేకంగా నిరసన తెలుపుతున్న వారు హైదరాబాద్‌లో త్రిముఖం ఎడిటర్ శ్రీకాంత్‌చార్యులని కలవడానికి వెళ్లారు. ఆరోజు ఆయన సెలవులో ఉండడంతో విష్ణుప్రకాష్‌ని వారంతా కలిశారు.

తనకి తెలియకుండానే ఆ యూనిట్‌లో అన్ని రకాల ఆర్ధిక లావాదేవీలు జరిగిపోతున్నాయని తెలిసి విష్ణుప్రకాష్ నిర్ఘాంతపోయాడు. తనకి ఏ పాపంపుణ్యం తెలియదని గరునాథ్ ఎంత మొత్తు కున్నా విష్ణుప్రకాష్ వినిపించుకోలేదు. ఈ వ్యవహారం మరింత ముదిరితే తన మెడకు చిక్కుకుంటు ందని గమనించిన కోటేశ్వరరావు తనకు పవర్‌ప్లాంట్‌వాళ్లు ఇచ్చిన సొమ్ము నుంచి లక్షరూపాయలు

విష్ణుప్రకాష్ పర్సనల్ అకౌంట్లో వేశాడు. అక్కడితో ఈ సమస్య ముగిసిపోయిందని కోటేశ్వర రావు అనుకున్నాడు. అయితే అతడనుకున్నట్లు జరగలేదు.

థర్మల్ నిరసనకారులు ఆ తర్వాత ఎడిటర్ శ్రీకాంతాచార్యులను, ఎండి రామకోటిని కలిసారు. స్వామిపేట థర్మల్ పవర్ప్లాంట్కు వ్యతిరేకంగా తామంతా చేస్తున్న ఉద్యమానికి మీ పేపర్, ఛానల్ అంతగా సపోర్ట్ చేయడం లేదని ఫిర్యాదు చేశారు. దీనిపై రామకోటి విష్ణుప్రకాష్ను నిలదీయడంతో అప్పటికీ కోటేశ్వరరావుతో మిలాఖత్ అయిన అతడు నెపాన్ని అశోక్వర్ధన్పై నెట్టే శాడు.

"అక్కడ మన వాళ్లు చెబుతున్నదానిని బట్టి స్టాఫ్ రిపోర్టర్ అశోక్వర్ధన్ పవర్ప్లాంట్ వాళ్లతో కుమ్మక్కై పోయాడని తెలుస్తోంది" అని రామకోటికి చెప్పాడు.

దీంతో రామకోటి ఆగ్రహంతో "అలాంటి వాడు మనకెందుకు ఒక షోకాజ్ నోటీస్ ఇచ్చి తీసేయండి" అంటూ చెప్పేశాడు. అయితే ఆ పని చేయలేకపోయాడు విష్ణుప్రకాష్.

థర్మల్ పవర్ప్లాంట్ వాళ్లు ఇచ్చిన సొమ్ముతో కోటేశ్వరరావు ద్వారా కొంత అందుకుని ఉన్నందున అశోక్వర్ధన్ జోలికి వెళ్తే తిరిగి తమ మీదకే ఎమైనా వస్తుందేమోనని సందేహించాడు విష్ణుప్రకాష్ .

అంతకు ముందే కాకిపల్లి పవర్ప్లాంట్ ప్రతినిధులు తమలో డీల్ కుదుర్చుకోగా స్వామిపేటలోని జెడ్సిసి పవర్ప్లాంట్ వాళ్లు ఏమీ పట్టించుకోకపోవడం రామకోటిలో అసహనం రేపుతోంది.

"ఆ పవర్ప్లాంట్కు వ్యతిరేకంగా వార్తలు ఎక్కువగా ఇవ్వండి. వారు ఎలా మనదారికి రారో నేను చూస్తాను" అంటూ హుకుం జారీ చేసాడు.

అక్కడితో ఆగకుండా "అక్కడ న్యూస్ ఎడిటర్గా ఉన్న గురునాథ్కు ఏమి చేతకాదయ్యా! వెంటనే అతనిని మార్చి మరొకరిని అక్కడ అపాయింట్మెంట్ చేయండి" అని ఆదేశించాడు రామకోటి.

అంతే గురునాథ్ న్యూస్ఎడిటర్ స్థాయినుంచి సబ్ ఎడిటర్గా రివర్షన్ మీద హైదరాబాద్ ఆఫీసుకు వెళ్లిపోవడం. అక్కడి నుంచి బిక్షపతి కొత్త న్యూస్ఎడిటర్గా విశాఖపట్నం యూనిట్ ఆఫీసు లో జాయిన్ కావడం చకచకా జరిగిపోయాయి.

xxx xxxx xxxx

బిక్షపతి త్రిముఖం పత్రిక న్యూస్ఎడిటర్గా వచ్చీరావడంతోనే అశోక్వర్ధన్ను పిలిచి రిపోర్టర్లతో మీటింగ్ ఏర్పాటు చేయమన్నాడు.

"తాను అందరికన్నా స్ట్రిక్ట్‌గా ఉంటానని, ఈ యూనిట్‌ని అంతా అస్తవ్యస్థంగా మార్చేయడం తో ఎడిటర్‌గారు తనని ప్రత్యేకంగా చక్కదిద్దడానికి పంపించారని" రిపోర్టర్ల సమావేశంలో ఊదర గొట్టాడు బిక్షపతి.

ఆ తర్వాత డెస్కుల్లో ఉన్న సబ్‌ఎడిటర్లతో మరొక సమావేశం పెట్టాడు.

"తాను చండశాసనుడినని, ఏ చిన్నపొరపాటు జరిగినా క్షమించేది లేదని" బిక్షపతి అందరికీ హుకుంజారీ చేసాడు.

"తనకు జిల్లాలోని అన్ని ప్రాంతాలూ తెలియాల్సిన అవసరం ఉందని, అందుకని రోజుకో మండలానికి వెళ్దాం" అని అశోక్‌వర్ధన్‌ను సతాయించడం ప్రారంభించాడు.

"వార్తల పనిమీద తప్పా వృధాగా కాలక్షేపం కోసం, మండలాలు, మున్సిపాలిటీలు తిరగడం తనకు నచ్చదని, దానివలన మంచి వార్తలు ఇవ్వడానికి సమయం కూడా చాలదని" అశోక్‌వర్ధన్ చెప్పాడు బిక్షపతితో.

"నాలుగు గోడల మధ్యే కూర్చొంటే మంచి వార్తలు ఎలా వస్తాయి...?" అంటూ ఎదురుప్రశ్న వేసాడు బిక్షపతి.

ఆ ప్రశ్నకు అశోక్‌వర్ధన్ సమాధానం ఇవ్వలేదు.

గత్యంతరం లేని పరిస్థితిలో బిక్షపతి కొంతమంది రీజనల్ సెంటర్ల ఇన్‌ఛార్జ్‌లకు ఫోన్లు చేసి ఏఏ ప్రాంతాలకు తాను ఎప్పుడు వస్తున్నదీ చెప్పాడు.

కాకిపల్లి ప్రాంతంలో థర్మల్ పవర్ ప్లాంటుపై అప్పటికే రగడ జరుగుతుండడంతో అదేమిటో పూర్తిగా తెలుసుకోవడానికి తాను అక్కడికివస్తున్నానని లోకల్ రిపోర్టర్ జ్ఞానప్రసాద్‌కు ఫోన్‌చేసి చెప్పాడు.

జ్ఞానప్రసాద్ మహదానందపడిపోతూ "రండిసార్! మీకోసం ఎదురు చూస్తూ ఉంటాను " అంటూ ఫోన్లోనే స్వాగతం పలికాడు.

ఆ మరుసటి రోజే బిక్షపతి కాకిపల్లి వెళ్లాడు. అక్కడ థర్మల్ ప్లాంటు పనులను చేయిస్తున్న రవిచంద్రని జ్ఞానప్రసాద్ సాయంతో వెళ్లి కలిసాడు. తాను త్రిముఖం పత్రికకు కొత్తగా వచ్చిన న్యూస్‌ఎడిటర్ అని అని పరిచయం చేసుకున్నాడు.

రవిచంద్ర కొంత నిర్లక్ష్యంగా "ఐతే...ఏంటీ?" అన్నట్లు కళ్లెగరేస్తూ చూసాడు బిక్షపతి వైపు.

"తామిప్పటికే హైదరాబాద్‌లోని అన్ని మీడియాల హెడ్డాఫీసులవారికి కలిసొచ్చేసామని, వారికి ఇవ్వాల్సిందంతా ఇచ్చేసామని లోకల్‌గా చేయడానికేం లేదని" సూటిగా చెప్పేసాడు రవిచంద్ర.

బిక్షపతి కొంత అయోమయంలో పడినా అంతలోనే సర్దుకుని "మా హెడ్డాఫీసుల్లోని పెద్దవాళ్లు అడిగినంత కాకపోయినా ఎంతో కొంత లోకల్‌గా కూడా మీరు ఇస్తే బాగుంటుంది. మీకు తెలియ నిది ఏముంది? మా ఖర్చులు మాకుంటాయి కదా!" అని బతిమాలేధోరణికి దిగాడు.

వీడు ఇప్పట్లో తనని విడిచిపెట్టేలా లేడని ఆతనిని ఏవగింపుగా చూసాడు రవిచంద్ర. అతని పక్కనే రిపోర్టర్ జ్ఞానప్రసాద్ ఉండడంతో "చెప్పండి ఏం చేద్దామంటారు?" అన్నాడు అయిష్టంగా.

"నెలకు పాతికవేల రూపాయల చొప్పున మాకు ఇవ్వండి. మీమీద ఈగవాలకుండా చూసుకుంటాం. మీ ప్లాంటుకు వ్యతిరేకంగా ఏమి జరిగినా పేపర్లో రాకుండా చూసుకుంటాం...." అభయమిస్తున్నట్లు చెప్పాడు బిక్షపతి.

"ఆ హామీని మీ హెడ్డాఫీసు వాళ్లు ఎప్పుడో ఇచ్చారు. లోకల్‌గా ఉన్న జనం ప్లాంటుకు అనుకూలంగాఉండేలా చేయడానికి వార్తలు, స్టోరీలు ఇవ్వండి అదిచాలుమాకు" అన్నాడు రవిచంద్ర.

వెంటనే ఎవరితోనో అతడు ఫోన్లో మాట్లాడాడు. అవతలివారు చెప్పింది విని కాల్ కట్ చేసిన తర్వాత జ్ఞానప్రసాద్‌ని దూరంగా తీసుకెళ్లి కొంతసేపు అతనితో మాట్లాడాడు రవిచంద్ర.

"మా వాళ్లు నెలకు పదిహేను వేల రూపాయలివ్వడానికి ఒప్పుకున్నారు. అయితే అందులో పదివేలు ఆయనకి, ఐదు వేలు నీకు ఇవ్వాలని నేను అనుకుంటున్నా" అన్నాడు.

జ్ఞానప్రసాద్ ముఖం ఒక్కసారి ట్యూబ్‌లైట్‌లా వెలిగిపోయింది.

"థాంక్స్ సార్! అలాగే కానివ్వండి " అన్నాడు ఆనందంగా.

రవిచంద్ర తిరిగి బిక్షపతి దగ్గరకు వచ్చి "మా వాళ్లతో మాట్లాడి వారిని ఒప్పించాను. అయితే నెలకు పదివేలకు మించి ఇవ్వడానికి అంగీకరించడం లేదు" అని చెప్పాడు.

ఏమనాలో తెలియక "సరే మీ ఇష్టం" అన్నాడు బిక్షపతి.

"ప్రతినెలా ఒకటి రెండుతేదీల్లో ఆఎమౌంట్ అందాలి" తన అంగీకారాన్ని తెలిపాడు బిక్షపతి రవిచంద్రకు.

"తప్పకుండానండీ...మీ లోకల్ రిపోర్టర్ జ్ఞానప్రసాద్‌కు ఆ ఎమౌంట్‌ను ఇచ్చేస్తాం. నెలనెలా అది ఒకటి రెండు తేదీల్లో మీకు చేరిపోతుంది" చెప్పాడు రవిచంద్ర.

"అయితే ఓకేనండీ...మళ్లీ కలుద్దాం" అని చెప్పి అక్కడినుంచి బిక్షపతి,జ్ఞానప్రసాద్‌లు బయలుదేరారు.

మరికొంతమంది రాజకీయనాయకులను, కాంట్రాక్టర్లనీ, ఇరిగేషన్ ఇంజనీర్లనీ పరిచయం చేయమని జ్ఞానప్రసాద్‌తో చెప్పాడు బిక్షపతి.

జ్ఞానప్రసాద్ తనకు తెలిసిన కొంతమంది కాంట్రాక్టర్లనీ లోకల్ లీడర్లనీ బిక్షపతికి పరిచయం చేసాడు. వారిఫోన్ నెంబర్లని తీసుకున్నాడు బిక్షపతి. ఎప్పటికప్పుడు తాను వారితో టచ్ లో ఉంటానని, వారిపై ఎలాంటి వ్యతిరేకవార్తలు వచ్చినా ఆవిషయాన్ని ముందుగానే వారికి చెబుతానని హామీ ఇచ్చాడు. ఒక్కొక్కరి దగ్గరనుంచి ఐదువేల రూపాయలచొప్పున జ్ఞానప్రసాద్ సాయంతో కలెక్షన్ చేసాడు బిక్షపతి.

అలా మరికొంతమంది దగ్గరికి తిరిగి మధ్యాహ్నం రెండున్నర గంటలకు త్రిముఖం పత్రిక ప్రాంతీయ కార్యాలయానికి చేరారిద్దరూ.

“సార్! మీకోసం లంచ్ ఏర్పాటు చేసాను. అన్ని రకాల నాన్‌వెజ్ ఐటమ్స్ స్పెషల్‌గా తయారు చేయించాను సార్!” అంటూ జ్ఞానప్రసాద్ అతివినయాన్ని ఒలకబోస్తూ హడావిడి చేస్తుండడంతో బిక్షపతికి తనకు అతడిస్తున్న ప్రత్యేకగుర్తింపుకి ఎంతో గర్వంగా అన్పించింది.

తానేదో మహారాజులా తనముందు వినయాన్ని ప్రదర్శిస్తున్న జ్ఞానప్రసాద్ సామంతరాజులా కన్పించాడతనికి.

“లంచ్ చేసేముందు…మీరేమీ అనుకోకపోతే ఫారిన్ వైన్ ఉంది…కొంచెం తీసుకుందురుగాని ..హాయిగా ఉంటుంది” అన్నాడు జ్ఞానప్రసాద్.

ఫారిన్ సరుకు అనేసరికి బిక్షపతికి నోరూరిపోయింది. అయితే ఆ ఆనందాన్ని బయటకు కన్పించనీయకుండా “ఎందుకయ్యా! మరీ మొహమాటపెట్టేస్తున్నావ్! సరే నీ ముచ్చట నేనెందుకు కాదనాలి..ఏదో నీసంతృప్తి కోసం తీసుకుంటున్నా” అంటూ బెట్టు చేస్తున్నట్లు నటించి ఐదు పెగ్గులు లాగించేసాడు.

ఆ తర్వాత తాపీగా లంచ్ చేసి తిరిగి విశాఖపట్నం వెళ్లిపోయాడు. ఆరోజంతా ఫీల్డు డ్యూటీలో ఉన్నట్లు చూపించేసి ఆఫీసుకి ఎగ్గొట్టేసాడు.

జ్ఞానప్రసాద్‌లాంటి రిపోర్టర్లు ఏఏ మండలాలలో ఉన్నారో గుర్తించి వారిని గుప్పిట్లో పెట్టుకుంటే నెలకు ఓలక్ష రూపాయలవరకూ ఆదాయానికి ఢోకా ఉండదనే ఉత్సాహంతో బిక్షపతి ఆలోచిస్తున్నాడు.

×××× ×××× ×××

“హాయ్…ఆశోక్ ఏం చేస్తున్నావ్?” అంటూ తన గదిలోకి వచ్చిన జ్యోతిర్మయిని చూసి పలకరింపుగా నవ్వాడతడు.

జ్యోతిర్మయితో పరిచయం, స్నేహం అశోక్‌వర్ధన్‌లో కొత్త ఉత్సాహాన్ని తీసుకొచ్చాయి.

పత్రికావృత్తిపరంగా ఎన్నిరకాల వత్తిళ్లు ఎదుర్కోవలసి వస్తున్నా అవన్నీ జ్యోతిర్మయి స్నేహంతో మరిచిపోగలుగుతున్నాడు.

వారిద్దరి మధ్యే కాదు, ఇరు కుటుంబాల మధ్య కూడా వారి స్నేహం విస్తరించింది. వారి తండ్రులు సూర్యప్రసాద్, సత్యనారాయణలు కూడా మంచి మిత్రులైపోయారు.

మంచి మంచి పుస్తకాలు చదువుకోవడం. సాహిత్య సామాజిక అంశాలపై చర్చించుకోవడం వారికి నిత్యకృత్యమైపోయింది. పరస్పరం రెండిళ్ల మధ్య రాకపోకలు కూడా పెరిగాయి.

అలాంటి సందర్భంలోనే ఆరోజు అశోక్‌వర్ధన్ ఇంటికి వచ్చింది జ్యోతిర్మయి అతనిని పలకరించడానికి.

"జ్యోతీ నువ్వా ఎలా ఉన్నావ్?" ప్రశ్నించాడు ఆమెను.

"మేము బాగానే ఉన్నాం...నువ్వేమిటి ఏదో సీరియస్‌గా ఆలోచిస్తున్నట్లున్నావు"

"అంత లేదులే..ఏమీ చించడం లేదు"

"ఎందుకు చించడం లేదు. మీ పెట్టుబడిదారీ మేనేజ్‌మెంట్‌కు ఇంకా అధికంగా ఆదాయం సమ కూర్చాలంటే ఏంచేయాలా? అని ఆలోచిస్తున్నావా?"

"నీతో ఎల్లప్పుడూ ఇదే ప్రాబ్లమ్. మధ్యలో మా మేనేజ్‌మెంటుతో నీకేం పనిలే...ఇంకేమిటి కబుర్లు?"

"నిన్ను నాతో అలా బయటకు తీసుకెళ్దామని వచ్చా "

"ఆమ్మో...నీతో బీచ్‌కో పార్క్‌కో వచ్చి టైమ్‌పాస్ చేసే తీరిక నాకు లేదు..నన్నీ సారికి వదిలి పెట్టేసేయ్"

"మహానుభావా...నీతో సినిమాలకు, షికార్లకు, తిరిగేటంత టైమ్ నాకు కూడా లేదు."

"చెప్పు...ఎక్కడికి రావాలో ...ఏం చేయాలో శెలవివవ్వండి" అన్నాడు వ్యంగ్యంగా.

"నీకు ఆ వెటకారాలే వద్దన్నది. ఏదీ పూర్తిగా వినవు మధ్యలో మాట్లాడకుండా ఆగవు" అంది చిరుకోపంతో.

"సరే ఏమిటో చెప్పు. ప్రశాంతంగా వింటాను"

"అదీ బుద్ధిమంతుడి లక్షణం. ఇంతకీ నేనొచ్చిన పనేమిటంటే నిన్ను స్వామిపేట తీసుకువెళ్దామని " అసలు విషయం చెప్పింది జ్యోతిర్మయి.

"స్వామిపేటా...నేను చాలా సార్లు వెళ్లొచ్చాను...ఇప్పుడు ఎందుకు అక్కడికి?" మళ్లీ కోపమొచ్చేసింది జ్యోతిర్మయికి

"ఏమీ తెలియనట్లు అమాయకంగా మాట్లాడుతావేం? అక్కడ పెట్టబోయే థర్మల్ పవర్ ప్లాంటుకు వ్యతిరేకంగా జరుగుతున్న ఆందోళనలను ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి" అంది.

“నీలాంటోడెవడో అన్నాడట..ఆలూ లేదూ చూలూ లేదు..కొడుకు పేరు సోమలింగం అని”
“పాత చింతకాయపచ్చడి లాంటి సామెతలను నీదగ్గరే ఉంచుకో ...ప్రజల ఆందోళనలను ఒక్కసారి వచ్చి చూడు”

“కాకిపల్లిలో థర్మల్‌పవర్‌ప్లాంటును కట్టుకుంటున్నా మీ ఆందోళనలూ,ఉద్యమాలూ ఏవీ పనిచే యడం లేదు. స్వామిపేటలో ఇంకా ఏ పనీ మొదలుకాకుండానే మీ హడావిడి ఏమిటి?”

“అంటే నీ ఉద్దేశం ఏమిటి? వాళ్లు ప్లాంటు కట్టినతర్వాత తీరిక చూసుకుని ముహూర్తాలు చూసి ఆందోళనలు మొదలుపెట్టాలంటావా?” తీవ్రస్వరంతో అడిగింది జ్యోతిర్మయి.

“నా ఉద్దేశం అదికాదు...జ్యోతీ! నా మాటలను నీవు అపార్థంచేసుకున్నట్టున్నావు. నేను మీ ఉద్యమా న్ని తప్పు పట్టడం లేదు. స్వామిపేటలో ఆందోళనలను నిర్వహించడం ఎంత అవసరమో, కాకిపల్లి ప్లాంటుకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నడపడం అంతకు రెట్టింపుఅవసరమన్న విషయాన్ని గుర్తిం చాలని”

“సరే ఉద్యమాల మాట అలా ఉంచు. కాకిపల్లి పవర్‌ప్లాంటుకు వ్యతిరేకంగా ఒక్కవార్త నువ్వుగానీ, మీ లోకల్ రిపోర్టర్లుగానీ రాయడం లేదు. మీ పేపర్లో రావడం లేదు. దీని వెనుకున్న కారణమేమిటో నీకు తెలియదా? ”

“ఏమో అదంతా పైనున్నవాళ్ల ఇనస్ట్రక్షన్స్. మేమంతా వారి దగ్గర జీతానికి పనిచేస్తున్నాం. ఒక విధంగా చెప్పాలంటే నువ్వుచెప్పేటట్లు పెంపుడు జంతువులం. వారు ఎలా ట్రైనింగ్ ఇచ్చి ఏం చేయాలని చెబితే అది చేయాల్సిందే”

“అలా తప్పించుకునేటట్లు మాట్లాడకు. అందులో నీకు కూడా భాగస్వామ్యం ఉన్నట్లే. మీ పత్రిక తీసుకునే నిర్ణయాలను అమలు చేసే బాధ్యత నీకుకూడా ఉంది కదా అలాంటప్పుడు భాగస్వామ్యం లేకపోవడం ఏమిటి? అలాఅయితే ఆనిర్ణయాలకు వ్యతిరేకంగా ఎందుకు మాట్లాడవు ? అంటే కారణాలు ఏవైనా కార్పొరేట్ కంపెనీలకు వత్తాసుపలికి ప్రజాందోళనని పట్టించుకోని పత్రికకు నీవు మద్దతు ఇస్తున్నట్టే” ఆవేశంగా అంది జ్యోతిర్మయి.

“సరే నీతో వాదనలు ఎందుకుగానీ ఎప్పుడు స్వామిపేట వెళ్దామో చెప్పు? ” అడిగాడు అశోక్‌వర్ధన్.

“ఎప్పుడో ఏమిటి? రేపే ఉదయం...... తొమ్మిది గంటలకు అక్కడుండాలి”

“ఏమిటో విశేషం?”

“నీకు నిజంగా తెలియదా? తెలిసే అడుగుతున్నావో ...అర్థం కావడం లేదు”

“సరే నాకేమీ తెలియకే అడుగుతున్నాననుకుని వివరంగా చెప్పు”

“జాతీయస్థాయి పర్యావరణ ఉద్యమకారులతో సదస్సు జరుగుతుంది. ఈ సదస్సుకు ఎలాగూ మీ లోకల్ ప్రెస్ వస్తుంది. నీవు కూడా వస్తే బాగుంటుందని నామాటగా చెప్పడానికి వచ్చా”

“అవును.....నేను తప్పకుండా వస్తా....రేపే మార్నింగ్ బయలుదేరుదాం”
“థ్యాంక్స్” అంది జ్యోతిర్మయి.

×××× ×××× ××××

జ్యోతిర్మయి, అశోక్‌వర్ధన్‌లు స్వామిపేట చేరుకునేసరికి ఉదయం పది గంటలైంది. వారిద్దరూ బస్‌లో దిగారు.

అప్పటికే అక్కడ పర్యావరణ ఉద్యమకారులు పలువురు చేరుకుని ఉన్నారు. వారంతా అంతకు ముందే థర్మల్ పవర్ ప్లాంటు నిర్మించబోయే పరిసర ప్రాంతాల ప్రజలతో మాట్లాడి వచ్చారు. సభావేదిక ప్రాంగణమంతా కిక్కిరిసిపోయింది.

సాధారణంగా రాజకీయనాయకుల సభలకు బిర్యానీలు పంచి, బీరు బాటిళ్లు అందించి, సొమ్ము చేతిలోపెట్టి, బస్సులు పంపిస్తేగానీ జనం వచ్చే పరిస్థితి లేదు. అలాంటిది స్వామిపేట విద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా జరుతున్న సభకు వేల సంఖ్యలో ప్రజలు స్వచ్ఛందంగా తరలివచ్చారు.

అది చూసి అశోక్‌వర్ధన్ “ఇంత వ్యతిరేకత ఉందా!” అని విస్తుపోయాడు.

థర్మల్ ప్లాంటుకు వ్యతిరేకంగా పనిచేసే పర్యావరణ కమిటీ, జ్యోతిర్మయి లాంటి ప్రజాహక్కుల ఉద్యమకారుల కృషిని మనసులోనే అభినందించకుండా ఆగలేకపోయాడు.

“ఇలాంటి పర్యావరణస్పృహ ఈ దేశంలోని అన్ని ప్రాంతాలవారికి కలిగితే కార్పోరేట్ కంపెనీలు, బడా పెట్టుబడిదారులు, ప్రకృతి వనరులను దోపిడీచేయాలనుకునేవారు తట్టాబుట్టా సర్దుకుని ఈ దేశం నుంచి వెళ్లిపోవాల్సిందే ” అని అనుకున్నాడు. అదేవిషయాన్ని జ్యోతిర్మయితో కూడాఅన్నాడు.

ఆసభకు వచ్చినవారంతా జాతీయస్థాయిలో గుర్తింపు పొందిన పర్యావరణ ఉద్యమకారులు. వారు మాట్లాడేది ఇంగ్లీష్,హిందీ అయినా ప్రజలను బాగాఉత్తేజం కలిగించేవిధంగా ప్రసంగించారు.

భాషా సౌలభ్యం కోసం వారి ప్రసంగాలను జ్యోతిర్మయి, మరో ఇద్దరు ఉపాధ్యాయులు తెలుగులోకి తర్జుమా చేసి చెప్పడం బాగా ఉపయోగపడింది.

ముఖ్యంగా లోకల్‌గా ఉన్న రిపోర్టర్లకు ఆ ప్రసంగాలను తెలుగులో వివరించి చెప్పడం బాగా ఆకట్టు కుంది. వారంతా వాటిని వివరంగా రాసుకున్నారు.

ప్రజలంతా థర్మల్‌ప్లాంటు ఏర్పాటు చేయబోయే జెసీసీ కంపెనీని తరిమికొడతామని శపథం చేసారు .“జడ్‌సీసీ గోబ్యాక్” అంటూ నినాదాలు చేసారు.

ఈ సభకు ఎవరెవరు హాజరైందీ? నిర్వహణకు ఎవరు కీలకపాత్ర వహించినదీ, ప్రజలు స్వచ్ఛందం గా వచ్చారా? లేదంటే బలవంతంగా బెదిరించి, తరలించి తీసుకొచ్చారా? వంటి వివరాలన్నింటినీ సేకరించి స్పెషల్‌బ్రాంచ్ పోలీసులు నమోదు చేసుకున్నారు.

సభ ముగిసాక స్వామిపేట పక్కనే ఉన్న మత్స్యకారగ్రామాలకు వెళ్లి వాస్తవ పరిస్థితులు తెలుసు కోవాలని అనుకున్నాడు అశోక్‌వర్ధన్. అదేమాట జ్యోతిర్మయికి చెప్పాడు. ఆమె "వెళ్దాం సరే" అంది.

మీటింగ్ పూర్తయి భోజనాలు అయ్యాక జ్యోతిర్మయితో కలిసి తీరప్రాంత గ్రామాలకు బయలు దేరాడు అశోక్‌వర్ధన్. అందుకోసం స్వామిపేటలో ఒక కారుని అద్దెకు తీసుకున్నాడు.

థర్మల్ పవర్ ప్లాంటు పెట్టబోయే ప్రాంతానికి దగ్గరున్న గూడభద్ర గ్రామానికి వెళ్లారు. అక్కడ మహిళా సంఘ భవనంలో ఉన్న వీరలక్ష్మి అనే మహిళ వీరిద్దరినీ చూసింది.

"ఏటమ్మా! ఇనాగ వచ్చేసినారు? ఎక్కడికెల్తన్నారేటి ?" అని జ్యోతిర్మయిని అడిగింది.

"ఏం లేదు లక్ష్మీ! మీ ఊళ్లు చూద్దామని ఈయన అంటే తీసుకొచ్చాను" అంది అశోక్‌వర్ధన్‌ను చూపిస్తూ.

"ఈ సారు ఎవులు? "

"పేపర్లో పనిచేస్తారులే...విశాఖపట్నం ఆఫీసులో ఉంటారు. జిల్లాకు స్టాఫ్ రిపోర్టర్‌గా ఉన్నారు. పేరు అశోక్‌వర్ధన్" అని పరిచయం చేసిందామెకు.

"మా కెవులు తెలియదండీ! స్వామిపేట టౌన్లో కొంతమంది ఇలేకరులున్నారు కదా...ఆలూ ఈ సారూ ఒకటేనా"

"కాదులే...ఈయన జిల్లా రిపోర్టర్ అన్నమాట..అలాంటి విలేకరులందరికీ హెడ్"

"అలాగా! అయితే నాకీఇసయం తెలీదమ్మా"

"మీరంతా పవర్‌ప్లాంటు ఎందుకు వద్దంటున్నారు?" ప్రశ్నించాడు అశోక్‌వర్ధన్.

"పవర్‌ప్లాంటు తరుపోళ్లా అయితే బయటకు నడవండి . మీ తోటెవులూ మాట్లాడరు. మీరు ఈ ఊరికి రావడం మీకే ప్రెమాదం" కోపంగా చెప్పింది వీరలక్ష్మి.

"తనకీ పవర్‌ప్లాంట్‌కూ ఎలాంటి సంబంధం లేదని చెప్పాడు అశోక్‌వర్ధన్.

"మరి ఇక్కడి ఇలేకరులు అప్పుడప్పుడూ మా గురించి బాగా రాస్తుంటారు. కానీ పవర్‌ప్లాంటు వాళ్లు ఇచ్చే మందు పార్టీలకు ఎల్తుంటారు. ఆలు ఇచ్చే సొమ్ములు పుచ్చుకుంటుంటారు"

" అవేవీ నాకు తెలియవమ్మా! నేను ఎవరి పక్షమూ కాదు. మీ సమస్యలు ఏమిటో స్వయంగా తెలుసుకుందామని వచ్చాను.గానీ ఇక్కడి విలేకరులతో నాకు ఎలాంటి సంబంధం ఉండదమ్మా!!"

"అలగైతే మంచిదే. మా సమస్యల ఇసయం అడిగినారు గదా! అవెప్పుడూ ఉండేవే. మా బతుకు లన్నీ అదిగో ఆ గంగమ్మ తల్లి మీన ఆధారమై ఉన్నాయి. ఆతల్లికి కోపమొస్తే సాలు మా కొంపలన్నీ మునిగిపోతాయి."

"ఎంత మంది మీలా చేపలవేట ఆధారంగా బతుకుతున్నారు?"

"యీ వూర్లో ఉన్నోల్లంతా సేపలయేట మీన ఆధారమై బతుకుతున్నోల్లే. ఈ ఒక్క ఊరే కాదు ఈ సుట్టుపక్కల పదూరుల్లో కూడా సేపలు పట్టడడమే  అందరికీ బతుకుతెరువు."

"ఈ చేపలు వేటాడడం వాటిని తీసుకొచ్చి అమ్మకం చేయడం వలన వచ్చే ఆదాయం మీ కుటుంబం మొత్తానికి సరిపోతుందా?

"ఎక్కడ సాలుతుంది. ఎంతొచ్చినా అది గోసికి పొడువు గుండారకి తక్కువ అయిపోతాది. కర్చులు పెరిగిపోనాయని రాబడి పెరుగుతాదా ఏటి?"

"మార్కెట్లో చేపలకు మంచి రేటు వస్తోంది కదా!"

"ఆ రేట్లన్నీ మా దగ్గరకు రావు బావూ ....మద్దినున్న కమీషనుఏపారులే తీసుకుంతారు. మా దగ్గిర కేజీ సేపలు యాబై రూపాయలకు కొంతారు. ఆలు కేజీ రొండొందలకు అమ్ముకుంతారు"

"మీరే చేపలు నిల్వచేసుకుని మంచి రేట్లు వచ్చినప్పుడు అమ్ముకోవచ్చు కదా!"

"అలగెలగ అవుతాది బావూ ! మా సేపలెట్టుకోవడానికి ఐసుబాక్సులు లేవు. ఏవో కోల్డు స్టోరేజీలు ఎడతామని ఎలచ్చన్లప్పుడు సెప్పినారు.అయి కూడా నేవు"

"అలాగా ....పవర్ ప్లాంటు పెడితే మీ కుర్రోళ్లకీ, మీకు ఉద్యోగాలు వస్తాయని చెబుతున్నారు"

"ఆలపని ఏ అడ్డు లేకుండగ జరిపోడానికి అలాగసెప్తన్నారు బావూ. ఎవులికెవులు ఏ ఉజ్జోగమి చ్చేత్తారు? కరెంటు ఫేక్టరీలో పనులు సెయ్యడానికి తగిన సదువులు ఇక్కడెవులు సదువుకున్నారు? ఇకన లేబరుపని అంతారా అదయితే ఆ ఫేక్టరీలోనే సెయ్యాలేటి? కూలిపని ఎక్కడ సేసినా ఒక్కటే"

"పవర్ప్లాంటు పెడితే ఈ ప్రాంతమంతా డెవలప్మెంట్ జరిగి టౌన్గా మారిపోతుంది. అలా జరిగితే మీకే మంచిది కదా అని అంటున్నారు"

"ఏ మంచి జరుగుతాది బావూ! మేము సిన్న ఊర్లలో ఈదుల్లోకి తిరిగి సేపలు అమ్మితే మా కష్టం,,నాభం సూసుకొని కేజీ అరవై,డెబ్బైకి అమ్మేస్తాము. ఆసేపలే మీరు ఇసాకపట్నం లోని పెద్ద పెద్ద స్టోర్లులో కొనాలంటే ఆడు ఫిక్సు చేసిన రేటు ఎంతైతే అంతేఇచ్చి కొనాల. టౌన్లు పెరిగితే ఎవులికి నాభం?  పెద్ద ఏపారాలు చేసుకున్నోల్లకి, డబ్బులున్నపెద్దోల్లకి నాభం. మాబోటోల్లకి మిగిలేది మట్టేబావూ!!"

ఆమె మాటలు ఆమె జీవితానుభవం నుంచి పుట్టినవి కావడంతో అశోక్వర్ధన్కు నోటమాట రాలేదు. అంతలోనే సర్దుకుని"ఈ కారణం వల్లే పవర్ప్లాంటు వద్దనిచెబుతున్నారా?"అనిఅడిగాడు.

"ఇదొక్కటే కారణం కాదు బావూ! బొగ్గుతోని కరెంటు తయారు సేత్తారు. ఇంటిలోనే బొగ్గు పొయ్యి వాడడానికి ఎన్నో కస్టాలు. దగ్గు వచ్చేస్తుంటుంది. అనాంటిది బొగ్గుతోనే కరంటు పుట్టించాలంటే ఎంత బొగ్గు వాడుతారో? ఆపొగంతా మా వూళ్లమీదకే వదిలేస్తారు. అందరూ జబ్బులతో సవ్వాల. మాకీ కరెంటు ఫేక్టరీ వద్దు...... అంతేకాదు బావూ! ఆ ఫేక్టరీ నుంచి వచ్చే నీల్లూ,

బొగ్గు పొడి, బూడిద అంతా సముద్రానికే వదిలేస్తారు. దానితోటి సేపలన్నీ సచ్చిపోతాయి. మాకు జీవనాదరువు లేకుండా పోతాది బావూ!" వివరంగా చెప్పింది వీరలక్ష్మి.

ఆపరిసరాల్లో ఉన్న మరో మూడు గ్రామాలకు వెళ్లాడు జ్యోతిర్మయితో కలిసి అశోక్‌వర్ధన్. అక్కడ కలిసిన అందరినోటా వీరలక్ష్మి చెప్పినట్టే వ్యతిరేకతని తీవ్రస్థాయిలో వ్యక్తం చేస్తుండడం గమనించాడు.

తిరిగి టాక్సీలో స్వామిపేట చేరుకున్నారు.

బస్‌స్టేషన్ దగ్గరకు వచ్చేసరికి తెలుగుదీపం లోకల్ రిపోర్టర్ దస్తగిరి మోటారుసైకిల్‌పై వెనుక కూర్చొని బిక్షపతి జెసిసీ ఆఫీసువైపు వెళ్తూ కన్పించాడు. అశోక్‌వర్ధన్ పలుకరించేలోగానే వారిద్దరూ వెళ్లిపోయారు.

విశాఖపట్నం వైపు వెళ్లే బస్సు రావడానికి ఒక గంట సమయం పడుతుందని తెలుసుకున్న అశోక్‌వర్ధన్ సమీపంలోనే థర్మల్‌పవర్‌ప్లాంట్‌కు వ్యతిరేకంగా నిరహారదీక్ష శిబిరంలో ఉన్న పర్యావరణ ఉద్యమ కారులను కలిశాడు.

అతనిని వారికి జ్యోతిర్మయి పరిచయం చేసింది.

ఆ ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న విష్ణుమూర్తి అశోక్‌వర్ధన్‌ను చూసి పలకరించాడు.

"ఓహో మీరేనా జిల్లా రిపోర్టర్ అశోక్‌వర్ధన్! మీ ఎండీ, ఎడిటర్‌గారు మాకు బాగా తెలుసునండి. ఇప్పుడే మీ న్యూస్ ఎడిటర్ బిక్షపతి గారు వచ్చి కలిసి వెళ్లారు. అందరు పూర్తి సహకారం అందిస్తామన్నారు. మీలో కొంత మంది థర్మల్ ప్లాంట్ వాళ్లకు అమ్ముడు పోయినా మాకు సపోర్ట్ చేసే వారు కూడా ఉన్నారు లెండి" అన్నాడు.

"మంచిదండి. పత్రికలు ఎల్లప్పుడూ ప్రజలకు సపోర్ట్ చేస్తాయి. ప్రజల పక్షాన నిలుస్తాయి" చెప్పాడు అశోక్‌వర్ధన్.

ఆ ఉద్యమం పూర్వాపరాలను వారితో మాట్లాడి తెలుసుకున్నాడు.

ఇంతలో విశాఖ పట్నంవైపు వెళ్లే బస్సు రావడంతో వారిద్దరు పర్యావరణ ఉద్యమకారులనుంచి సెలవు తీసుకుని బస్సు ఎక్కారు.

అంతకుముందే జడ్‌సిసి ఆఫీస్‌కు దస్తగిరితో పాటు వెళ్లిన బిక్షపతి అక్కడున్న ప్లాంట్ డైరెక్టర్లు దుర్గానంద్, లవకుమార్‌లను కలిశాడు.

" తాను హైదరాబాద్ నుంచి ఇక్కడకు వచ్చానని, త్రిముఖం పత్రిక న్యూస్ ఎడిటర్‌గా అన్ని అధికారాలు తనవేనని, తాను ఏం తలుచుకుంటే అదే జరుగుతుందని" వారికి చెప్పాడు.

"ఇంతకు ముందు మీ పేపర్‌లో పనిచేసే కోటేశ్వరరావు కూడా ఇదే మాట చెప్పారు. ఆయన ని మాకు మంత్రి ధర్మరాజుగారు పరిచయం చేశారు. కోటేశ్వరరావు గారికే సొమ్ము ఇచ్చేశాము. వారిని కనుక్కోండి" అన్నాడు దుర్గానంద్.

"ఏం మాట్లాడుతున్నారు మీరు? కోటేశ్వరరావు ఆఫ్‌ట్రాల్ ఒక సబ్ ఎడిటర్. అలాంటి వాళ్లంద రికీ హెడ్ నేనే. ఆలోచించుకోండి" కాస్త ఆవేశంగానే చెప్పాడు బిక్షపతి.

"మంత్రి గారి సిఫార్సు మేరకు మీ పేపర్‌కు అందరికన్నా ఎక్కువే ఇచ్చాం. మళ్లీ ఇవ్వాలంటే మా హెడ్‌ఆఫీస్ వాళ్లు ఒప్పుకోరు. అయినా ట్రై చేస్తాం మీ కోపరేషన్ అవసరం కదా!" సర్దుబాటు చేసే దోరణిలో చెప్పాడు లవకుమార్.

"అది.... అలా దారికి రండి. వెంటనే మీ వాళ్లతో మాట్లాడి ఏదో విషయం తేల్చండి. లేకపోతే మా కోపరేషన్ మీకు ఉండదు తెలిసిందా..?" బెదిరిస్తున్నట్లు చెప్పాడు బిక్షపతి.

"అలాగే సార్ మాట్లాడుతాం. కాని మీరు కూడా ఒకసారి కోటేశ్వరరావుతో మాట్లాడితే బాగుంటు ందేమో ఆలోచించండి" మళ్లీ అన్నాడు దుర్గానంద్.

వెంటనే ఆగ్రహంతో బిక్షపతి " మీరు మళ్లీ మొదటికి వస్తున్నారు. నేను నా కింద పనిచేసే వాళ్లకు బతిమాలుకోవాలా ఏమిటి? తమాషా ఉందా?" అని ప్రశ్నించాడు.

బిక్షపతి స్వరంలోని తీవ్రతను పసిగట్టిన లవకుమార్ వెంటనే సంభాళించుకుని "మీకు సెపరేట్‌గా ఇవ్వాలని మేము కూడా అనుకుంటున్నామండి. అయితే పై వాళ్లు ఏమంటారో అని చిన్న డౌట్‌తో మీకు ఆ సలహా ఇచ్చాం తప్ప మిమ్మల్ని తక్కువ చేయాలన్నది మా అభిప్రాయం కాదు" అన్నాడు.

"సరే ఏదో ఒకటి తేల్చుకోండి. మీ పని మీరు చేయకపోతే మా పని మేము ఎలాగూ చేసుకుంటాం" బిక్షపతి అల్టిమేటమ్.

'అంతకోపం ఎందుకండి?. మీ సహకారం లేకపోతే ఇక్కడ థర్మల్ పవర్‌ప్లాంట్ పెట్టలేమన్న సం గతి మా వాళ్లకు అర్థమయ్యేలా చెబుతాం కదా!. కొంత టైమ్ ఇవ్వండి." కోరాడు లవకుమార్.

"ఎంత టైమ్ కావాలి మీకు?. ఇక్కడ మీ ప్లాంట్‌కు వ్యతిరేకంగా ఉన్న వాళ్లంతా మా హెడ్ ఆఫీస్‌లో ఎండి గారిని, ఎడిటర్‌గారిని కలిసి న్యూస్ కవరేజ్ విషయంలో ఇప్పటికే కంప్లయింట్ చేశారు. అందుకే నాకు ఇక్కడ స్పెషల్‌గా న్యూస్ ఎడిటర్‌గా నియమించారు. అర్థమైందా?" చెప్పాడు బిక్షపతి.

"ఒకే సార్! మిమ్మల్ని మేము తక్కువ చేయడం లేదు. మీరు మొదటిసారి మా ఆఫీస్‌కు వచ్చారు కాబట్టి మీకు మీ రిపోర్టర్‌గారికి కలిపి లక్ష రూపాయలు ఇస్తాం. యాభైవేల చొప్పున

సర్దుకోండి.   మరో రెండు రోజుల్లో మా పై ఆఫీసర్లు చెప్పే విధంగా ఏర్పాటు చేస్తాం" అన్నాడు దుర్గానంద్.

"సరే కానివ్వండి " ఆనందంగా చెప్పాడు భిక్షపతి.

లోపలకు వెళ్లి లక్ష రూపాయల నోట్ల కట్ట ఒకదానికి తెచ్చిన దుర్గానంద్ వాటిలో యాభై వేలు తీసి దస్తగిరికి ఇచ్చాడు. సగం నోట్ల కట్టను భిక్షపతికి ఇచ్చాడు.

దస్తగిరి, భిక్షపతిలు " మళ్లీ కలుద్దాం" అంటూ వారి నుంచి వీడ్కోలు తీసుకుని జడ్‌సిసి ఆఫీస్ నుంచి బయటకువచ్చారు.

ఆఫీస్ నుంచి బయటకు అడుగుపెట్టి ఆర్టీసీ బస్ స్టేషన్‌కు చేరుకునేముందే దస్తగిరితో భిక్షపతి మాట్లాడుతూ "నీక్కూడా వారి దగ్గర మంచి పలుకుబడి ఉందే" అన్నాడు నర్మగర్భంగా నవ్వుతూ.

"లోకల్‌గా ఉంటాం కదా సార్? కాస్త పరిచయం అంతేనండి. ఏం సార్. అలా అడిగారు?" దస్తగిరి సదేహం వ్యక్తం చేసాడు.

"ఏమీ లేదులే నాతోపాటు సమానంగా నీక్కూడా యాభై వేల రూపాయలు ఇచ్చారు కదా. మరి నీకు నాకు తేడా ఏమిటి?" అన్నాడు భిక్షపతి.

ఆ ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో దస్తగిరికి పాలు పోలేదు.

మళ్లీ భిక్షపతే మాట్లాడుతూ " ఈ విషయం మన పైవాళ్లకు తెలిస్తే సీరియస్ అవుతారు. అందుకే నీకిచ్చిన దానిలో ఇరవైవేలు నువ్వు ఉంచుకుని ముఫ్పైవేలు ఇచ్చేసేయ్. వాటిని పై వాళ్ల కు  పంపించి నా తంటాలు నేనేవో పడతాను" అని చెప్పాడు.

తనక్కూడా పవర్‌ప్లాంట్ ప్రతినిధులు యాభైవేలు ఇవ్వడంతో భిక్షపతి కుళ్లు కుంటున్నాడని ముందే పసిగట్టిన దస్తగిరి మారు మాట్లాడకుండా తన జేబులోని సొమ్ములో ఇరవై వెయ్యి నోట్లు తాను ఉంచుకుని ముప్పై వేలు అతని చేతిలో పెట్టాడు.

ఈలోగా విశాఖపట్నం వైపు వెళ్లే ఎక్స్‌ప్రెస్ రావడంతో భిక్షపతి అందులో ఎక్కి కూర్చొన్నాడు. "మరో రెండు రోజులు టైం వాళ్లు అడిగారు కదా ఫాలోఅప్ చేయ్ మర్చిపోకు" అంటూ చేతులూ పుతున్న దస్తగిరికి చెప్పాడు భిక్షపతి.

తన జేబులోకి వచ్చిన సొమ్ములో ముప్పైవేలు భిక్షపతి  లాగేసినందుకు మనసులో బాధపడు తూనే కసిగా తిట్టుకున్నాడు దస్తగిరి బస్సులో వెళ్లిపోతున్న భిక్షపతిని చూస్తూ.

xxxx                    xxxxxx                    xxxx

ఆ రోజు ఆదివారం ఉదయం తొమ్మిది గంటలు

మంత్రి ధర్మరాజు క్యాంపు ఆఫీస్

రకరకాల అర్జీలతో వచ్చిన జనంతో సందడిగా ఉంది. లోపల తన ఛాంబర్‌లో కూర్చుని ముఖ్యమై న కొందరు సన్నిహితులతో ధర్మరాజు మాట్లాడుతున్నాడు.

విజిటర్స్ వెయిటింగ్ హాల్లో దయానిధి బిజీగా ఉన్నాడు.

ఎవరెవరు ఏయే పనులమీద వచ్చారో కనుక్కొని వాటిని నమోదు చేసుకోవడంలో తల మునకలై ఉన్నాడు.

మంత్రికి ఎంత ఇవ్వాలో ఎంత ఖర్చు అవుతుందో ఆయా పనుల వారీగా అంచనాలు వేస్తున్నాడు. ఒక్కో పనిపై ఒక్కో నిర్ణయానికి వచ్చి ఆయాపార్టీలను బయటకు తీసుకెళ్లి ఎంతచెల్లిస్తే పని జరిగి పోతుందో చెబుతున్నాడు.

అంతలో ఒక చిన్న బ్రీఫ్‌కేస్‌తో విజిటర్స్ హాల్లోకి వచ్చారు జడ్‌సిసి పవర్‌ప్లాంట్ డైరెక్టర్లు దుర్గానంద్, లవకుమార్‌లు.

వారిద్దరినీ చూడగానే దయానిధి ముఖం వెయ్యి వోల్ట్‌ల బల్బ్‌లా వెలిగిపోయింది.

"గుడ్‌మార్నింగ్‌సార్! రండిసార్!!" అంటూ సంతోషంగా ఆహ్వానించాడు.

విజిటర్స్ హాల్ పక్కనే ఉన్న దర్మరాజు ప్రైవేట్ గదిలోకి వారిని తీసుకెళ్లి సోఫాలో కూర్చోబెట్టాడు.

"ఏమిటిలా వచ్చారు. మంత్రిగారితో ఏదైనా అర్జంట్ పని ఉందా?" అని అడిగాడు.

"సార్ లోపల బిజీగా ఉన్నారా? జస్ట్ ఐదు నిమిషాలు మాకు కేటాయిస్తే చాలు" అన్నాడు దుర్గా నంద్."కొంచెం బిజీయే రాత్రే కదా హైదరాబాద్ నుంచి వచ్చారు. కాబట్టి ఎక్కువ మంది విజిటర్స్ ఉన్నారు"

" అయితేవెయిట్ చేస్తాం. ఈలోగా ఆయనతో మేం వచ్చినట్లు చెప్పండి" అన్నాడు లవకుమార్.

బాయ్‌ని పిలిచి వారిద్దరికి కూల్ డ్రింక్స్ సర్వ్ చేయాలని చెప్పి దయానిధి లోపలకి వెళ్లాడు. వెంటనే రెండు నిమిషాల్లో తిరిగి వచ్చి " రండి సార్! . సార్ రమ్మంటున్నారు" అని పిలిచాడు.

"బిజీగా ఉన్నారన్నారు కదా " అడిగాడు లవకుమార్.

"ఎంత బిజీగా ఉన్నా వారంతా మీ తరువాతే లెండి. మీకు ఎన్ని పనులు ఉంటాయో అదీ చెప్పాను . సార్‌తో.అయితే వెంటనే తీసుకురమ్మన్నారు" చెప్పాడు దయానిధి.

తన ఛాంబర్‌లోకి వచ్చిన జడ్‌సిసి డైరెక్టర్లను చూసి చిరునవ్వులు చిందించాడు మంత్రి ధర్మరాజు.

అప్పటివరకు తనతో మాట్లాడుతున్నవారిని తరువాత మాట్లాడుదామని బయటకు పంపించేశాడు.

ఇప్పుడు మంత్రి ఛాంబర్‌లో దర్మరాజుతో పాటు దయానిధి, దేవానంద్, లవకుమార్‌లు మాత్రమే ఉన్నారు.
మంత్రి వారివైపు చూసి "ఎలా ఉన్నారు ఏంటి విశేషాలు?" అంటూ పలకరించాడు.
"ఏమీ లేదు సార్. వస్తున్న శుక్రవారం నాడు ప్లాంట్ పనులు మొదలుపెడతాం అనుకుంటున్నాం". చెప్పాడు దుర్గానంద్.
"ఆ రోజు మన ఎంగేజ్‌మెంట్స్ ఏమిటో కనుక్కో "దయానిధికి చెప్పాడు ధర్మరాజు.

"శంకుస్థాపనలు వాటికి ఆర్భాటాలు ఏమి ఉండవు సార్. అనఫిషియల్‌గా పనులు మొదలుపెడతాం సార్. అక్కడ అన్ని పరిస్థితులు మనకు అనుకూలంగా ఉన్నాయని అనిపిస్తే మిమ్మల్ని, సీఎంగారిని అఫిషియల్‌గా ఆహ్వానించి శంకుస్థాపన కార్యక్రమాన్ని జరిపిస్తాము" చెప్పాడు దుర్గానంద్ "మంచిదే కాని అక్కడ పరిస్థితి అంతా మనకే అనుకూలంగా ఉంది కదా. లోకల్ లీడర్ల సపోర్ట్ ఉంది. మీడియా సపోర్ట్ ఉంది. ఎవరో పనిలేనివారు కొంతమంది వ్యతిరేకంగా ఉన్నంత మాత్రాన భయపడాల్సిన పనిలేదు కదా".

"మీ మీద కూడా అక్కడున్నవాళ్లంతా చాలా గుర్రుగా ఉన్నారు సార్!. మీరే మా ప్లాంట్‌కు పూర్తి మద్దతిస్తున్నారు అంటూ ధ్వజం మెత్తుతున్నారు. ఈ ప్లాంట్‌లో మీకు వాటా ఉంది అంటూ ప్రచారం చేస్తున్నారు". అన్నాడు లవకుమార్.

"అలాగా.....! నేను కూడా విన్నాను. ఇదంతా ప్రతిపక్షాల నాయకులు నామీద కావాలనే దుష్ప్రచారం చేస్తున్నారు. అయినా వ్యతిరేకిస్తున్న వారంతా బుద్ధిలేని వెధవలు గాని. ఎన్నికల ముందు మేము ఆ ఊళ్లకు వెళితే ఉద్యోగాలు కల్పించండి. యూత్ అంతా పనిలేక పాడైపోతున్నారంటూ గగ్గోలు పెడతారు. ఇదిగో ఇలా పవర్‌ప్లాంట్ పెట్టి ఉద్యోగాలు కల్పిస్తాం పని ఇప్పిస్తాం అని చెబితే మాకు వద్దంటూ వ్యతిరేకిస్తారు". అసహనంగా అన్నాడు మంత్రి ధర్మరాజు.

"అందుకే సార్! ఇప్పటికే చాలా లేట్ అయింది. మా పైవాళ్లు కూడా ఒత్తిడి చేస్తున్నారు. గవర్నమెంట్‌తో కుదుర్చుకున్న ఒప్పందానికి గడువు తీరుపోతుందని వారి భయం. ఎలాగోలా ప్లాంట్ నిర్మాణ పనులు మొదలుపెట్టండి అంతా అదే సర్దుకుంటుంది అని చెబుతున్నారు. పక్కనే ఉన్న కాకిపల్లిలో పవర్‌ప్లాంట్ పనులు ఏగొడవలు లేకుండా జరుగుతున్నాయి కదా. ఈ ఉద్యమకారులెవరూ వారి వెంట్రుక కూడా పీకలేకపోయారు" చెప్పాడు దుర్గానంద్.

"అవునవును. మీరంటే చుట్టుపక్కల గ్రామాల్లో డబ్బులు పంచారట కదా. అందుకే డబ్బులు అందని వారంతా వ్యతిరేకంగా మారిపోయారని విన్నాను.నిజమేనా?"
"అది ఒక కారణం కావొచ్చుగాని అందరికీ డబ్బులు పంచాలంటే మా కంపెనీ ఆస్తులన్ని అమ్మినా సరిపోవు" అన్నాడు దుర్గానంద్.

"సరే మరి ఏం చేద్దాం అంటారు?".

"ముందుగా ప్రభుత్వం మాకు కేటాయించిన భూమిని, రైతుల నుంచి మేం కొన్న భూమిని కలిపి మొత్తం చుట్టూ ఒక కంచెను నిర్మించాలనుకుంటున్నాం." చెప్పాడు లవకుమార్.

"మంచిదే అయితే ఏం చేయాలి నేను?".

"ఈ పనులకు అక్కడి వాళ్లు అడ్డుపడకుండా పోలీస్ ప్రొటక్షన్ కావాలి మాకు. మా వాళ్లు ఈ విషయమై ఐజి గారితో మాట్లాతున్నారు. మీరు కూడా కొంత చొరవ చూపిస్తారని పూర్తిగా పోలీస్ ప్రొటక్షన్ ఉంటే పనులు ఏ ఆటంకం లేకుండా మొదలవుతాయని మా ఆశ" చెప్పాడు దుర్గానంద్.

"మంచి ఆలోచన..... ఇటు రాజమండ్రి నుంచి అటు శ్రీకాకుళం వరకు ఉన్న పోలీస్ ఫోర్స్‌ని గురువారం నుంచే మీకు హ్యాండోవర్ చేయిస్తాను. అంతే కాదు గురువారం రాత్రి థర్మల్ వ్యతిరేక ఉద్యమాలు చేస్తున్న నాయకులను పోలీసులు అదుపులోనికి తీసుకుంటారు. శుక్రవారం నాడు మీ పనిలో మీరు ఉంటారు. వారిని ఎలా బయటకు తీసుకురావాలా అని ఉద్యమకారులు తంటాలు పడుతుంటారు. తరువాత రోజు సెకండ్ శాటర్‌డే. ఆతరువాత రోజు ఆదివారం. ఆతరువాత సోమవారం వరకు వారికి బెయిల్ వచ్చే అవకాశం లేదు" తన వ్యూహాన్ని వివరించాడు మంత్రి ధర్మరాజు.

"థ్యాంక్యూ సార్!. మీరు ఆ పని చేస్తే మా జోలికి రావడానికి కూడా ఎవరూ ధైర్యం చేయదు . మా స్థలం చుట్టూ కంచె కట్టుకుంటాం. వారు దాన్నుంచిలోపలకు అడుగుపెట్టడానికే వీలుండదు " ఆనందంగా అన్నాడు లవకుమార్.

"మంత్రిగారు మాటిచ్చేశారు కదా. మీరిక నిశ్చింతగా వెళ్లండి" అంటూ అభయం ఇచ్చే ఫోజు తో చెప్పాడు దయానిధి.

దుర్గానంద్ లవకుమార్‌లు మంత్రి దర్మరాజు నుంచి వీడ్కోలు తీసుకుని కారులో స్వామి పేట బయల్దేరారు.

×××× × ×××××× ××××

మంత్రి ధర్మరాజు తాను చెప్పింది చేశాడు.

స్వామిపేటతో పాటు పరిసరాల్లోని పది, పదిహేను గ్రామాల్లో వేలాది మంది పోలీసులను గురువారం నాటికే మోహరించేశారు.

ఆ గ్రామాలన్నింటిలో పోలీస్ పికెట్లు ఏర్పాటు చేశారు.

థర్మల్ పవర్‌ప్లాంట్ స్థలం సమీపంలోని ప్రధాన రహదారిని తమ ఆధీనంలోకి తీసుకున్నారు.

గ్రామాల్లో పోలీసు దళాలతో కవాతు నిర్వహించారు. పోలీస్ అధికారులు మూడు రోజుల పాటు ఒన్‌ఫార్టీఫోర్ సెక్షన్ విధిస్తున్నట్లు ప్రకటించారు.

చాలామంది పర్యావరణ ఉద్యమకారులను ముందస్తుగా అదుపులోకి తీసుకున్నారు.

అప్పటివరకు ఉద్యమానికి దూరంగా తటస్థంగా ఉన్న వారు కూడా పోలీసుల హడావిడికి నిరసన గా ఉద్యమంవైపు ఆకర్షితులవుతున్నారు.

పరిస్థితి అంతా నివురుగప్పిన నిప్పులా ఉంది.

ఏ క్షణంలో ఎలా రాజుకుంటుందో ఎవరూ ఊహించలేని పరిస్థితి ఏర్పడింది.

స్వామిపేటలో ఏర్పడిన ఉద్రిక్త వాతారవణాన్ని పోలీసుల హడావిడిని జిల్లా కేంద్రంలోని స్టాఫ్ రిపోర్టర్లకు తెలియనివ్వకుండా అంతా గోప్యంగా ఉంచడానికి స్థానికంగా ఉన్న విలేకరులకు తలా యాభై వేల రూపాయల చొప్పున అందజేశారు.

స్థానికంగా ఉన్న విలేకరులు థర్మల్‌పవర్‌ప్లాంట్ యాజమాన్యానికి తొత్తులుగా మారిన విష యాన్ని స్థానిక ప్రజలు, ఉద్యమకారులు పసిగట్టారు. వారంతా అదను కోసం వేచిచూస్తున్నారు.

అయితే 'త్రిముఖం' విలేకరి దస్తగిరి ఎప్పటికప్పుడూ తాజా సమాచారాన్ని న్యూస్ ఎడిటర్ బిక్షపతికి చేరవేస్తున్నాడు. జడ్‌సిసి వారితో భిక్షపతి కుదుర్చుకున్న ఒప్పందం మేరకు వారిద్దరూ గుంభనంగా ఉండిపోయారు.

శుక్రవారం తెల్లవారేటప్పటికి స్వామిపేటలో పరిస్థితి మరింత ఉద్రిక్తంగా మారింది.

పోలీసుల వలయాలను చేదించుకుని ఉద్యమకారులతో పాటు ప్రజలు ఆగ్రహావేశాలతో థర్మల్ ప్లాంట్ స్థలానికి కంచె నిర్మించబోయే ప్రదేశానికి చేరుకున్నారు.

చేతికందిన కర్ర,కత్తి,పలుగు, పార వంటివి తీసుకుని పెద్ద ఎత్తున జడ్‌సిసి గోబ్యాక్ అంటూ నినాదాలు చేస్తూ ముందుకు దూసుకొచ్చారు.

పోలీసులతో పాటు జడ్‌సిసి సొంతంగా ఏర్పాటు చేసుకున్న వందలాది మంది ప్రైవేట్ సైన్యం కూడా ఉద్యమకారుల అంతు చూడాలని వేచి చూస్తోంది.

థర్మల్ ప్లాంట్ పనులు ఆపాలని కంచె నిర్మిస్తే ఊరుకునేది లేదని ప్రజలు ఆగ్రహంతో పోలీసులు , జడ్‌సిసి బలగాలతో విరుచుకుపడ్డారు. ఇదే అదనుగా పోలీసులు తమ తుపాకులకు పని చెప్పగా జడ్‌సిసి గుండాలు కర్రలతో ఉద్యమకారులను, ప్రజలను చావబాదారు. మరింతగా రెచ్చిపోయి న జనం పోలీసులు, జడ్‌సిసి గుండాలు వచ్చిన వాహనాలతో పాటు పనిలోపనిగా జర్నలిస్ట్‌ల మోటార్ సైకిళ్లను కూడా తగులబెట్టేశారు.

ఈ హోరాహోరీ పోరులో నలుగురు రైతు కూలీలు పోలీసులకు కాల్పులకు బలైపోయారు. వందలాది మందికి తీవ్ర గాయాలయ్యాయి. ప్రజా ప్రతిఘటనలో భాగంగా పోలీసులకు కూడా గాయాలయ్యాయి.

ఇంతటి ఉద్రిక్తత పరిస్థితి గురించి కావాలనే గోప్యంగా విలేకరులు వ్యవహరించడం వల్ల జిల్లా కేంద్రంలో ఉన్న స్టాఫ్ రిపోర్టర్లకు అంతగా సమచారం లేకుండా పోయింది.

ఈ ఘటనలో నలుగురు మృతి చెందారన్న విషయం కొన్ని టివి ఛానళ్లలో స్క్రోలింగ్ రూపంలో వెల్లడి కావడంతో అన్ని మీడియా సంస్థల వారంతా దానిపై దృష్టి సారించారు.
ప్రజలు తమ ప్రతిఘటనలో బాగంగా జడ్‌సిసి కార్యాలయాన్ని కూడా తగులబెట్టేశారు.

అదే సమయానికి హైదరాబాద్‌లో శాసనసభ సమావేశాలు జరుగుతున్నాయి. ఈ కాల్పుల ఘటనపై ప్రతిపక్షాలు తీవ్రంగా ధ్వజమెత్తాయి.

"మంత్రి ధర్మారాజు స్వార్థానికి నలుగురు రైతు కూలీలు చనిపోయారంటూ" ప్రతిపక్షాలు మండిపడ్డాయి.

అయితే తన జిల్లాలో నలుగురు మనుషులు పోలీసుల కాల్పులకు చనిపోయారన్న ఏమాత్రం పశ్చాత్తాపం లేకుండా మంత్రి ధర్మరాజు తన చర్యలను పూర్తిగా సమర్థించుకున్నాడు.
"ఈ థర్మల్ పవర్‌ప్లాంట్‌ను అడ్డుకునేవారంతా దేశ ద్రోహులని వారిని తాను విడిచిపెట్టనని అవస రం అయితే లారీలతో తొక్కించి చంపేస్తానని "ఆవేశంగా మాట్లాడాడు.

దీంతో స్వామిపేటలోనే కాకుండా జిల్లా వ్యాప్తంగా మంత్రి ధర్మరాజుకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు నిర్వహించి ఆందోళన కారులు ఆయన దిష్టిబొమ్మను దహనం చేశారు.

ఈ సంఘనటతో జడ్‌సిసి చాలా కలవరానికి గురైయింది. కోట్లాది రూపాయలు దిగమింగిన మంత్రి గాని, లక్షల రూపాయలు పుచ్చుకున్న విలేకరులు గాని జనాగ్రహం నుంచి తమను కాపాడ లేరని వారికి అర్థమయ్యింది.

స్వామిపేట నుంచి తట్టాబుట్టా సర్దుకుని వెళ్లిపోయారు. అయితే తమకు ప్రభుత్వం అప్పగించిన భూములు , తాము కొనుక్కోన్న భూములను చట్టపరంగా తమ ఆధీనంలో ఉంచుకున్నారు.

××× ××× ×××

స్వామిపేటలో రాజుకున్న నిప్పు అక్కడికి నెలరోజుల్లోనే కాకిపల్లి పవర్‌ప్లాంటును తాకింది.

స్థానికంగా ఉన్న మత్స్యకారులు, రైతులు చిత్తడి నేలలను కాపాడుకోవడానికి సమా యత్తమయ్యారు.

ప్లాంటులోపలకు వాహనాలను వెళ్లనీయకుండా ఆరోజు అడ్డుకున్నారు.

మొదటి నుంచీ పత్రికలు, టీవీఛానళ్లు కాకిపల్లి థర్మల్ పవర్ ప్లాంటుకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమానికి అంత ప్రాధాన్యత ఇవ్వడం లేదు. దీనికి కారణం ఆప్లాంటు యాజమాన్యం మీడియా యజమానులతో ఒక అవగాహనకు రావడమే.

కావాల్సినంత పబ్లిసిటీ రాకపోవడంతో పర్యావరణ ఉద్యమకారులుకూడా ఈ ఉద్యమం పట్ల అంటీ ముట్టనట్లుగానే వ్యవహరించారు. మొదట్లో ఎన్ని ఆందోళనలు చేసినా పత్రికల్లోనూ,టీవీ ఛానళ్లలో పెద్దగా హైలెట్ కావడం లేదని వారంతా నిరుత్సాహ పడిపోయారు.

దీంతో స్వామిపేట ఉద్యమంలో చూపించినంత చురుకైన పాత్రని ఈ ఉద్యమంలో పర్యావరణవేత్తలు చూపించలేదు.

అయినా సరే స్థానికంగా ఉన్న ప్రజలు ఏమాత్రం వెనక్కి తగ్గలేదు. పవర్ప్లాంటుకు వ్యతిరేకంగా ఉద్యమించారు.

ఈ ఉద్యమాన్ని కూడా ఉక్కుపాదంతో అణిచివేయాలని ప్రభుత్వం సంకల్పించింది.

అంతే ప్లాంటు లోపలకు వెళ్లే వాహనాలను అడ్డుకున్న మత్స్యకారులు,రైతులపై పోలీసులు తమ తూటాలకు పనిచెప్పారు. ఈకాల్పుల్లో ఆరుగురు ప్రాణాలొదిలారు.ఎందరో గాయాలపాలయ్యారు.

ఆరుగురు ఇందులో చనిపోయినా త్రిముఖం పత్రిక ,టీఎన్టీవీ వంటి మీడియా సంస్థలు చాలా తేలికగా తీసుకున్నాయి.

ఒక్క వార్తని కూడా ప్రసారం చేయలేదు.ప్రచురించలేదు.

దీంతో మీడియా తీరుని నిరసిస్తూ విశాఖపట్నంలో కొన్ని ప్రజాసంఘాలు ర్యాలీలు, అందోళనలు జరిపాయి.

ఆవిధంగా థర్మల్ వ్యతిరేక ఉద్యమాలు రెండువైపులా దయానిధి,కోటేశ్వరరావు, దస్తగిరి, బిక్షపతి వంటి మీడియా ప్రతినిధులకీ మంత్రి ధర్మరాజుకు బాగా మేలు చేకూర్చాయి.

××× ××× ×××

అదేపనిగా ఫోన్ రింగౌతుండడంతో కంప్యూటర్ ముందు చేస్తున్న పనిని పక్కనపెట్టి అశోక్వర్ధన్ తన మొబైల్ను అందుకున్నాడు.

అవతలినుంచి సత్యనాగేష్ కాల్ చేస్తున్నాడు.

సత్యనాగేష్ పాపులర్ టీవీ ఛానల్కు రిపోర్టర్. అతనితో ఐదేళ్లనుంచీ అశోక్వర్ధన్కు పరిచయం ఉంది.

“అశోక్ గుడ్మార్నింగ్! ఏం చేస్తున్నావ్?” అంటూ పలకరించాడు నాగేష్.

“ఏమీ లేదు..ఏమిటి ఉదయాన్నే ఫోన్‌చేసావు?ఏదైనా విశేషమా?” అడిగాడు అశోక్‌వర్ధన్.
“నీకు మంచి సెన్సేషన్ న్యూస్ ఇద్దామని”
“ఏమిటో ఆసెన్సేషన్ న్యూస్?”
“ఒక పదిహేనేళ్లు కూడా దాటని మైనర్‌బాలికతో ఒక ఎక్సైజ్ అధికారి సరససల్లాపాలు”
“నిజమా!? ...మీ టీవీ ఛానల్‌కైతే అలాంటి న్యూస్ బాగుంటుంది. ఉన్నవీ లేనివీ కలిపి రకరకాల సినిమాల సీన్లు చూపించి రోజంతా కాలక్షేపం చేసేస్తారు.”
“నీకెప్పుడూ టీవీ న్యూస్ అంటే కడుపుమంటేగానీ ...ఈ న్యూస్‌కి సంబంధించిమాత్రం మంచి విజువల్స్, ఇన్ఫర్మేషన్ మా దగ్గరుంది”
“మీ ఛానల్లో ఫ్లాష్ చేసేసారా?”
“లేదింకా...రాత్రేగదా విజువల్స్ వచ్చాయి. ఈరోజు ఫుటేజ్ అప్‌లోడ్ చేస్తాను”
“విజువల్స్ మాకు ఎందుకు బాబూ..వాటిని పేపర్లో పబ్లిష్ చేయడం కుదరదు కదా?”
“విజువల్స్ నుంచి స్నాప్‌షాట్స్ కట్‌చేసి ఫోటోలు కూడా రెడీ చేసాను...నీకు అవసరమంటే మెయిల్ చేస్తాను”
“సరే పంపించు”
“ఐటమ్ బాగా వస్తుందని హామీ ఇస్తే పంపిస్తాను”
“నీకు నమ్మకం ఉంటే పంపించు...లేకపోతే లేదు” చెప్పేసాడు అశోక్‌వర్ధన్.
“ఓకే..మరో ఐదు నిమిషాల్లో ఫోటోలు,ఇన్ఫర్మేషన్ మొత్తం నీదగ్గరుంటుంది” అని చెప్పి సత్యనాగేష్ ఫోన్ కట్‌చేసాడు.
అతను చెప్పినట్లుగానే ఇమెయిల్‌లో ఫోటోలు, ఇన్ఫర్మేషన్ బ్రీఫ్‌గా పంపించాడు.
స్క్రీన్‌షాట్స్ అయినా క్లారిటీ బాగానే ఉండడంతో అందిన ఇన్ఫర్మేషన్‌తో వార్తను సిద్ధం చేసాడు అశోక్ వర్ధన్.

ఎక్సైజ్ ఇన్స్‌పెక్టర్ జనార్ధన్ వివరణ కోసం ప్రయత్నించగానే “మీరు రండి సార్! పర్సనల్‌గా మాట్లాడుకుందాం. ఫోన్లో ఏమిటి ఇలాంటి విషయాలు? మీ న్యూస్ ఎడిటర్ బిక్షపతిగారు మాకు బాగా పరిచయం. వారానికోసారి బాటిల్స్ అప్పుడప్పుడూ డబ్బులూ పట్టుకుని వెళ్తుంటారు. మీరే మాకు దూరంగా ఉంటుంటారు. రండిసార్ ! ఈ రోజు స్టేషన్‌కు వెళ్లకుండా మీకోసం వెయిట్‌చేస్తుం టాను” ఆహ్వానించాడు.

జనార్ధన్‌తో అశోక్‌వర్ధన్‌కు అంతసన్నిహిత పరిచయం లేకపోయినా అతనెలాంటివాడో బాగా తెలుసు. అతనికి జనార్ధన్ అనే పేరుకన్నా ధనార్జన్ అనే పేరు పెట్టిఉంటే బాగుండేదని అంతా అంటూ ఉంటారు. తన ఉద్యోగాన్ని అడ్డంపెట్టుకుని పుష్కలంగా కలెక్షన్లు చేసుకోవడమే అతని డ్యూటీ.

గతంలో ఏసీబీకి రెండుసార్లు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడినా తన పంథాను మార్చుకోని ఘనచరిత్ర అతనిది.

మంత్రి ధర్మరాజు సిఫార్సులతో ఆకేసులనుంచి బయటపడి తంతే బూర్లెగంపలో పడినట్లు విశాఖ పట్నంలో పోస్టింగు దక్కించుకున్నాడు.

మంత్రి ధర్మరాజు ఇంట్లో పనిచేస్తున్న ఓ పదిహేనేళ్ల బాలికపై ఇతగాడి కన్నుపడింది.
ఎప్పటికప్పుడు మంత్రి ఇంటికి వెళ్లే జనార్ధన్‌కు రెండు సార్లు ఆ అమ్మాయి టీ అందించింది.
అంతే తన వయసుని కూడా మర్చిపోయి ఆ అమ్మాయి తనతో ఒక రాత్రి గడిపితే ఐదువేలు ఇస్తానని ఆమె తల్లిని ఒప్పించి తనింటికి ఆమెను రప్పించుకున్నాడు.
ఈ వ్యవహారాన్ని పసిగట్టిన సత్యనాగేష్ ఆ కామాంధుడైన ఇన్స్‌ఫెక్టర్ గుట్టు రట్టు చేసాడు.

భయం భయంగా బిక్కు బిక్కు మంటున్న ఆ అమ్మాయిని తనపైకి లాక్కొని జనార్ధన్ సరససల్లాపాలు మొదలు పెట్టేలోగానే విజువల్స్‌ను రహస్యంగా చిత్రీకరిస్తున్న కెమెరామెన్‌తో కలిసి సత్యనాగేష్ లోపలికి వెళ్లాడు.
ఈ హఠాత్ సంఘటనతో బెంబేలెత్తిన జనార్ధన్ బాత్‌రూమ్‌కు పరుగుతీసి దాక్కొన్నాడు. ఆ అమ్మాయి పెరటి దారినుంచి బయటకు పారిపోయింది.
ఇదీ అక్కడ జరిగిన తతంగం.

"ఎవరైనా మైనర్ బాలికను ప్రలోభపెట్టి లైంగికంగా లొంగదీసుకోవాలని చూస్తే అది అత్యాచారం కిందకే వస్తుందని చట్టం చెబుతోంది. చట్టాన్ని అమలు చేయాల్సిన అధికారే దానిని అడ్డదారిలో తొక్కేస్తూ మైనర్‌బాలికతో వ్యభిచారానికి సిద్ధం కావడం దారుణమైన విషయం" అంతకు మించి ఆలోచించలేదు అశోక్‌వర్ధన్.

ఈ విషయం బిక్షపతికి చెబితే ఖచ్చింగా వార్తను పెట్టనీయడు. ఎందుకంటే జనార్ధన్‌తో బిక్షపతికి ఉన్న సంబంధం అలాంటిది మరి.

అన్ని వివరాలు ఫోటోలు వార్తలతో సహా సిద్ధం చేసుకున్న తర్వాత ఈ విషయాన్ని న్యూస్ నెట్‌వర్క్ ఇన్‌చార్జ్ విష్ణుప్రకాష్‌కు ఫోన్లో చెప్పాడు అశోక్‌వర్ధన్.
అతను చెప్పిన విషయమంతా విని ఆయన సంబరపడిపోయాడు.
"అర్జెంటుగా ఆవార్తని, ఫొటోలని మెయిన్‌కు పంపించు. చాలా సెన్సేషన్ అవుతుంది మనం మాత్రమే ఎక్స్‌క్లూజివ్‌గా ఇద్దాం" చెప్పాడు.
"ఓకే సార్! థ్యాంక్యూ సార్! " ఆనందంగా అన్నాడు అశోక్‌వర్ధన్.
ఆవార్తను సమగ్రంగా రూపొందించి మెయిల్‌లో పంపించాడు అశోక్‌వర్ధన్.
దానిని చదివిన తర్వాత మధ్యాహ్నం రెండుగంటల సమయంలో బిక్షపతికి విష్ణుప్రకాష్ ఫోన్ చేసాడు.

“మీ స్టాఫ్ రిపోర్టర్ మంచి వార్త పంపించాడయ్యా ”
“అతనదో టైపు! ఏం పంపించాడో ఏమిటో? తలా తోకా లేకుండా రాసేస్తాడు సార్...పెద్ద తలనొప్పి”
“మంచి సెన్సేషన్ న్యూస్ అది...రీడబులిటీ కూడా బాగా పెరుగుతుంది”
“ అదేం వార్తో నాకైతే తెలియదు..... మీరు చెప్పండి సార్!” ఆత్రంగా అడిగాడు బిక్షపతి.

“ఎక్సైజ్ ఇన్స్‌ఫెక్టర్ జనార్ధన్ అనేవాడు పదిహేనేళ్ల మైనర్ బాలికతో రహస్యంగా కామకలాపాలు జరుపుతున్నట్లు ఫోటోలతో సహా వచ్చిన వార్త అది” చెప్పాడు విష్ణుప్రకాష్.

ఎక్సైజ్ ఇన్స్‌ఫెక్టర్ జనార్ధన్ పేరు వినగానే మరింత కలవరానికి లోనైనాడు బిక్షపతి. వెంటనే సర్దుకుని
“బాగా చూడండి సార్! జనార్ధన్ గురించి నాకు బాగా తెలుసు....మన స్టాఫ్ రిపోర్టర్‌కు అతనంటే గిట్టదు. ఏదో రాసి పంపించేసి ఉంటాడు. మనకు లీగల్‌గా ప్రాబ్లెమ్స్ రావొచ్చు”

“ఇందులో లీగల్ ప్రాబ్లమ్స్ ఏముంటాయి? అంతా కళ్లకు కట్టినట్లు ఫోటోలు కూడా ఉన్నాయి.” చెప్పాడు విష్ణుప్రకాష్.

“సార్! నిజంగా జరిగిందేమిటో తెలుసుకుంటాను. నాకు కొంచెం టైమ్ ఇవ్వండి. తొందరపడి ఒక నిర్ణయానికి రాకండి.” రిక్వెస్టు చేసాడు బిక్షపతి.

“సరే సాయంత్రం ఎండీ గారితో మీటింగ్ జరిగే సమయానికి అంతా తెలుసుకుని చెప్పు” అన్నాడు ఆవతల్నుంచి విష్ణుప్రకాష్.

విష్ణుప్రకాష్ కాల్ కట్ చేసాడు.

బిక్షపతికి ఎక్సైజ్ ఇన్స్‌ఫెక్టర్ జనార్ధన్‌తో పరిచయానికి కారణం అంతకుముందు నెల రోజుల కిందట అశోక్‌వర్ధన్ రాసిన వార్తాకథనమే.

ఇతర రాష్ట్రాల నుంచి విశాఖపట్నం జిల్లాకు వస్తున్న నాన్‌డ్యూటీ పెయిడ్ లిక్కర్ గురించిన వార్త అది. అన్ని ఆధారాలతో వచ్చిన ఆ వార్తాకథనం ఎక్సైజ్ అధికారుల్లోనే కాదు, వారితో సంబంధం ఉన్న విలేకరుల్లోనూ సంచలనం సృష్టించింది.

నెలవారీ మామ్మూళ్లని ఎక్సైజ్ శాఖ నుంచి అందుకుంటున్న త్రిముఖం పత్రిక క్రైమ్ రిపోర్టర్ జ యరామ్‌కు ఆ వార్త మింగుడుపడలేదు. తనకు బాగా లైజన్ ఉండి పోషకులుగా ఉన్న అధికారులపైనే ఆవార్త రావడంతో తట్టుకోలేకపోయాడు.

వెంటనే బిక్షపతి దగ్గరకు వెళ్లి అశోక్‌వర్ధన్‌పై ఫిర్యాదు చేసాడు.

బిక్షపతిని తీసుకెళ్లి జనార్ధన్‌కు పరిచయం చేసాడు. బిక్షపతికి బాగా ఇష్టమైన బ్రాండ్లు ఏమిటో తెలుసు కుని మందు విందు కూడా తనింట్లోనే జనార్ధన్ ఏర్పాటు చేసాడు.

అలా అక్రమ మద్యం వార్తకు ఫాలోఅప్ కథనాలు రాకుండా చేసిన ఏర్పాట్లకు, ఇచ్చిన సొమ్ముకు మొత్తం కలిపి అంతా అరవై వేల రూపాయలు వరకూ ఖర్చైంది జనార్ధన్‌కు.

దీంతో వారిద్దరి మధ్య పరిచయం స్నేహంగా మారింది. సన్నిహిత సంబంధం ఏర్పడింది. అలాంటి పరిస్థితుల్లో ఈ న్యూస్ వస్తే తనకు,జనార్ధన్‌కు మధ్య అంతా చెడిపోతుందని, తనకు రావాల్సిన మద్యం, మనీ చేజేతులా కోల్పోయినట్లేనని బిక్షపతి కంగారు పడుతున్నాడు.
ఇంతలో జనార్ధనే బిక్షపతికి ఫోన్‌చేసాడు.
"గుడ్ మార్నింగ్ సార్! ఎలా ఉన్నారు?"
"నేను బాగానే ఉన్నాను...మీరు ఎలా ఉన్నారు?"
"మీ స్టాఫ్ రిపోర్టర్ అశోక్‌వర్ధన్ గొప్ప ప్రోబ్లమ్‌గా మారాడు మాకు"
"చెప్పండి...ఏమైనా ఇమ్మని అడిగాడా మీకు...ఇప్పుడే మా పైవాళ్లకు కంప్లైంట్ చేస్తా " ఉత్సాహంగా అడిగాడు బిక్షపతి.
"అటువంటిదేం లేదండి...మందుతాగే అలవాటు లేదు...మనీ పంపించినా వద్దంటాడు"
"అయితే మీ కేమిటి సమస్య? రెండూ మిగిలినట్లే కదా?"
"అక్కడే నండీ అసలు సమస్య. తెలిసింది తెలిసినట్లుగా...ఉన్నది ఉన్నట్లుగా రాసేసి ఇరుకున పెట్టేస్తుం టాడు. "
"అసలేం జరిగిందో చెప్పండి"
"పెద్ద ఇష్యూ ఏమీ కాదండీ...డిపార్ట్‌మెంటుకు కూడా ఎలాంటి సంబంధం లేనిదండీ. నా వైఫ్ పుట్టింటికి వెళ్లిపోయాక సింగిల్‌గా ఇంట్లో ఉంటున్నాను. ఆవిషయం మీకు తెలుసు. ఏదో కాస్త కక్కుర్తిపడి ఒక అమ్మాయిని రాత్రికి బుక్‌చేసుకున్నా...ఇంకా పనిమొదలు పెట్టనేలేదు. ఈలోగా పాపులర్ ఛానల్ రిపోర్టరట సత్యనాగేష్ అని ఒకతను విజువల్స్ తీయించేసి నానారభస చేసేసాడు. దాంతో ఆ అమ్మాయి పారిపోయింది. ఇక్కడితో సమస్య తీరిపోలేదు. ఆ టీవీ రిపోర్టర్ ఫోటోలు, వివరాలను మీ స్టాఫ్‌రిపోర్టర్‌కు ఇచ్చాడట. మీ వాడు ఎవడు చెప్పినా వినడట. ఏం చేయాలో తెలియడం లేదు. అందుకే మీకు ఫోన్ చేసాను" వివరించాడు జనార్ధన్.
"అలా జరిగిందా! అతను ఆన్యూస్‌ని నాకు తెలియకుండానే హెడ్డాఫీసుకు పంపించేసాడని ఇప్పుడే తెలిసింది. నా పరిధిలో అయితే ఏమైనా చేయగలను. అక్కడైతే ఎండీగారు, ఎడిటర్‌గారు, మిగిలిన పెద్దలుంటారు.ఏం చేయగలను నేను చెప్పండి?" అన్నాడు బిక్షపతి.
"ఏమీ చేయలేరా నాకోసం? నెల నెలా మీకు నేను మీ కంపెనీ ఇచ్చే జీతం కన్నా ఎక్కువే ఇస్తున్నాను. ప్రతీ శని ఆదివారాల్లో మీరు ఇష్టపడే బ్రాండ్ లిక్కర్‌ను మీ ఇంటికే పంపిస్తున్నాను. మీ కోసం ఇంత నేను చేస్తుంటే నాకోసం ఏమీ చేయలేనని చేతులెత్తేయడం ఏమీ బాగోలేదండీ! " నిష్ఠూరంగా అన్నాడు జనార్ధన్.

“మీకు ఇంతకు ముందే చెప్పాను కదా! నా పరిధి దాటి హైదరాబాద్ ఆఫీసు వరకూ వెళ్లిపోయింది. ఇష్యూ. ఏం చేయగలను నేను చెప్పండి”

“చూడండీ ఎంత ఖర్చైనా పర్వాలేదు. మీ రిపోర్టర్ జ్ఞానప్రసాద్‌కు కూడా ఈ విషయం చెప్పాను”

“ఆయన కూడా వారి డివిజన్లో స్టాఫ్ రిపోర్టరేనట కదా! ఆయన మీకు రిపోర్టరైనా మా లిక్కర్ సిండికేట్‌లో పార్టనర్. రెండు వైన్‌షాపులు, వాటి పరిధిలో ఇరవై బెల్టుషాపులు కూడా అతనికిఉన్నాయి . మీ కన్నా ముందునుంచీ అతనితో పరిచయం మాకుంది”

“ఓహో ! అలాగా!!”

“ఆయనే చెప్పాడు మూడు లక్షలు ఇస్తే వార్త రానివ్వకుండా చూసుకుంటామని, ఎందుకంటే ఇది మా డిపార్ట్‌మెంటుకు చెందిన వ్యవహారం కాదు. పర్సనల్ ఇష్యూ ఎలాగైనా ఆపించండి. ఇది బయటపడితే నాకు పరువుపోతుంది. అంతేకాదు నాకుటుంబం కూడా చిన్నాభిన్నమైపోతుంది. నేను బుక్‌చేసుకున్న అమ్మాయికన్నా కాస్తా పెద్దవయసుఉన్న కూతుళ్లిద్దరు నాకున్నారు. ఇంట్లోనూ బయటా తలెత్తుకు తిరగలేను” బతిమాలుతున్న ధోరణిలో చెప్పాడు.

“సరే నండీ! మా హెడ్డాఫీసులో మంచీ చెడులు బాగా తెలిసిన ఒక పెద్దాయన ఉన్నారు. నేను మాట్లాడుతాను...మీరు క్యాష్ రెడీ చేసుకోండి” భరోసా ఇచ్చాడు బిక్షపతి.

వెంటనే విష్ణుప్రకాష్‌కు ఫోన్‌చేసాడు బిక్షపతి.

“ఎలాగైనా ఆవార్త ఆపకపోతే తనకు అత్మహత్యే శరణ్యమని జనార్ధన్ అంటున్నాడని, వార్త రాకుండా చేస్తే లక్ష రూపాయలు ఇస్తామని అంటున్నాడని” చెప్పాడు.

కొంత సమయం వారిద్దరి మధ్య తర్జనభర్జనలు జరిగిన తర్వాత “తనకు లక్ష రూపాయలు సరి పోదని,రెండు లక్షల రూపాయలైతే ఆ వార్తని ఆపడానికి ప్రయత్నిస్తానని ” విష్ణుప్రకాష్ తన నిర్ణయం చెప్పాడు.

“సరే సార్! నేను మాట్లాడుతాను.ఏవిషయం మీకు ఫోన్ చేస్తాను. కొంచెం ఫేవర్ చేయండి ”రిక్వెస్టు చేసాడు బిక్షపతి.

అలా ఒక అరగంట సమయం గడిచిన తర్వాత బిక్షపతి మళ్లీ విష్ణుప్రకాష్‌కు ఫోన్ చేసాడు.

“సార్! నేను జనార్ధన్‌తో మాట్లాడాను. లక్షాయాభైవేల రూపాయలు ఇస్తాను. ఎలాగైనా మానేజ్‌చేసి ఈ అపద నుంచి గట్టెక్కించాలని ఏడుస్తున్నాడు” అని చెప్పాడు.

కొన్ని నిమిషాల మౌనం తర్వాత

“సరే నేను చూసుకుంటాను. ఆ క్యాష్ నా అకౌంట్ నంబర్‌కు వెంటనే పంపించు” అని చెప్పి విష్ణుప్రకాష్ కాల్ కట్‌చేసాడు.

వెంటనే ఆశోక్‌వర్ధన్‌కు ఫోన్ చేసాడు విష్ణుప్రకాష్

"ఏంటయ్యా! వార్త అలా రాసి పంపించావు? వారిద్దరికీ ఇష్టమైతే మనకొచ్చిన కష్టం ఏమిటి? అది ఆఎక్సైజ్ ఇన్స్‌ఫెక్టర్ వ్యక్తిగత విషయం కదా? సమాజానికి, ప్రభుత్వానికీ నష్టం ఏమిటి? ఇలాంటి పని కిమాలిన వార్తలు రాసి మా టైమ్ ఎందుకు వేస్టు చేస్తావ్?" అన్నాడు ఆగ్రహంగా.
"అదికాదు సార్! బాధ్యతాయుతమైన ప్రభుత్వ అధికారి...అందులోనూ ఆ అమ్మాయి పదిహేనేళ్ల వయసులో ఉన్న మైనర్‌బాలిక ...ఏదైనా వ్యభిచారం చట్టవిరుద్ధం కదా సార్!....." అంటూ చెబుతున్న అశోక్‌వర్ధన్ మాటలను పట్టించుకోకుండానే
"ఇలాంటి పనికిమాలిన వార్తలు రాస్తే నీవు ఎన్నాళ్లో ఈ ఉద్యోగం చేయలేవు...గుర్తుంచుకో" అంటూ హెచ్చరించి ఫోన్ కట్‌చేసాడు విష్ణుప్రకాష్.

ఆరోజు సాయంత్రమే జనార్ధన్ నుంచి మూడు లక్షల రూపాయలు జ్ఞానప్రసాద్ ద్వారా బిక్షపతి ఇంటికి చేరాయి. వాటిలో యాభైవేల రూపాయలు బిక్షపతి తీసేసి జ్ఞానప్రసాద్‌కు ఇచ్చేసాడు. లక్షా యాభైవేల రూపాయలను విష్ణుప్రకాష్ పర్సనల్ అకౌంట్లో వేసాడు. మిగిలిన లక్ష రూపాయలను తన సంపాదన గాఉంచుకున్నాడు.
అశోక్‌వర్ధన్ ఊహించినట్లే మరుసటిరోజు పత్రికలో ఆవార్త రాలేదు.

ఎందుకు ఆవార్త రాలేదన్న విషయాన్ని విష్ణుప్రకాష్‌కు అడగాలని ఒకదశలో అన్పించినా ఆవిష యాన్ని తెలుసుకోవాలనుకున్న ప్రయత్నాన్ని అశోక్‌వర్ధన్ మానుకున్నాడు.

ఆతర్వాత రెండు రోజులకే ఆ వార్త ఎందుకు పేపర్లో రాలేదో ...? ఎవరికి ఎంత ముట్టిందో కూడా అశోక్‌వర్ధన్‌కు తెలిసిపోయింది.

జనార్ధనే ఒక చోట నోరుజారాడు

"ఈ పేపరోళ్లు పెద్ద పత్తిత్తుల్లా ఫోజులు కొడుతుంటారు. ఒక చిన్న ఇష్యూకి రాద్ధాంతం చేసేసి తన దగ్గర మూడు లక్షల రూపాయలు గుంజేసారు" అని అతనికి సన్నిహిత మిత్రుడైన ఒక కానిస్టేబుల్ దగ్గర వాపోయాడు.

ఆ కానిస్టేబుల్ అశోక్‌వర్ధన్‌కు "ఇలా జరిగిందట నిజమేనా?" అని సందేహంగా అడిగాడు.

"ఏమో....నాకు తెలియదు..." అన్నాడు అశోక్‌వర్ధన్. దానిపై ఏమీ అతనికి చెప్పలేదు.

×××× ××× ××××

మంత్రి ధర్మరాజు ఆగ్రహావేశాలతో ఊగిపోతున్నాడు.
దానికి కారణం త్రిముఖం పత్రికలో ఆరోజు పతాకశీర్షికతో వచ్చిన కథనం.
మంత్రి కొడుకుకీ, ఇద్దరు పీఏలకీ దొంగనోట్ల ముఠాలతో ఉన్న సంబంధాలపై సమగ్రంగా వచ్చిన కథనం అది.

దానిని చూసే అతడు పట్టలేనంత ఆగ్రహంతో ఊగిపోతున్నాడు. ఎవరు పలకరించినా అగ్గిమీద గుగ్గిలమైపోతున్నాడు.

నిజానికి అశోక్‌వర్ధన్ ఆ కథనాన్ని పది రోజుల కిందటే హెడ్డాఫీసుకు పంపించాడు. గత అనుభవాల దృష్ట్యా దాని ప్రచురణ గురించి విష్ణుప్రకాష్‌ను రిక్వెస్టుచేయడం మానుకున్నాడు. వేస్తే వేస్తారు..లేక పోతే లేదు. తన శ్రమ వృధాగా మిగిలిపోతుంది.అనే అభిప్రాయానికి వచ్చేసి నిర్లిప్తంగా ఊరుకున్నాడు.

విష్ణుప్రకాష్ శెలవులో ఉన్న సమయంలో సెంట్రల్‌డెస్క్ ఇన్‌ఛార్జ్ ఆ కథనాన్ని చూసి బాగుందనుకుని పబ్లిష్ చేసేసాడు త్రిముఖం పత్రికలో.

అది పరోక్షంగా మంత్రి ధర్మరాజు ఇమేజ్‌ని డామేజ్ చేసేసింది. అప్పటికే ఆశోక్‌వర్ధన్‌కు ఫోన్ చేసి మంత్రి " నా దగ్గర చెడుమనుషులు కూడాఉంటారు. వారు ఊరుకోరు. నీ అంతు తేలుస్తారు"అంటూ వార్నింగ్ కూడా ఇచ్చాడు.

న్యూస్ ఎడిటర్ బిక్షపతికి మంత్రి ఫోన్‌చేస్తే "తాను క్యాంపులో ఉన్నానని...వచ్చాక మాట్లాడదామని, అంత అర్జెంట్ అయితే హైదరాబాద్ ఆఫీసులోని విష్ణుప్రకాష్‌తో మాట్లాడుకుంటే సరిపోతుందని ఆయనే అంతా చూసుకుంటారని"చెప్పాడు. అతని ఫోన్ నంబర్‌ను ధర్మరాజుకు పంపించాడు.

ఆరోజు సాయంత్రమే హైదరాబాద్‌లోని ఒక స్టార్‌హోటల్‌లోని విలాసవంతమైన గదిలో మంత్రి ధర్మరాజుకీ, విష్ణుప్రకాష్‌కీ భేటీ జరిగింది.

"అశోక్‌వర్ధన్ తన మాట పట్టించుకోవడం లేదని, తనకి వ్యతిరేకంగావార్తలు రాస్తూ తనను రాజకీయంగా ఇబ్బందులు పెడుతున్నాడని" మంత్రి ధర్మరాజు చెప్పుకొచ్చాడు.

"అంతే కాదని తన రాజకీయ ప్రత్యర్థుల చేతిలో అతనొక అస్త్రంగా మారిపోయాడని, మీ పత్రిక పరువును బజారుకు ఈడుస్తున్నాడని, తన సొంత జిల్లాలో థర్మల్ పవర్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా పోరాడుతున్నవారిని ఎంకరేజ్ చేస్తూ వార్తలు రాస్తున్నాడని" విష్ణుప్రకాష్‌కు చెప్పాడు.

ధర్మరాజు చెప్పిందంతా విన్న విష్ణుప్రకాష్ " అశోక్‌వర్ధన్‌పై కంప్లైయింట్స్ ఎక్కువ వస్తున్నాయని, అయితే సంస్థలోని ఎండీగారూ, మరికొంతమంది అతని విషయంలో సాఫ్ట్‌కార్నర్‌తో ఉన్నారని, నేరుగా ఎండీ గారితో మాట్లాడితే బాగుంటుందని" సలహా ఇచ్చాడు.

" సరే..! ఒక ఇష్యూలో మీ ఎండీ రామకోటి నామీద కొంచెం కోపంతో ఉన్నారు. ఆయనని కూల్ చేసాక కలుస్తాను. ఈలోగా మీరునాగురించి ఆయనకు బాగా ఫేవర్‌గా చెప్పండి" అన్నాడు ధర్మరాజు.

"తప్పకుండా చెబుతాను....ఎప్పుడు కలవాలనుకుంటున్నారు?" అడిగాడు విష్ణుప్రకాష్.

"మీ పత్రిక, ఛానల్ ఆఫీసులకు ప్రభుత్వ స్థలం తక్కువధరకే కావాలని రెండేళ్ల కిందట రామకోటి పెట్టిన ఫైలు ఇంకా పెండింగ్‌లోనే ఉంది కదా! ఆ ఫైల్‌ను క్లియర్ చేయిస్తాను. తక్కువ ధరకేమిటి?

ఉచితంగానే ప్రభుత్వం ద్వారా కేటాయించేస్తా. మంత్రి వర్గ సమావేశంలో తీర్మానం చేయించి జీఓ తీసుకొస్తా. కోట్ల రూపాయల విలువైన స్థలాన్ని కేటాయిస్తా మీకు. ఇదంతా పదిరోజుల్లో పూర్తి చేసి అప్పుడు మీ ఎండీని కలుస్తా!!" ఉత్సాహంగా చెప్పాడు ధర్మరాజు.

"ఓకే అలాగే చేయండి...నేనీలోగా మా ఎండీగారితో మాట్లాడి కొంత కూల్ చేస్తాను" హామీ ఇచ్చాడు విష్ణుప్రకాష్.

అంతలోనే తన పీఏ ఈశ్వరరావుని ఫోన్లో పిలిపించాడు ధర్మరాజు.

ఓ ఐదు నిమిషాలు గడిచిన తర్వాత చేతిలో ఒక కవర్‌తో వారున్న గదిలోకి వచ్చాడు ఈశ్వరరావు.

ఆకవర్‌ని విష్ణుప్రకాష్‌కు ఇమ్మని పీఏకు చెప్పాడు ధర్మరాజు. దానిని అందుకున్న విష్ణుప్రకాష్ అందులో ఏముంటుందో? ఎంతుంటుందో? అని అంచనాలు వేసుకుంటుండగా "అందులో యాభైవే లు ఉంది. మీరు ఎల్లప్పుడూ టచ్‌లో ఉండండి. మీకేమంచిది " భరోసా ఇచ్చాడు ధర్మరాజు.

ధర్మరాజు దగ్గరనుంచి నేరుగా ఇంటికి చేరుకోగానే అశోక్‌వర్ధన్‌కు ఫోన్ చేసాడు విష్ణుప్రకాష్.

"ఏం అశోక్! ఎలా ఉన్నావు?"

"ఫైన్ సర్! ఏమిటి విశేషాలు?"

"ఏమీ లేవు లే...మీ మినిస్టర్ ఎవరో ధర్మరాజట కదా!"

"అవునండీ....ఏం జరిగింది?"

"పెద్దగా ఏమీ లేదు..లే..నువ్వు అతనిపై పనిగట్టుకుని వ్యతిరేకంగా వార్తలు రాస్తున్నావని ఎండీ గారి దగ్గర ఏడుస్తున్నాడు"

"పనిగట్టుకుని నేనెందుకు వార్తలు రాస్తాను సార్! ఆయన మీద నాకు వ్యక్తిగతమైన కోపం ఎందుకుం టుంది? ఆయన మంత్రిగా ఉంటూ చేసే ప్రజా వ్యతిరేక కార్యక్రమాల గురించే వార్తలు రాస్తున్నాను"

"ఆ విషయం నాకు తెలుసులే. ఇకనుంచి ఎలాంటి వార్త కూడా నెగిటివ్‌గా అతని గురించి రాయొద్దు"

"మీ ఇష్టం సార్! మీరు ఎలా చెబితే అలాగే" అన్నాడు అశోక్‌వర్ధన్.

హోటల్ రూమ్‌లో విష్ణుప్రకాష్‌కు హామీ ఇచ్చినట్లే అన్ని పనులూ వారం రోజుల్లో చకచకాచేసేసాడు. వంద కోట్ల రూపాయల విలువైన భూమిని అడ్డగోలు జీఓలతో పత్రికాఫీసుకోసం ఉచితంగా కేటాయిం చేసాడు.

త్రిముఖం పత్రికలో,దాని యాజమాన్యంలోని టీడీఎన్ ఛానల్ లో మంత్రి ధర్మరాజుకు వ్యతిరేకంగా వార్త కాదు కదా! ఒక్క అక్షరం కూడా రాకుండా ఆగిపోయింది.

××× ××× ×××

హెడ్డాఫీసు నుంచి విష్ణుప్రకాష్ ఆశీస్సులు పుష్కలంగా ఉండడంతో బిక్షపతిని అదుపు చేసే వాళ్లే లేకపోయారు.

జర్నలిజం విలువలకు కట్టుబడి నిజాయితీగా పనిచేయాలనుకునే జర్నలిస్టులకు బిక్షపతి దాదాపు నరకం చూపించాడు. వారు రాసిన వార్తలు పేపర్లో పబ్లిష్ కాకుండా అడ్డుకోవడం. కొన్నిసార్లు వాటిని డెస్క్‌లోనే ఉంచేసి ఆ సమస్య తీవ్రత తగ్గిన తర్వాత వారం పది రోజులకు పేపర్లో ఏదోమూల ప్రాధాన్యత లేని పేజీల్లో ప్రచురించడం చేసేవాడు.

డెస్కులో కూడా సబ్‌ఎడిటర్లని బాగా టార్చర్ పెట్టడంతో సీనియర్లు పదిమంది న్యూస్ విట్నెస్ పత్రికకు వెళ్లిపోయారు.

ఇతర చిన్నాచితకా పత్రికల్లో కంప్యూటర్ ఆపరేటర్లుగా ఉన్నవారిని తీసుకొచ్చి సబ్‌ఎడిటర్లుగా జాయిన్ చేసేసాడు. కంప్యూటర్ ఆపరేటర్లకు సబ్‌ఎడిటర్ ఉద్యోగాలు ఇప్పించడంతో కూడా చేతివాటాన్ని చూపించాడు. ఒక్కొక్కరి దగ్గరనుంచి పది పదిహేను వేల రూపాయల దాకా పిండేసాడు.

వారికి కనీసం తెలుగుభాషలో ఎన్ని అక్షరాలుంటాయో తెలియకపోవడంతో నందికీ పందికీ తేడా తెలియకుండా వార్తలను ఎడిటింగ్ చేసేసి త్రిముఖం పత్రికను తప్పుల తడకగా మార్చేసారు.
దీనికంతటికీ కారణమైన బిక్షపతి మాత్రం తాను వసూలు చేసిన సొమ్ములో కొంత భాగాన్ని పైవాళ్లకు పంపిస్తుండడంతో అన్ని తప్పులకూ అశోక్‌వర్ధన్‌నే టార్గెట్ చేస్తూ విష్ణుప్రకాష్ పదేపదే టార్చర్ చేస్తున్నాడు.

రిపోర్టర్ల వ్యవస్థని కూడా తన గుప్పిట్లో ఉంచుకోవడానికి పక్కావ్యూహాన్ని అమలుచేసాడు బిక్షపతి.

కొందరు రిపోర్టర్లనుంచి బియ్యం బస్తాలు, మరికొందరి నుంచి చేపలు, చికెన్, వైన్‌షాపులున్న విలేకరుల దగ్గరనుంచి అవసరమైనప్పుడల్లా మందు, కొంతమంది నుంచి నెలవారీ కలెక్షన్లు ఇలా తన ఆదాయానికి ఢోకాలేకుండా చేసుకున్నాడు.

కలెక్షన్లలో బాగా ఆరితేరిన రిపోర్టర్లని ఎంపిక చేసి వారిని అప్పుడప్పుడూ విష్ణుప్రకాష్ దగ్గరకు పంపించేవాడు.

నీతి నిజాయితీలకు విలువనిచ్చే రిపోర్టర్లవార్తలను క్రమేపీ ప్రచురించడం తగ్గించేసాడు. తాము రాసిన వార్తలు రాలేదని ఏ రిపోర్టరైనా పొరపాటున అడిగితే అతనిపై గయ్యి మంటూ లేచేవాడు. ఇలాంటి ప్రతిస్పందన బిక్షపతి నుంచి ఎదురౌతుండడంతో తమ వార్తలు ఎందుకు రావడం లేదని రిపోర్టర్లు అడగడం మానుకున్నారు.

అశోక్‌వర్ధన్ స్టాఫ్ రిపోర్టర్‌గా ఉన్నప్పటికీ అతని వార్తలను పక్కనపడేసి తనకు మందు,మనీ,మాంసం కూరలు అందించే జ్ఞానప్రసాద్ వంటి లోకల్ రిపోర్టర్ల చేతే జిల్లా స్థాయి వార్తలు రాయించాడు. వారు

ఇతర పత్రికల్లో వచ్చిన వార్తలను మక్కీకి మక్కీ కాపీ కొట్టేసి వాటి ఆధారం త్రిముఖం పత్రికను నింపేసేవారు.

×××× ××× ××××

న్యూస్ ఎడిటర్ బిక్షపతి అవినీతి వ్యవహారాలు కేవలం రిపోర్టర్ల నెట్‌వర్క్‌తోనే ఆగలేదు. విష్ణుప్రకాష్ లాంటి పెద్దవాళ్లంతా తనకు అండగా ఉన్నారని చెప్పి కొత్తగా జాయిన్ అయిన బ్రాంచ్ మేనేజర్ వరహాల్రాజుని బ్లాక్‌మెయిల్ చేసి తన గుప్పిట్లో ఉంచుకున్నాడు.
సౌజన్యారావు న్యూస్‌ఎడిటర్‌గా ఉన్న సమయంలో బ్రాంచ్‌మేనేజర్ శ్రీనివాస్ మేనేజ్‌మెంట్ ఇచ్చిన ఆదేశాలను తూచ తప్పకుండా పాటించి కంపెనీకి ఆదాయాన్ని పెంచాడు. అందుకు భిన్నంగా వరహాల్రాజు వ్యవహరించడం మొదలుపెట్టాడు.
తనకన్నా దిగువ కేడర్‌లోని న్యూస్‌ఎడిటర్ బిక్షపతి సబ్‌ఎడిటర్లమీద, రిపోర్టర్ల మీద ఒక నియంతలా వ్యవహరిస్తూ మేనేజ్‌మెంటు ఇచ్చే జీతం కన్నా నాలుగురెట్లు అదనంగా సంపాదిస్తుండడం చూసి అతనికీ పై సంపాదనపై ఆశపెరిగింది.
ఉదయం నుంచీ రాత్రి వరకూ ఆఫీసునే అంటి పెట్టుకుని ఉన్న వరహాల్రాజుకు అక్కడే స్వీపరుగా పనిచేస్తున్న రాజ్యంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. వారిద్దరూ మెషిన్ సెక్షన్ వెనుకనున్న గదిలో మంచి రసపట్టులో ఉంటూ బిక్షపతి కంటపడిపోయారు. అప్పటినుంచీ వరహాల్రాజు బిక్షపతి చేతిలో కీలుబొమ్మగా మారిపోయాడు.
బ్రాంచ్‌మేనేజర్‌ని గుప్పిట్లో ఉంచుకున్న బిక్షపతి అక్కడితో ఆగలేదు.
తనతో కూడా సన్నిహితంగా ఉండాలని రాజ్యంపై వత్తిడి తెచ్చాడు. లేకపోతే ఆమెకూ వరహాల్రాజుకూ మధ్యనున్న భాగోతమంతా ఆమె మొగుడికి చెప్పేస్తానని బెదిరించాడు.
నిస్సహాయపరిస్థితుల్లో రాజ్యం ఇంట్లో ఉన్నప్పుడు మొగుడితోనూ...ఆఫీసులో ఉన్నప్పుడు బిక్షపతి, వరహాల్రాజులతో సంసారం చేయడానికి అలవాటు పడిపోయింది.
బిక్షపతి దారిలోనే వరహాల్రాజు కూడా రిపోర్టర్లని దోచుకోవాలని పథకం అమలు చేసాడు.
రిపోర్టర్లకు నెలవారీ ఇవ్వాల్సిన పారితోషికాల్లో కోత పెట్టేసాడు. జిల్లాలోని రిపోర్టర్లకు నెలకు రెండు లక్షల రూపాయలు పారితోషికంగా వస్తే మేనేజ్‌మెంటు ఏభైవేలే పంపించిందని చెప్పి దానిని కూడా సరిగా పంపిణీ చేసేవాడుకాదు. మిగిలిన సొమ్ములో తానుయాభైవేలు, బిక్షపతి యాభైవేలు ఉంచుకొని తక్కిన యాభైవేల రూపాయల్ని విష్ణుప్రకాష్ ఖాతాకు పంపించేసేవారు.

నెలనెలా పారితోషికం సక్రమంగా ఇవ్వకపోవడంతో మండలాలు,పట్టణాలలలో పనిచేసే రిపోర్టర్లు కూడా బాగా చేతివాటానికి అలవాటు పడిపోయారు. రేషన్‌డీలర్లు, హాస్టళ్లు, వైన్‌షాపులు,

అంగన్వాడీ కేంద్రాలు, ఎరువుల డీలర్లు, క్వారీలు...ఇలా ఒకటేమిటి ? ఎక్కడెక్కడినుంచి అక్రమ ఆదాయం వస్తోందో దాన్నుంచి దండుకోవడంలో బిజీ అయిపోయారు.

ఒకప్పుడు ఏ రిపోర్టర్‌పైనైనా అవినీతి ఆరోపణలు వస్తే మేనేజ్‌మెంటు తీవ్రంగా స్పందించి అతనిని తొలగించి ఆతనిస్థానంలోమరొకరిని వేసుకునేది. అయితే విష్ణుప్రకాష్, బిక్షపతి లాంటివాళ్లు ఎక్కువయ్యాక అక్రమవసూళ్లు చేయలేని, బ్లాక్‌మెయిల్ వార్తలు రాయలేని రిపోర్టర్లని పక్కనపెట్టడం ఎక్కువైంది.

వరహాల్రాజు అక్రమసంపాదన రిపోర్టర్ల కష్టార్జితాన్ని దోచుకోవడంతో ఆగలేదు. ప్రకటనల విషయంలో కూడా తన చేతివాటాన్ని చూపించాడు. రిపోర్టర్లుకు ఇవ్వాల్సిన పదిశాతం కమీషను కూడా తన ఖాతాలోకి మళ్లించుకోవడం, రిపోర్టర్లు చెల్లించిన సొమ్ముకు రశీదులు ఇవ్వకుండా తన జేబులో వేసుకోవడం, మేనేజ్‌మెంటుకు రిపోర్టర్లే బకాయిలు చెల్లించడం లేదని చెప్పడం, కంపెనీ పేరుతో వచ్చిన చెక్కులను కూడా రకరాల అడ్జెస్టుమెంట్లతో మాయాజాలం చేసి యాభై లక్షల రూపాయల వరకూ వెనకేసుకున్నాడు.

వరహాల్రాజుకు ఈ విషయంలో సంపూర్ణ సహకారం అందించిన బిక్షపతి ఇటు మేనేజ్‌మెంటు ఆదాయానికి కన్నం వేసి, అటు రిపోర్టింగ్ నెట్‌వర్క్ ద్వారా రెండు కోట్లకు తక్కువలేకుండా సంపాదించాడు.

త్రిముఖం పత్రికను అడ్డంపెట్టుకుని వీరు చేస్తున్న అక్రమాలపై అశోక్‌వర్ధన్ హెడ్డాఫీసుకు ఫిర్యాదు చేసినా ఫలితం లేకుండా పోయింది. వీరి అక్రమ సంపాదనకు విష్ణుప్రకాష్ దన్నుండడంతో దానివల్ల ఫలితం లేకపోయింది.

మరోవైపు అశోక్‌వర్ధన్‌పై శత్రుత్వాన్ని పెంచుకున్న మంత్రి ధర్మరాజు త్రిముఖం మేనేజ్‌మెంటుకు వంద కోట్ల రూపాయలు విలువైన భూమిని ఉచితంగా అందించడం వంటి వాటివలన అతని ఆవేదన హెడ్డాఫీసులో ఆరణ్య రోదనగానే మిగిలింది.

తమ మీద అశోక్‌వర్ధన్ ఫిర్యాదు చేసాడని తెలుసుకున్న బిక్షపతి, వరహాల్రాజులు అతనిని అడ్డు తప్పించేయాలనే నిర్ణయానికి వచ్చేసారు. తగిన సమయం కోసం ఎదురుచూస్తున్నారు.

స్టాఫ్ రిపోర్టర్‌ని పట్టించుకోవాల్సిన అవసరం లేదని అతనిని తీసేస్తున్నామని రిపోర్టర్లలో బిక్షపతి అశోక్‌వర్ధన్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేసాడు.

కొంతమంది రిపోర్టర్లు తాము నేరుగా న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జితోనే వ్యవహారాలు నడుపుకుంటూ ఉండడంతో స్టాఫ్‌రిపోర్టర్ అనవసరమనే నిర్ణయానికి వచ్చేసారు.

రోజూ ముఖ్యమైన వార్తలు, షెడ్యూళ్ల వివరాలకోసం ఆర్‌సీ ఇన్‌ఛార్జిలకు అశోక్‌వర్ధన్ ఫోన్‌చేసినా వారు లిఫ్ట్ చేయడం మానేసారు.

అశోక్‌వర్ధన్‌పై వేధింపులు మరింత ఎక్కువయ్యాయి. విశాఖపట్నం జిల్లాలో ఏదైనా జరిగినట్లు న్యూస్ ఛానల్‌లో ఎలాంటి స్క్రోలింగ్ వచ్చినా దానిగురించి అతనికి ఫోన్‌చేసి విష్ణుప్రకాష్ నానా హడావిడీ చేసేవాడు. సంబంధిత లోకల్ రిపోర్టర్లకు అశోక్‌వర్ధన్ వాటివివరాలకోసం ఫోన్‌చేసినా వారు లిఫ్ట్ చేయడం మానేసారు.

ఇదంతా తమ వ్యూహంలో భాగమని ముందే తెలిసిన విష్ణుప్రకాష్ "రిపోర్టర్లనుంచి అవసరమైన సమాచారాన్ని తెప్పించుకోలేని నీవేమి స్టాఫ్ రిపోర్టర్‌వి" అంటూ అశోక్‌వర్ధన్‌ను తూలనాడడం ప్రారంభించాడు.

త్రిముఖం పత్రికలో రిపోర్టర్లు నెలవారీ పారితోషికాలకు నోచుకోక పైసంపాదనకు అలవాటు పడి కేవలం పేజీలునింపడానికే ఏవో వార్తలు రాసేస్తుండడంతో సర్క్యులేషన్ బాగా తగ్గి పోయింది. దీనికి కారణం అశోక్‌వర్ధనేనని బిక్షపతితో ఒక రిపోర్టుని తెప్పించి విష్ణుప్రకాష్ దానిని రామకోటి ముందు పెట్టి అతనిని తొలగించాలని చెప్పడం మొదలుపెట్టాడు.

అశోక్‌వర్ధన్ ఈ పేపరుపేరుని అడ్డంపెట్టుకుని కలెక్షన్లుచేసుకుంటూ ఉండడం వలన ప్రకటనల ఆదాయం తగ్గిపోతోందని రామకోటి చెవిలో విష్ణుప్రకాష్ జోరీగలా రొదచేయడం ఎక్కువైంది.

నిజానిజాలు తెలుసుకోని రామకోటి కూడా ఫోన్లో అశోక్‌వర్ధన్‌పై చిందులు తొక్కడం ప్రారంభించాడు. ఇలాంటి ప్రతికూల పరిణామాల మధ్య ఉద్యోగం నుంచి తప్పుకోవాలనే నిర్ణయానికి వచ్చాడు అశోక్‌వర్ధన్.

×××                    ××××                    ×××

వారం రోజులపాటు మనసులోనే మధనపడిన అశోక్‌వర్ధన్‌లో స్టాఫ్‌రిపోర్టర్ ఉద్యోగం వదిలేయాలన్న నిర్ణయం మరింత బలపడింది. అదే విషయాన్ని సూర్యప్రసాద్ దగ్గర ప్రస్తావించాడు.

" ఎందుకు ఉద్యోగం వదిలేయాలనుకుంటున్నావ్? "

"మనశ్శాంతి కరువైపోతోంది...డెడికేట్ అయ్యి చేయలేకపోతున్నా"

"ఏం జరిగింది? ఎందుకా నిరాశానిస్పృహలు ?"

"మీరు పనిచేసే కాలంలో మీడియారంగం ఎలా ఉండేదో గానీ ఇప్పుడు మాత్రం అస్తవ్యస్థంగా మారింది"

" అంటే!?"

"అవకాశవాద జర్నలిజం....అంతా డబ్బు మయం...బ్లాక్ మెయిల్ వార్తలు...వార్తలు రాయకుండా ఉండడానికి సొమ్ములు....వార్తలు పేపర్లో రాకుండా ఉండడానికి మామూళ్లు....ఎక్కడికక్కడే ఎవరికి వారే అక్రమాల రొంపిలో మునిగితేలుతున్నారు"

"చిత్తశుద్ధితో నీపని నువ్వు చేసుకుంటూవెళ్లు ...మిగిలిన వాళ్లతో నీకేం పని?"

"జర్నలిజం అంటే అక్షరాలను అడ్డం పెట్టుకుని...అవసరమైతే వాటినే ఆయుధాలుగా చూపించి అంతో ఇంతో దోచుకోవడంలా మార్చేసారు"

"అంటే జర్నలిజం ఎర్నలిజంలా రూపాంతరం చెందిందా?"

"సరిగ్గా అంతే....జర్నలిస్టు అని చెప్పుకోవడానికి సిగ్గుపడే విధంగా వ్యవస్థని దిగజార్చేసారు"

"ఎవరు తయారు చేసారు? అలా!"

"ఇందులో అందరూ భాగస్వాములే ....బహుశా నా ప్రత్యక్షప్రమేయం లేకపోయినా నేను కూడా ఇందులో ఉన్నానేమో....?"

"నేను పనిచేసే రోజుల్లో కూడా ఇలాంటి పరిణామాలు అంతర్లీనంగా ఉండేవి. ఎవరైనా జర్నలిస్టు అవినీతి పనులకు, అక్రమాలకు పాల్పడినట్లు తేలితే అతనిని పత్రికనుంచి బయటకు పంపించివేసే వాళ్లం"

"ఇప్పుడు అది తారుమారైంది. నిజాయితీగా ఉండాలనుకునే జర్నలిస్టులను పొమ్మనకుండా పొగపెట్టి బయటకు తరిమేస్తున్నారు"

"అప్పట్లో పత్రికలు కొన్ని కేంద్రాలకే పరిమితమై ఉండేవి. మహా ఉంటే రాష్ట్రవ్యాప్తంగా నాలుగైదు ఎడిషన్లు ఉండడమే పెద్ద గొప్ప. ఇప్పుడు జిల్లాకొక ఎడిషన్ సెంటర్ వచ్చేసింది. ఏ ఎడిషన్లో ఉన్న న్యూస్ ఎడిటర్ తానే ఎడిటర్గా ఫీలౌతున్నాడు. మేజేజ్‌మెంట్‌కు, ఎడిటోరియల్ విభాగాలకు మధ్యన ఉన్న సరిహద్దు రేఖ పూర్తిగా అదృశ్యమైపోయింది. అక్షరాల విలువలు తెలియనివాళ్లు కూడా పేపర్లు టీవీఛానళ్లు పెట్టి వాటికి వలువలు విప్పేస్తున్నారు"

"ప్రజల్లో కూడా పత్రికలను టీవీ ఛానళ్లను నమ్మలేని ధోరణి ఈ మధ్యకాలంలో బాగా పెరిగింది "

"అవును ఒకప్పుడు పత్రికలో ఏమైనా వస్తే దానికి చాలా ప్రాధాన్యతను ప్రజలు ఇచ్చేవారు. కానీ రానురానూ వాటికి విలువ ఇవ్వడం మానేసారు. పత్రిక పేరు చూసే అందులో ఎలాంటి వార్తలు ంటాయో...అది ఏ రాజకీయ పార్టీకి కరపత్రమో...లేదంటే ఏ రాజకీయపార్టీకి...ఏ కార్పోరేట్ సంస్థకు రిపోర్టర్లు పెంపుడు జంతువులో ఇట్టే చెప్పేస్తున్నారు."

"పత్రికా స్వేచ్ఛ అంటే స్వేచ్ఛగా జర్నలిస్టులు ప్రజల సమస్యలపై వార్తలు రాసే పరిస్థితి ఎక్కడా లేదు. అంతా మేనేజ్‌మెంటు స్వేచ్ఛ. వారికి తాబేదారులుగా ఉన్న మరికొంతమంది మీడియా ప్రతినిధుల స్వేచ్ఛ...అంతకు మించి మరేమీ లేదు"

" అది సరే! ఈ రకం కలుషిత వాతావరణం అన్ని రంగాల్లోనూ ఉంది. దానికి ఈ మీడియా, పత్రికలు ఏమాత్రం మినహాయింపు కాదు"

"మరెందుకు మేడిపండులాంటి నటనలు? ఈ సమాజానికి తామేమేలుకొలుపు పలికే వైతాళికులమని , అందర్నీ తామే చైతన్య పరుస్తున్నామని ...కొంత మంది మీడియా పెద్దల ప్రగల్బాలు అంత అవసరమా?"

"వారికి అవసరమే...అలా మభ్యపెడితేనే కదా ...కొంతమందైనా జనం వాటిలో ఏమిటో ఉందని గొర్రెల్లా పత్రికలు చదువుతారు. టీవీ ఛానళ్లలో న్యూస్ చూస్తారు. అనే అభిప్రాయం వారిది. వ్యాపార పోటీ ప్రపంచంలో అదే జరుగుతోంది"

"పాత్రికేయ విలువలకు కట్టుబడి వార్తలు సేకరించడం, రాయడం. నిత్యం సమాజంలోని అవినీతిపరులతోనూ, సంఘవిద్రోహశక్తులతోనూ రిపోర్టర్ పోరాడకతప్పడం లేదు. అదే సమయంలో చివరికి తాను పనిచేసే సంస్థలో ఉన్నవారితో కూడా పోరాటం చేస్తూ పనిచేయాల్సిరావడం దుర్భరం"

"అలా అయితే కష్టమే. వ్యవస్థంతా ఒక దారిలో వెళ్తున్నప్పుడు అందులో ఉన్నవాళ్లు ఎవరైనా మరో దారిలో వెళ్తామంటే ఆ వ్యవస్థకు బాధ్యత వహించే వ్యక్తులు అంగీకరించరు. ఇక్కడ వారి ఇగోలు దెబ్బతింటాయి. తమ అహాన్ని సంతృప్తిపర్చుకోవడానికి వారు దేనికైనా వెనుదీయరు. తమ కింద పనిచేసేవారి ఆత్మాభిమానాన్ని దెబ్బతీయడమే గొప్ప విజయంగా వారు పరిగణిస్తుంటారు. కార్పోరేట్ వ్యవస్థల్లో ఈ జాఢ్యం తీవ్రంగా ఉంది. ఇది నైపుణ్యం గలవారి కేరీర్‌కు ప్రమాదకరంగా మారుతోంది"

"ఇప్పుడు చెప్పండి...మనసు చంపుకుని లోలోపలే మధనపడుతూ ఎంతకాలం పనిచేయగలను? మానసికంగా సంసిద్ధంగా లేను. అందువల్లే ఇలాంటి సమయంలోనే తప్పుకుంటే మంచిదని నాకు అన్పిస్తోంది"

"నీవైపు నుంచి ఆలోచిస్తే నువ్వు చెప్పేది కరెక్టే కానీ నిర్ణయం నీది...దానిని తీసుకునేటప్పుడు అన్ని కోణాలనుంచీ ఆలోచించు. ప్రత్యామ్నాయం చూసుకున్న తర్వాతే ఏ నిర్ణయమైనా తీసుకో" తన అనుభవం రీత్యా చెప్పాడు సూర్యప్రసాద్.

తండ్రి చెప్పినట్లే అన్ని కోణాల నుంచి ఆలోచించి ప్రత్యామ్నాయం చూసుకుని త్రిముఖం నుంచి నిష్క్రమించాలని అనుకున్నాడు అశోక్‌వర్ధన్.

రిపోర్టింగ్ చేయడానికి మానసికంగా సంసిద్ధంగాలేనని గుర్తించిన అశోక్‌వర్ధన్ తనకు ఆరోగ్యం బాగోలేదని కొన్ని రోజులు శెలవు కావాలని న్యూస్‌నెట్‌వర్క్ ఇన్‌ఛార్జికి ఒక లెటర్ ఈమెయిల్‌లో పంపించాడు. అదే లెటర్ కాపీలను బిక్షపతికీ, వరహాల్రాజుకీ పంపించేసాడు. దానిపై వారు ఏం ప్రతిస్పందించిందీ తెలుసుకోవాలనుకోలేదు. వారిద్దరూ వాటిని కావాలనే తొక్కిపెట్టేశారు.

అయితే ఆ తర్వాత రెండు రోజుల్లో జరిగిన పరిణామాలు అశోక్‌వర్ధన్ అంచనాలను తారుమారు చేసాయి.

×××                                        ×××                                        ×××

చెన్నై నుంచి కోల్‌కతా వెళ్లే జాతీయ రహదారి...

రాత్రి ఒంటిగంట దాటిపోవడంతో చిమ్మచీకటి

మంచుదుప్పటి ప్రకృతిని కప్పేసింది.

ఆచీకటి పొరలనూ మంచుతెరలనూ వెలుగులతో చీల్చుకుంటూ రాజమండ్రి నుంచి విశాఖపట్నం వైపు వస్తోంది ఒక స్కార్పియో వాహనం.

అందులో ముగ్గురున్నారు. వారిలో ఒకరు ప్రతిపక్షంలో సీనియర్ నేత నాగేంద్రనాయుడు, మరొకరు ఆపార్టీ జిల్లా అధ్యక్షుడు వెంకట రమణమూర్తి, మూడోవ్యక్తి చలపతినాయుడు. వారంతా రాజమండ్రిలో ఒక నాయకుని ఇంట్లో జరిగిన పెళ్లికి వెళ్లొస్తున్నారు.

ఆ మరుసటి రోజు నాగేంద్రనాయుడు పార్టీకార్యకర్తల సమావేశంలో పాల్గొనాల్సి ఉన్నందున వివాహవేడుకల్లో ఆలస్యమైనా రాత్రికి రాత్రే విశాఖపట్నానికి చేరుకోవడానికి హడావిడిగా వస్తున్నారు ముగ్గురూ.

వాహనాన్ని నాగేంద్రనాయుడు డ్రైవ్ చేస్తుండగా మిగిలినఇద్దరూ ఆయనతో తర్వాత రోజు జరిగే పార్టీకార్యకర్తల సమావేశంలో ఏఏఅంశాలనుఎజెండాగా ఉంచాలన్నదానిపై చర్చిస్తున్నారు.

వెంకటరమణమూర్తి మొదట్నుంచీ నాగేంద్రనాయుడికి విధేయుడే. అందువల్లే అతనికి పార్టీ జిల్లా అధ్యక్షస్థానం దక్కింది. మరొక నాయకుడు చలపతినాయుడు. పేరులో చలపతి అని ఉన్నా చపలచిత్తానికి అతడు మరోపేరు.

చలపతినాయుడు పార్టీపేరుతో నిరంతరం పబ్లిసిటీకి ప్రాణం ఇచ్చేస్తాడు. ఆరోజు మాత్రం నాగేంద్రనాయుడి ప్రాణాన్ని తన సొంత పబ్లిసిటీకి పణంగా పెట్టేసాడు. ఇతడు ఆయనకు విధేయుని గా నటిస్తూనే అధికారపార్టీలోని మంత్రి ధర్మరాజుకు కూడా నమ్మినబంటుగా వ్యవహరిస్తుంటాడు. ఇతనికి నారాజ్యం పత్రికలోని కొంతమంది రిపోర్టర్లతో సన్నిహిత సంబంధాలున్నాయి. వారిని మందు, విందులతో సంతృప్తి పరుస్తుంటాడు. అందువల్ల అతను తుమ్మినా దగ్గినా ఆపత్రికలో ఫోటోలతో సహా ప్రచురిస్తుంటారు.

రోజూ పేపర్లలో తన ఫోటోలు,వార్తలు వస్తుంటే చూసుకొని మురిసిపోయే ప్రచారఖండూతి తర్వాతే అతనికి ఏదైనా! ఎవరైనా!!

వారు ముగ్గురూ ఒకరితో ఒకరు మాట్లాడుకుంటూ వస్తున్నారావాహనంలో. పాయకరావు పేట దాటిన తర్వాత ఒక మలుపులో ఆగి ఉన్న కంటైనర్ లారీని దగ్గరకు వెళ్లేటంతవరకూ చూసుకో లేకపోయారు.

నాగేంద్రనాయుడు తాను డ్రైవ్ చేస్తూ వస్తున్న స్కార్పియోకు బ్రేకులు వేసి కంట్రోల్ చేయలేక పోయాడు. అంతే ఆగిఉన్న కంటైనర్ లారీని వెనుకనుంచి స్కార్పియో  పెద్ద శబ్దంతో ఢీకొంది.

ఈ ప్రమాదఘటనలో స్కార్పియో ముందుభాగం నుజ్జునుజ్జు అయిపోయింది. స్టీరింగ్ బలంగా నాగేంద్రనాయుడు ఛాతీకి గుద్దుకుంది. మిగిలిన ఇద్దరికీ స్వల్పగాయాలయ్యాయి.

చాతీపై ఢీకొన్న స్టీరింగ్ వత్తిడి వలన నాగేంద్రనాయుడు శ్వాసపీల్చుకోవడానికి నరకయాతన పడుతున్నాడు. వెంటనే అంబులెన్స్‌కు ఫోన్ చేయాలని మొబైల్ తీసిన చలపతినాయుడుకు వెంటనే పబ్లిసిటీ గుర్తుకొచ్చింది.

అంబులెన్స్ వచ్చేలోగా నారాజ్యం రిపోర్టర్లను రప్పిస్తే ఎక్స్‌క్లూజివ్‌గా ఈ ఇన్సిడెంట్‌తో పాటు తాము కూడా మెయిన్‌లో హైలైట్ అవుతామన్న ఆలోచన అతనిని నిలువెల్లా అవరించింది.

వెంటనే నారాజ్యం పత్రిక రిపోర్టర్ రాజేష్ కు ఫోన్ చేసాడు. అతడు ఫొటోగ్రాఫర్ వెంకటేష్‌కు ఫోన్ చేసి సంఘటనా స్థలానికి చేరుకోవడానికి అరగంట ఆలస్యమైంది.

అప్పటికే అంత బాధలోకూడా “తనని వెంటనే హాస్పటల్‌కి తీసుకెళ్లి ఆక్సిజన్ పెట్టించాలని” నాగేంద్రనాయుడు ఆయాసంతో రొప్పుతూ చెబుతున్నాడు.

“సార్! అంబులెన్స్ ఆన్‌ది వే లో ఉంది. వచ్చేస్తోంది.” అంటూ చలపతినాయుడు చెబుతున్నాడు. ఈలోగా నేటిదినం రిపోర్టర్,ఫొటోగ్రాఫర్ వచ్చి ఫోటోలు తీసారు. వెంటనే ఆఫీసుకు ఈ న్యూస్ ఇవ్వాలని వెళ్తామంటూ తాము తీసుకొచ్చిన కారులో నాగేంద్రనాయుడినైనా తీసుకుని వెళ్లకుండానే అక్కడి నుంచి ఆఫీసుకు వెళ్లిపోయారు.

అప్పటికి నాగేంద్రనాయుడు సజీవంగా ఉండడంతో మరుసటి రోజు నారాజ్యం పత్రికలో సీనియర్ నేత నాగేంద్రనాయుడికి తీవ్రగాయాలు అనేవార్త వచ్చింది.

నారాజ్యం రిపోర్టర్,ఫోటోగ్రాఫర్‌లు అక్కడినుంచి వెళ్లిపోయాక అంబులెన్స్‌కు ఫోన్ చేసాడు చలపతి నాయుడు. గాయాలపాలై నిస్సహాయంగా ఈ వ్యవహారమంతా చూస్తున్న నాగేంద్రనాయుడు, వెంకట రమణమూర్తిలకు చలపతినాయుడు అంటే అసహ్యం వేసింది.

చావుబతుకుల మధ్య ఉన్న సమయాన్ని కూడా పేపర్లో ప్రచారానికి ఆడుకోవాలనిచూసిన అతని కక్కుర్తికి వారిద్దరూ విస్తుపోయారు .ఈలోగాఅంబులెన్స్‌వచ్చింది. అప్పటికే నాగేంద్రనాయుడు ఆయాసంతో కొనఊపిరితోఉన్నాడు. మరోకొన్ని క్షణాల్లో కోమాలోనికి చేరిపోయేటట్లు కనిపిస్తున్నాడు.

అంబులెన్స్ సిబ్బంది అతనిని వెంటనే తమవాహనంలోకి ఎక్కించి అతనితోపాటు రమణమూర్తిని చలపతినాయుడిని కూడా ఆసుపత్రికి తీసుకు వచ్చారు. ఆసుపత్రిలోని ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌కి వెంటనే స్ట్రచ్చర్‌పై నాగేంద్రనాయుడిని తీసుకువెళ్లారు. మిగిలిన ఇద్దరికీ తగిలిన గాయాలకు డ్రస్సింగ్ చేసారు.

ఐసీయూలోని బెడ్‌పై చేర్చేసరికే నాగేంద్రనాయుడు తుదిశ్వాస విడిచాడు. నాగేంద్రనాయుడు చనిపోయిన విషయాన్ని వెంటనే మంత్రిధర్మరాజుకు తెలియజేసాడు ఫోన్‌లో చలపతినాయుడు.

మంత్రిధర్మరాజుకు చిరకాలప్రత్యర్ధి నాగేంద్రనాయుడు. వారిద్దరూ ఒకే పార్టీలో ఉన్నా ధర్మరాజు చేసే అవినీతి వ్యవహారాలు, అక్రమాలను ఎప్పటికప్పుడు పత్రికలు,టీవీ ఛానళ్ల ద్వారా ప్రజల ముందు ఉంచడంచేస్తుంటాడు నాగేంద్రనాయుడు. అక్కడితో ఆగకుండా వాటిపైఆధారాలు సంపాదించి న్యాయ పోరాటంకూడా చేస్తున్నాడు.

ఇన్నాళ్లూ తన ప్రక్కలో బల్లెంగాఉన్న నాగేంద్రనాయుడు ఇక లేడని తెలిసి ధర్మరాజు ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. వెంటనే నాగేంద్రనాయుడు భౌతికదేహానికి నివాళులు అర్పించడానికి ఆసుపత్రికి బయలుదేరాడు మంత్రి ధర్మరాజు ముఖంనిండా విషాదాన్ని పులుముకొని.

ఈలోగా సమాచారం తెలిసి పత్రికలు, టీవీఛానళ్ల విలేకర్లు ఆసుపత్రికి చేరుకున్నారు.అప్పటికే న్యూస్‌ఛానళ్లలో స్క్రోలింగ్‌లు వచ్చేస్తున్నాయి. కొంత మంది త్రిముఖం పత్రిక వారికికూడా ఈసమాచారం పోన్ ద్వారా తెలియజేసినా వారు పట్టించుకోలేదు.

అశోక్ వర్ధన్ సెలవులోఉండడంతో ఆయన స్థానంలోఉన్న ట్రైనీ స్టాఫ్‌రిపోర్టర్ విజయానంద్ సకాలంలో సమాచారాన్ని తెలుసుకోలేకపోయాడు. రాత్రంతా తాగిన మత్తులో ఉండి న్యూస్‌ఎడిటర్ బిక్షపతి నిద్రలో జోగుతున్నాడు మొబైల్‌ఫోన్ స్విచ్ ఆఫ్ చేసేసి. అప్పటికే త్రిముఖం పత్రిక ఆరోజు ఎడిషన్ ప్రింట్‌అయిపోయింది.

నాగేంద్రనాయుడు మృతి చెందాడన్న వార్తను టీవీ స్క్రోలింగ్‌లో చూసినటీఎన్‌టీవీ ఛానల్ ఎండీ రామకోటి కూడా విష్ణుప్రకాష్‌కు ఫోన్ చేసాడు. మనవాళ్లు ఏంచేస్తున్నారు మన ఛానల్లో స్క్రోలింగ్ కూడా రావడం లేదని ఆగ్రహం వ్యక్తం చేసాడు.

ఈవైఫల్యాన్ని కూడా తమకనునూలంగా మార్చుకోవాలని విష్ణుప్రకాష్ వ్యూహరచన చేసాడు. బిక్షపతి కూడా తన కలెక్షన్లకు అశోక్‌వర్ధన్ అడ్డుగా ఉన్నాడని ఎప్పటి నుంచో అనుకుంటున్నాడు. ఎలాగోలా అతని అడ్డు తప్పిస్తే గానీ తన కలెక్షన్ల వ్యాపారం సజావుగా జరగదని బిక్షపతి భావిస్తున్నాడు. అంతే బ్రాంచ్‌మేనేజర్ వరహాల్రాజుని కలుపుకొనిముగ్గురూ ఒక్కటయ్యారు.

వారిద్దరి దగ్గరనుంచీ అశోక్‌వర్ధన్‌కు వ్యతిరేకంగా ఒక నివేదిక తెప్పించుకున్నాడు విష్ణుప్రకాష్. అశోక్‌వర్ధన్ డ్యూటీకి అటెండ్ కాకుండా ఏ సమాచారామూ లేకుండా, ఎక్కడికోవెళ్లిపోయాడని, అతనికి నాగేంద్రనాయుడు మృతి చెందిన విషయం తెలిసినా ఉద్దేశ్యపూర్వకంగా త్రిముఖం పేపర్ కు ఇవ్వలేదని ఇలారకరకాల ఆరోపణలతో ఆ నివేదిక సిద్దంచేసేసారు.

దానినే రామకోటి ముందు పెట్టాడు విష్ణుప్రకాష్. "అంత నిర్లక్ష్యంగా ఉంటే మనకి అశోక్‌వర్ధన్ అవసరంలేదని అతనిని తొలగించండంటూ" నోటిమాటగా చెప్పేసాడు రామకోటి. ఆవిషయాన్ని భిక్షపతి రిపోర్టర్లసమావేశం నిర్వహించి మరీ ఎంతోసంతోషంగా ప్రకటించాడు.

ఈసమయంలోనే విష్ణుప్రకాష్ ఫోన్‌చేసి అశోక్ వర్ధన్ కు చీవాట్లుపెట్టాడు. అప్పటికే మంత్రి ధర్మరాజు ప్రోద్భలంతో అశోక్‌వర్ధన్‌ను తమ పత్రిక నుంచి బయటకు పంపించడానికి అంతర్గత నిర్ణయం తీసుకుని ఉన్నారు. ఈలోగా నాగేంద్రనాయుడు ప్రమాదవార్త త్రిముఖంలో మిస్సింగ్ కావడంతో దానికి ఏకైక బాధ్యుడిగా అశోక్ వర్ధన్‌ను చూపించేసారు.

ఆర్కే బీచ్ నుంచి జ్యోతిర్మయితో కలిసి ఇంటికి చేరాక భోజనం చేసి మంచం మీద పడుకుంటూ అశోక్ వర్ధన్ ఇదంతా గుర్తు చేసుకుంటూ అన్యమనస్కంగా నిద్రలోకి జారాడు.

××× ×××× ×××

సోమవారం ఉదయం తొమ్మిది గంటలకే అశోక్‌వర్ధన్ ఇంటికి వచ్చిందిజోతిర్మయి.

అంతకుముందురోజే మానసికంగా క్రుంగిపోయిన అతనిని చూసి ఆమె కూడా బాధ పడింది. అయితే బాధపడడం వల్ల ప్రయోజనం లేదని ఇకముందేం చేయాలో ఆలోచించుకుని ఒకనిర్ణయానికి వచ్చింది. దానిని చెప్పడానికే అశోకవర్ధన్ ఇంటికెళ్లింది జ్యోతిర్మయి.

అప్పటికే తాను ఎదుర్కొన్న పరిణామాలన్నింటినీ సూర్యప్రసాద్‌కు వివరించి చెబుతున్నాడు అశోక్‌వర్ధన్.

"ఇప్పుడు చెప్పండి నాన్నా ఇంకా నేనెలా పని చేయగలను. ఇంతటి ప్రతికూల వాతావ రణం మధ్య మానసికంగా కూడా అనారోగ్యం వచ్చేస్తోందని భయమేస్తోంది."

"నిజమే...ఇప్పుడు పత్రికా రంగం దారుణంగా తయారైంది. కానీ ప్రత్యామ్నాయం లేదు. మరి కొంత సహనంతో వేచిచూడాల్సింది. పరిస్థితులు ఎల్లప్పుడూ ఒకేలా ఉండవుకదా!"

"అదెలా చెప్పగలం? ఇంతకంటే మరింత దుర్భరంగామారిపోయే పరిస్థితి కూడా ఉంటుంది కదా!" సూర్యప్రసాద్ ఏదో అనబోతుండగా

"అశోక్ చెప్పింది నిజమే అంకుల్ !. అక్షరాలమాటున అడుగడుగునా చీడపురుగులు పొంచి ఉన్న రోజులివి" అంది అప్పుడే అక్కడికి వచ్చిన జ్యోతిర్మయి.

ఆమెను చూసి " రామ్మా! కూర్చో" అన్నాడు సూర్యప్రసాద్.

"ఎం చేద్దామంటారైతే!?" జోతిర్మయి,అశోక్‌వర్ధన్‌ల వైపు చూస్తూ అడిగాడు సూర్యప్రసాద్.

"ఇందులో చేయడానికేముంది అంకుల్ ! అన్ని ప్రైవేటు కంపెనీలలోనూ జరిగే వ్యవహారమే ఇది. పొమ్మనలేక పొగపెట్టడం అంటారే అదే ఇది. ఇది అశోక్ ఒక్కడికే వచ్చిన సమస్య కాదు. చాలా

మీడియా సంస్థలలో ఇదే పరిస్థితి ఉంది. తమ అక్రమ సంపాదనకుఎవరైనా అడ్డుపడతారనుకుంటే చాలు అతనిని బయటకు పంపించడమే పరమావధిగా చాలా మంది ఉంటారు. బయటకు నీతులు వల్లించే మీడియా యజమానులు కూడా ఇటువంటి వారి చేతుల్లో కీలు బొమ్మలే."

"ఏమాత్రం ప్రతిభ, నిజాయితీ అవసరం లేదా? "

"ఎవరికి అవసరం అంకుల్? మీరు పనిచేసే రోజుల్లోలాగా పత్రిక,మీడియా వ్యవస్థ ఉందని అపోహల్లో ఉన్నారు. అప్పటికీ ఇప్పటికీ చాలామారిపోయింది. జర్నలిజాన్ని ఎర్నలిజం ఎప్పుడో డామినేట్ చేసేసింది. దాని నుంచి ఎవరూ తప్పించుకోలేరు. ఒకవేల ఏటికి ఎదురీదినట్లు ఒకరో ఇద్దరో ఉన్నా వారికి ఇటువంటి పర్యవసానాలు తప్పవు."

"ఈ పత్రికా రంగం నుంచి నాకైతే తప్పుకోవాలని లేదు. కానీ ప్రత్యామ్నాయం చూసుకోవాలి. మిగిలిన పత్రికలలో కూడా ఇలాగే ఉంటుందని నేననుకోవడంలేదు" అన్నాడు అశోక్‌వర్ధన్.

"అది నువ్వెలా చెప్పగలవు. పార్టీల జెండాల రంగులు రకరకాలుగా కనిపిస్తున్నా నాయకుల స్వభావం ఒక్కటే. అలాగే పత్రికల పేర్లు, వాటి యాజమాన్యాలు వేరు వేరుగా ఉన్నా అందరి స్వభావా లు ఒక్కటే. అందులో ఏం తేడా ఉండదు. ఇప్పుడుమీడియా సంస్థలు, రాజకీయ నాయకులు అంతా కార్పొరేట్ వ్యవస్థ తాలూకా నీడలు మాత్రమే. అవన్నీ స్వతంత్రంగా కదులుతూ ఉన్నట్లు కనిపిస్తాయి. అటూ ఇటూ నడుస్తూ ఉన్నట్లు భ్రమింపజేస్తాయి. నిజానికి కార్పొరేట్ శక్తులు ఎటు నడిపిస్తే అటు నడిచే నీడలు మాత్రమే ఇవి. నిజాలకు ఇందులో తావులేదు" చెప్పింది జ్యోతిర్మయి.

"అయితే ఒక పని చేస్తే బాగుంటుంది" అన్నాడు అశోక్‌వర్ధన్.

"ఏమిటది ?" ఆసక్తిగా అడిగాడు సూర్యప్రసాద్.

"మనమే సొంతంగా ఒక పత్రికను ప్రారంభిస్తే ఎలా ఉంటుందని ఆలోచిస్తున్నా" మనసులోమాట బయటపెట్టాడు అశోక్‌వర్ధన్.

"మంచిదే కానీ పెట్టుబడులు ఎలా? " సందేహంతో అన్నాడు సూర్యప్రసాద్.

అలా సుమారు ఒక గంట సమయం తర్జన భర్జనలు పడిన తర్వాత ఒక నిర్ణయానికి వచ్చారు ముగ్గురూ.

"మీరు చెప్పింది కొంతవరకూ నిజమే అంకుల్! ప్రతీ పత్రికా, మీడియా సంస్థ కూడా ప్రారంభ సమయంలో సమర్ధత గలిగిన వారిని నియమించుకొంటూ ఉంటాయి. అలా ఐదారు సంవత్సరాలు గడిచాక , మార్కెట్లో బాగా నిలదొక్కుకున్న తర్వాత వారిని రకరకాల సాకులతో బయటకు పంపించే స్తోంది. అటువంటివారిని మనం సమీకరించుకోగలిగితే మనం అనుకున్నట్లు ఒక పత్రికను తీసుకురా వడం కొంత కష్టమైనా అసాధ్యం మాత్రం కాదు." అంది జ్యోతిర్మయి.

“అవును పెట్టుబడిదారుల భాగస్వామ్యంతో కాకుండా జర్నలిస్టుల భాగస్వామ్యంలోనే పత్రికను తీసుకొస్తే ఎక్కడికక్కడ ఎవరికి వారు అది తమ సొంతం అని బాధ్యతగా పని చేస్తారు” ఆశాభావంతో చెప్పాడు అశోక్‌వర్ధన్.

“మరింకెందుకు ఆలస్యం ఫేస్‌బుక్, ట్విట్టర్, గూగిల్ ప్లస్ లాంటి సోషల్ మీడియా ద్వారా అందరినీ కాంటాక్టుచేసి వారందరితో మీటౌదాం. ఈరోజే నీ ఐడియాస్ ఏమిటో సోషల్ మీడియాలో పోస్టు చేయ్” అంటూ అశోక్‌వర్ధన్‌కు సలహా ఇచ్చింది జ్యోతిర్మయి.

త్రిముఖం పత్రిక గురించి ఇక ఆలోచించాల్సిన పనిలేదని తీర్మానించుకున్నాడు అశోక్‌వర్ధన్. కొత్తగా ఒక పత్రికను జర్నలిస్టుల భాగస్వామ్యంతోనే పెడుతున్నట్లు అందుకు నైపుణ్యం, అనుభవం గలవారి సహకారం కోరుతున్నట్లు సోషల్ మీడియాలో పోస్టింగులు పెట్టాడు.

వాటికి అనుకూలంగా చాలా మంది లైక్ చేస్తూ సహకరిస్తామని స్పందించారు. కొంతమంది ఇది వృధా ప్రయాస అని కూడా కామెంట్లు పెట్టారు.

××× ××× ×××

అశోక్‌వర్ధన్ త్రిముఖం పత్రికలో ఉద్యోగం వదిలేసి ఐదు నెలలకు పైగా గడిచింది. ఈ వ్యవధి లోనే చాలా పరిణామాలు జరిగిపోయాయి.

రాష్ట్రం రెండుగా విడిపోయింది. ప్రధానమైన తెలుగు పత్రికలు తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ ఎడిషన్ల వారీగా తమ యూనిట్ కార్యాలయాలను విభజించాయి.

అంతలోనే పత్రికల్లో పనిచేస్తున్న ఉద్యోగులకు వేజ్‌బోర్డుల సిఫార్సులు అమలు చేయాలని న్యాయస్థానం తీర్పునిచ్చింది. ఈ తీర్పుని అమలు చేయడానికి ఇష్టంలేని యాజమాన్యాలు అడ్డదారులు వెతుకున్నాయి. తమ సంస్థల్లో సీనియర్లైన వారిని బయటకు పంపించి తక్కువవేతనాలకు పనిచేస్తున్న జూనియర్లనే ఉద్యోగాల్లో కొనసాగించడానికి ప్రణాళికలు అమలు చేస్తున్నాయి.

ఎడిషన్ కేంద్రాల సంఖ్యని తగ్గించేసి కేవలం ప్రింటింగ్ ఆఫీసులనే ఉంచేసి ఐదారు జిల్లాల ఏడిషన్ల డెస్కులకు ఎక్కడో మారుమూల గ్రామాల్లో ఆఫీసులు పెట్టి రకరకాల ఎత్తుగడలతో జర్నలిస్టులకు కుచ్చుటోపీ పెట్టడం ప్రారంభించాయి.

ఈ పరిణామాలను తమకు అనుకూలంగా మార్చుకోవాలని అశోక్‌వర్ధన్, సూర్యప్రసాద్‌లు ప్రయత్నాలు చేసారు.

రెండు రాష్ట్రాల్లో వందమందికి పైగా సీనియర్ జర్నలిస్టులతో ఒక పాత్రికేయసహకారసంఘాన్ని ఏర్పాటు చేసారు.

ఈ సంఘం ద్వారా ఆయా ప్రాంతాల్లో స్థానికంగా ఉన్నవారినుంచి పెట్టుబడులను సమీకరించారు.

ఎక్కడికక్కడ లోకల్ ఎడిషన్లను ఏర్పాటు చేయడం. అందులో ప్రకటనలద్వారా వచ్చే సొమ్ము లో సగభాగం పత్రికా నిర్వహణకీ, మిగిలిన సగభాగం పెట్టుబడులు పెట్టినవారికీ, పత్రికల అమ్మకాల ద్వారా వచ్చేఆదాయం పాత్రికేయులకీ, ఇతర సిబ్బందికీ జీతభత్యాలు చెల్లించే విధంగా ప్రణాళికను సిద్ధం చేసారు.

పత్రికను అన్ని జిల్లా కేంద్రాలనుంచి ఒకేసారి సాయంకాలపత్రికగా తీసుకురావాలన్నది వారి సంకల్పం.

మల్టీ ఎడిషన్లుగా సాయంకాల పత్రిక ప్రారంభం కావడం దేశంలో ఇంతవరకూ లేదని చాలామంది సీనియర్ జర్నలిస్టులు సలహా ఇచ్చారు.

టీవీ న్యూస్ఛానళ్లు పెరిగిపోవడంతో ఎప్పటివార్తలు అప్పుడే వచ్చేస్తున్నాయి. అందువల్ల తర్వాతరోజు ఉదయం పత్రికల్లో వచ్చేవార్తలపై పాఠకులకుఆసక్తి అంతగా ఉండడం లేదని, అందువల్లే పత్రికల్లో వార్తలు కన్నా ఇతర ఫీచర్లు ఎక్కువగా ఉంటున్నాయని కొంతమంది జర్నలిస్టులు చెప్పారు. దీనికి ప్రత్యామ్నాయంగా పాఠకులకు తాజా వార్తలు అందించాలంటే ఏరోజు జరిగిన సంఘటనలను ఆరోజే సాయంత్రం ఐదు గంటల తర్వాత అందిస్తే బాగుంటుందని వారు చెప్పారు.
ఆవిధంగా పత్రిక నడిపితే తర్వాతరోజు ఉదయం వచ్చే పత్రికలు కూడా మన పత్రికలోని వార్తలనే ఫాలో అవుతారంటూ వారు చెప్పిన అంశం అందరికీ బాగా నచ్చింది.
అయితే పత్రికను ఎన్ని పేజీల్లో తీసుకురావాలన్నదానిపై కూడాచర్చ జరిగింది.
చివరికి ఎనిమిది పేజీల మెయిన్ ఎడిషన్ చాలని, లోకల్ ఎడిషన్ వార్తల ఫ్లో బట్టీ ఎనిమది లేదా పన్నెండు పేజీలుంటే సరిపోతుందని అంతా ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేసారు.
పత్రికను పూర్తి రంగుల్లో తీసుకొచ్చినా, ఇప్పుడున్న పేపర్ల ధరకన్నా సగం ధరకే పాఠకులకు అందజేస్తే పెద్దగా నష్టం ఉండదనే అంచనాకు అందరూ వచ్చేసారు.
ఇలా నెలరోజులపాటు రకరకాలుగా చర్చలు, సమావేశాలు జరిగాక సూర్యప్రసాద్ ఛీఫ్ ఎడిటర్గా, అశోక్వర్ధన్ న్యూస్ కో ఆర్డినేటర్గా "జనపత్రిక" మొదలైంది.
ఎలాంటి ఆడంబరాలు లేకుండా రెండు రాష్ట్రాల్లోని ఇరవైమూడు కేంద్రాల నుంచీ పత్రికను ఒకే రోజు ప్రారంభించారు.

×××× ××× ××××

జనపత్రిక ప్రారంభమైన తర్వాత రోజు ఉదయం ఎనిమిది గంటలు.

రెగ్యులర్‌గా వచ్చే పత్రికలు చదువుతున్నాడు అశోక్‌వర్ధన్. త్రిముఖంతోపాటు మరికొన్ని పత్రికల్లో అక్షరంపొల్లుపోకుండా హెడ్డింగులతోసహా ముందురోజు సాయంత్రం జనపత్రికలో ఏవార్తలు కథనాలు వచ్చాయో అచ్చంగా అవే కన్పించాయతనికి. సంతృప్తి కరంగా చిరునవ్వు నవ్వాడు.

ఇంతలో మొబైల్ రింగయ్యింది.

అవతలినుంచి త్రిముఖం రిపోర్టర్ జ్ఞానప్రసాద్ ఫోన్.

“గుడ్ మార్నింగ్ సార్! నేను జ్ఞానప్రసాద్‌ను మట్లాడుతున్నా”

“గుడ్ మార్నింగ్ ! చెప్పు ఏమిటి విశేషాలు?”

“ఏమీ లేదు సార్! మీ నెంబర్ తెలుసుకోవడానికి చాలా కష్టబడ్డాను. మీ జనపత్రికలో ఉన్న నంబర్లకు కాంటాక్ట్ చేస్తే ఇచ్చారు. ”

“సరే”

“మీ పేపర్ బాగా వచ్చింది సార్! పేజీలు తక్కువ గా ఉన్నా బాగుందని అంతా చెప్పుకుంటున్నారు”

“ఓకే!”

“మీరు త్రిముఖం నుంచి మానేసాక ఎన్నో జరిగాయి సార్! ఈ ఆరునెలల్లో మీకు తెలుసా?”

“అలాగా...!”

“అవును సార్! ....బిక్షపతి బాగోతాలు అంతా బయటపడిపోవడంతో అతనిని హైదరాబాద్ ఆఫీసులోని సెంట్రల్ డెస్కుకు రప్పించేసారు.

వరహాల్రాజు ఆఫీసులో నలభైలక్షల రూపాయలు గోల్‌మాల్ చేసినట్లు తేలడంతో అతనిని ఎండీగారి ఛాంబర్‌లో ఐదు రోజులపాటు నిర్బంధించి చితకబాది ఏవో బాండ్లు మీద సంతకాలు చేయుంచుకుని వదిలేసారు.

మీరు తప్పుకున్న తర్వాత మేనేజ్‌మెంటుకు తెలిసొచ్చింది. అంతా ప్రక్షాళన చేసేసారు....ఇప్పుడు నేనే స్టాఫ్ రిపోర్టర్‌ని ...........” చెప్పుకుంటూ పోతున్నాడు జ్ఞానప్రసాద్.

అతని మాటలను విన్పించుకునే పరిస్థితిలో అశోక్‌వర్ధన్ లేడు.

అతని కళ్లముందు కన్పిస్తున్నది జనపత్రికను మర్కెట్లో ఎలా నిలబెట్టాలన్నదే...

జ్ఞానప్రసాద్ ఇంకా ఏదో చెబుతుండగానే కాల్ కట్ చేసాడు.

వెంటనే జ్యోతిర్మయి నుంచి ఒక ఎస్సెమ్మెస్...అందులో ఇలా ఉంది

“ **సరికొత్త శుభోదయానికి ఇదే నాంది** ” అని.

-: అయిపోయింది :-

# ముగింపు మాటలు

ఈ నవలలో ఉన్న కథావస్తువుకు ఇది ముగింపు కాదు. దీనిని మరింత విస్తరించి మరో నవల రాయడానికీ ఎన్నో అవకాశాలున్నాయి. నేను విద్యార్థి దశలో ఉన్నప్పుడు కె.ఎన్.వై. పతంజలి గారి "పెంపుడు జంతువులు " నవల చదివాను. అప్పటికి పత్రికారంగంలోని అవలక్షణాలను ఆయన తన సహజధోరణిలో ఆనవలలో ఆవిష్కరించారు. అప్పటికీ ఇప్పటికీ పత్రికారంగం మరింత విస్తృతమైంది . ఎలక్ట్రానిక్ మీడియా, దానివెనుక సోషల్ మీడియా నేటి సమాజాన్ని చాలావరకూ ప్రభావితం చేస్తు న్నాయి.

సమాచారరంగం లాభసాటి వ్యాపారంగా మారిపోయిన గత రెండున్నర దశాబ్దాల పరిణామాల కు ప్రత్యక్ష సాక్షులుగా ఎంతోమంది ఉన్నారు. ఈ పరిణామాలను విశ్లేషిస్తూ రాసిన ఈనవల చాలా వరకూ వివాదాస్పదమౌతుందని కూడా నాకు తెలుసు. అయినా తప్పదు. పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియాలు ఇప్పుడు అధికార పక్షం చేతుల్లో పనిముట్టుగానో, ప్రతిపక్షం చేతుల్లో పరికరంగానో ఉన్నాయి తప్పా నిజంగా ప్రజాపక్షాన నిలిచే స్థితిలో లేవు.

పత్రికలను, ఎలక్ట్రానిక్ మీడియాను వాణిజ్యపరంగా నిలబెట్టుకోవాలంటే ఎంతకైనా దిగజారక తప్పదనే అభిప్రాయానికి ఇంచుమించుగా అందరూ వచ్చేసారు. దాంతో ప్రజాస్వామ్య స్ఫూర్తి ఈ రంగంలో కొడిగట్టిన దీపంలా రెపరెపలాడుతోంది. ఈ రంగాలను రాజకీయ వ్యాపారులు, కార్పోరేట్ శక్తులు విచ్చలవిడిగా వినియోగించుకొంటూ ఉండడంతో జర్నలిజం విలువలు మేడిపండు చందంగా తయారయ్యాయి.

సకల రంగాలలోనూ విలువల క్షీణత ఉన్నప్పుడు ఈ ఒక్కరంగం మాత్రం ఎలా పవిత్రంగా ఉండ గలుగుతుందని కొంతమంది మీడియా పెద్దలు ఎక్కడికక్కడ చెబుతుంటారు.ఇది ఒకరకమైన ఆత్మ వంచన మాత్రమే. వ్యక్తిగత బలహీనతలను కూడా మీడియా పరంగా వినియోగించుకుంటూ ఉన్న ఎంతో మంది పాత్రికేయరంగంలో ఏంచేస్తున్నదీ ఎన్నో సందర్భాల్లో గుర్తించిన తర్వాతే ఈనవల ఇలా రూపుదిద్దుకుంది.

మీడియా రంగం మాత్రమే ప్రజాస్వామిక కర్తవ్యాలను నిర్వహిస్తోంది అంటూ చాలామంది మీడడియా యజమానులు, సంపాదకులు ఎక్కడికక్కడ చెబుతుండడం, పాఠకులను, వీక్షకులని శ్రోతల

ను నమ్మిస్తుండడం నిత్యకృత్యమైపోయింది. నిజంగా ఈ రంగం ప్రజాస్వామిక విలువలకు, కర్తవ్యాల కూ కట్టుబడి ఉంటే ఆ విషయాన్ని గురించి పదేపదే చెప్పాల్సిన పని లేదు. రాయాల్సిన అవసరం కూడా ఉండదు. ప్రజలే ఆ విషయాన్ని గుర్తిస్తారు. ఈ రంగాన్ని నెత్తిన పెట్టుకుని నీరాజనాలు అర్పిస్తారు. కానీ అలా జరగడం లేదు. ఎందుకంటారా? ఈ రంగంపై ప్రజల విశ్వసనీయతని రోజు రోజుకూ మీడియా సంస్థలే తమ చేతలద్వారా చెరిపేస్తున్నాయి. అన్ని పత్రికలూ, టీవీ ఛానళ్లూ అర్ధ సత్యాలను కూడా ప్రజలకు అందించలేకపోతున్నాయి. అందువల్లే ఒక విషయాన్ని తెలుసుకోవాలంటే ఒక పత్రిక చదివితే సరిపోవడం లేదు. కనీసం మూడు నాలుగు పత్రికలు, నాలుగైదు టీవీ ఛానళ్లు చూస్తేగానీ ఎంతో కొంత తెలియడం లేదని అంతా వ్యాఖ్యానిస్తుండడంలో ఎన్నో నిజాలున్నాయి.

కొన్ని పత్రికలు, ఛానళ్లు తాము బలపరిచే రాజకీయ పార్టీ ప్రతిపక్షంలో ఉంటే తాము ప్రజా పక్షంలో ఉన్నామని, ప్రభుత్వానికి వ్యతిరేకంగా వార్తాకథనాలు ప్రచురించి ప్రసారంచేస్తూ ఉంటాయి. ప్రజల తరుపున తామే పోరాడుతున్నామని చెబుతుంటాయి. అదే అధికారంలో ఉన్న రాజకీయపార్టీ చేతిలో పత్రిక ఉంటే ఆ ప్రభుత్వంపై ఈగ వాలనివ్వకుండా వార్తలు ఇస్తుంటాయి. దీంతో ఏది నిజమో అబద్ధమో తెలియని అయోమయం జనాన్ని నిరంతరం వెంటాడుతూ ఉంటోంది.

వాస్తవానికి మీడియా,పత్రికా సంస్థలు ప్రజల పక్షాన కాదు కదా? తమ సంస్థల్లో పనిచేసేవారి పక్షాన కూడా ఉండడం లేదని చెప్పడానికి ఎన్నో నిదర్శనాలున్నాయి. తమ సంస్థల్లో పనిచేసేవారిని తమ ఉద్యోగులుగా అధికారికంగా గుర్తించడానికి అవి ఇష్టపడవు. తమ సంస్థల్లో పనిచేసే జర్నలిస్టుల కూ,నాన్‌జర్నలిస్టులకూ ప్రయోజనం కల్గించేవిధంగా ప్రభుత్వాలు ఏవైనా చట్టాలను చేస్తే వాటిని అమలుచేయనివ్వకుండా ముందుగా అడ్డుపడేవి ఈ సంస్థలే.

ఏ పత్రికా మీడియా సంస్థలో ఎంతమంది జర్నలిస్టులు,నాన్ జర్నలిస్టులు ఉద్యోగులుగా ఉన్నారని కార్మికశాఖకు సమాచారం అడిగితే అక్కడి అధికారులు బిక్కముఖాలు చూపిస్తుంటారు. అదీ మన మీడియా సంస్థల వారి నిజాయితీ.

చాలా పత్రికలు, న్యూస్ ఛానళ్లు మండల స్థాయిలో లోకల్ రిపోర్టర్లతో వెట్టిచాకిరీ చేయించుకుంటు న్నాయి. కొన్ని సంస్థలైతే జిల్లా రిపోర్టర్లకు కూడా నెలనెలా వేతనాలు సక్రమంగా ఇవ్వవు. వారంతా రకరకాల పద్ధతుల్లో ప్రైవేటు సంపాదనపై ఆధారపడిపోతుంటారన్నది బహిరంగ రహస్యమే.

కార్మిక చట్టాలనే కాదు చివరికి ప్రజాస్వామికంగా జరగాల్సిన ఎన్నికల ప్రక్రియ అంటే ఈ సంస్థలకు కోట్లాదిరూపాయలు సమకూర్చే ఆదాయవనరుగా మారిపోయింది. చెల్లింపువార్తలు వంటివి ప్రచురించకూడదని, ప్రసారం చేయకూడదని, సర్వేలు నిర్వహించకూడదని భారత ఎన్నికలసంఘం ఎన్ని నిబంధనలు ప్రకటించినా వాటన్నింటినీ కాలరాయడమే వీటిపని. రకరకాల పద్ధతులలో పెయిడ్‌న్యూస్ కోసం ఈ సంస్థలన్నీ ఒకదానితో మరొకటి పోటీపడుతూ ఎన్నికల ప్రచార వార్తల

కవరేజ్‌కు కూడా కలెక్షన్లు చేసుకుంటున్న మన మీడియా, పత్రికా సంస్థలు ఎంతమేరకు ప్రజాస్వామిక విలువలకు కట్టుబడి ఉన్నాయో? ప్రజాస్వామిక కర్తవ్యాలను నిర్వహిస్తున్నామంటూ చెబుతున్న ఈరంగంలోని పెద్దలు ఒకసారి నైతిక విమర్శ చేసుకోవాల్సిన అవసరం ఉంది.

ఈ పతనం దిగువ స్థాయికి కూడా వ్యాపించేసింది. తనకు మద్యం బాటిళ్లు, చేపలు,చికెన్, మాంసం వంటివాటిని రెగ్యులర్‌గా అందజేసే లోకల్‌రిపోర్టర్ల వార్తలను మాత్రమే ప్రచురించి మిగిలిన రిపోర్టర్ల వార్తలను కిల్ చేసే ఎడిషన్ ఇన్‌ఛార్జ్‌లు, తమ మొబైళ్ల నంబర్లకు టాక్‌టైమ్ రీఛార్జ్‌చేసే రిపోర్టర్లవార్తలకే ప్రాధాన్యతనిచ్చి ప్రచురించే సబ్‌ఎడిటర్లూ, బియ్యం, కూరగాయలు, ఇంటిసరుకుల కోసం రిపోర్టర్లని సతాయించే సబ్‌ఎడిటర్లూ ఎంతోమందిని గమనించిన తర్వాతే ఈ నవల రూపుదిద్దు కుంది. అయితే గంజాయివనాల్లో తులసిమొక్కల్లాంటి నిజాయితీపరులు కూడా కొంతమంది నిరంతర ం శ్రమిస్తున్నవారు ఈ రంగంలో లేకపోలేదు. తెలుగుపాఠకుల దురదృష్టం కొద్దీ వారి సంఖ్య అతి స్వల్పం.

ఈ నవల పాఠక లోకంలోకి వచ్చాక నన్ను ద్వేషించే మీడియా మిత్రులు పెరుగుతారు. అభిమానించేవారు కూడా ఉంటారు. ఎవరేమన్నా నేను చెప్పాల్సింది చెప్పకుండా ఉండడం మంచిది కాదనుకుని మీతో ఇలా నాలుగు మాటలు.....అంతే.......మళ్లీ కలుద్దాం.

– బెందాళం క్రిష్ణారావు

బెండాళం క్రిష్ణారావు....జర్నలిస్టుగా
పాత్రికేయుల రచయితగా అందరికీ
సుపరిచితులు....
రెండు దశాబ్దాలు దాటిన పాత్రికేయ
జీవితంలో ఏ వత్తిళ్లకూ తలొగ్గని
అక్షర పోరాటం....
మానవీయ పాత్రికేయ విలువలకోసం
అహర్నిశలూ ఆరాటం....
అక్షర మోసగాళ్ల వైనాన్ని బట్టబయలు
చేయడమే ఈ నవల లక్ష్యం....

